# పరమార్థ జడ్జిమెంట్






mohan
PUBLICATIONS
ఆధ్యాత్మిక గ్రంథ నిలయం

మోహన్ పబ్లికేషన్స్
కోటగుమ్మం, అజంతా హోటల్ ఎదుట,
రాజమహేంద్రవరం - 533101.

# విషయసూచిక.


| నెం. | | పేజి |
|---|---|---|
| 1. | పీఠిక | 1 |
| 2. | శ్రీసద్గురుమహిమ | 8 |
| 3. | గ్రంథారంభము | 15 |
| 4. | న్యాయస్థానమలంకరించుట | 19 |
| 5. | పిర్యాదుదాఖ్ఖలు చేయుట | 21 |
| 6. | ప్రతివాదులకు నోటీసు చేయుట | 23 |
| 7. | ప్రతివాదులు చేయు అన్సరు | 24 |
| 8. | కోర్టువారిచ్చిన ఇష్యూల వివరము | 27 |
| 9. | ప్రతివాదుల తరపు సాక్షుల విచారణ | 28 |
| 10 | ఘనాత్మవిచారణ | ,, |
| 11. | వాదివక్కీలు చేయుక్రాసు | 33 |
| 12. | కళత్రాత్మ విచారణ | 38 |
| 13. | పుత్రాత్మ విచారణ | 49 |
| 14. | దేహాత్మ విచారణ | 56 |
| 15. | ప్రాణాత్మ విచారణ | 63 |
| 16. | మనోమయుని విచారణ | 65 |
| 17. | విజ్ఞానమయుని విచారణ | 71 |
| 18 | ఆనందమయుని విచారణ | 78 |
| 19. | శూన్యాత్మ విచారణ | 79 |
| 20. | సాంఖ్యాత్మవిచారణ | 81 |
| 21. | సాంఖ్యకర్మవిచారణ | 82 |
| 22. | వాదితరపుసాక్షులవిచారణ | 89 |
| 23. | వివేకునివిచారణ | 89 |
| 24. | వైరాగ్యునివిచారణ | 99 |
| 25. | శమమనువానివిచారణ | 105 |
| 26. | దమమనువానివిచారణ | 109 |
| 27. | శ్రోత్రేంద్రియఆపదలు | 110 |
| 28. | త్వగేంద్రియయిడుములు | 111 |
| 29. | చక్షురింద్రియముచే గలుగనర్థములు, | 112 |
| 30 | రసనేంద్రియబాధలు | 113 |
| 31. | ఘ్రాణేంద్రియము వలని ఇడుములు | 116 |
| 32. | ఉపరతివిచారణ | 118 |
| 33 | శ్రద్ధయొక్కవిచారణ | 119 |
| 34. | సమాధానునివిచారణ | 121 |
| 35. | విశ్వాసునివిచారణ | 123 |
| 36 | ప్రతివాది వక్కీలుజేయు హియరింగి | 131 |
| 37. | వాదివక్కీలు జేయు హియరింగి | 132 |
| 38. | జడ్జిమెంటు ఆరంభము | 138 |
| 39 | 1-వ పైంటు ఇష్యూకు సమాధానము, | 139 |
| 40. | 2-వ పైంటుఇష్యూకు సమాధానము, | 140 |
| 41. | 3-వ పైంటుఇష్యూకు సమాధానము | 141 |

| నెం. | | పేజి. |
|---|---|---|
| 42 | 4-వ పైంటు ఇష్యూకు సమాధానము | 142 |
| 43 | 5-వ పైంటు ఇష్యూకు సమాధానము | 144 |
| 44. | న్యాయతీర్పుగు జడ్జిమెంటు | 144 |
| 45. | ఆరంభవాదము | 148 |
| 46. | పరిణామవాదము | ,, |
| 47. | వివర్తవాదము | ,, |
| 48. | హియరింగి ప్రమాణములు | 156 |
| 49. | సద్గురునాథుని కన్యంబు దేవుడు లేడనుట | 156 |
| 50. | శ్రీసద్గురుం డేలాగధికుండనుట | 158 |
| 51. | తానగు ఆత్మవస్తువు కన్యంబేది లేదనుట | 164 |
| 52. | సర్వం బ్రహ్మమయమనుట | 167 |
| 53. | భ్రాంతియే బహువిధములుగా తోచుననుట | 169 |
| 54. | మోక్షార్హులెట్టివారనుట | 171 |
| 55. | సద్గురువుల వెదకి శిష్యులు మనవి సేయవలయుననుట | 173 |
| 56. | శిష్యులకు త్రివిధదీక్షలచే స్వరూపోపదేశము సేయుదురనుట | 174 |
| 57. | అజ్ఞానారోపముచే, తన్ను మరచి బద్ధుడగుననుట | 176 |

| నెం. | | పేజి. |
|---|---|---|
| 58. | దుఃఖనివృత్తి అపవాద యుక్తియనుట | 179 |
| 59. | ఆత్మానాత్మ స్వరూపంబుల మరుగుపరచడము ఆవరణశక్తియనుట | 181 |
| 60. | వివేకముచేత నవివేకము మానుననుట | 182 |
| 61. | జీవునికేడవస్థలు గలవనుట | 184 |
| 62. | శమస్వస్వాంతముచేత నన్నెరుగ యేడవస్థలు న్నశించుననుట | 186 |
| 63. | సర్వసాక్షియే నీవు నీవే సర్వసాక్షియనుట | 187 |
| 64. | మహావాక్యలక్ష్యార్థము నందేవిధ భేదము లేదనుట | 191 |
| 65. | చతుర్విధమహావాక్యార్థవివరణము | 195 |
| 66. | తత్త్వమసివాక్యార్థము | |
| 67. | జహల్లక్షణము | 198 |
| 68. | అజహల్లక్షణము | 199 |
| 69. | జహదజహల్లక్షణము | ,, |
| 70. | లక్షణాత్రయములకు దృష్టాంతములు | 200 |
| 71. | ప్రజ్ఞానం బ్రహ్మ; అనుటకర్థము | 201 |
| 72. | అహం బ్రహ్మాస్మి మహావాక్యార్థము | 203 |

| నెం. | | పేజి. |
|---|---|---|
| 73. | అయమాత్మా బ్రహ్మ, అనుమహావాక్యార్థము | 204 |
| 74. | అనుభవానందము జెందినాడనుట | 206 |
| 75. | విఘ్నత్రయములచే బ్రహ్మజ్ఞానము స్థిరపడదనుట | 209 |
| 76. | అసంభావనలక్షణము | 211 |
| 77 | విపరీత భావనలక్షణము | ,, |
| 78. | సంశయభావనలక్షణము | ,, |
| 79. | శ్రవణమననాదులచేత విఘ్నత్రయములు చెడియాత్మజ్ఞానము స్థిరబడుననుట | 212 |
| 80. | షడ్విధలింగములవివరము | 214 |
| 81. | ఉపక్రమలక్షణము | ,, |
| 82. | ఉపసంహారలక్షణము | 215 |
| 83. | అభ్యాసలక్షణము | ,, |
| 84. | అపూర్వతాలక్షణము | ,, |
| 85. | ఫలలక్షణము | 216 |
| 86. | అర్థవాదలక్షణము | 217 |
| 87. | ఉపపత్తిలక్షణము | 218 |
| 88. | బ్రహ్మవిదాదులుం చతుర్విధములై యుందురనుట | 218 |
| 89. | వైరాగ్యలక్షణవివరణము | 223 |
| 90. | శుద్ధవైరాగ్యములు | 228 |
| 91. | తన్నెఱిగి తన్మయుండైనవారె జీవన్ముక్తులనుటకు | 233 |
| 92. | బ్రహ్మజ్ఞానికర్మములు జేసియు జేయనివాడనుట | 236 |
| 93. | బ్రహ్మజ్ఞానులు ప్రారబ్ధానుసారమనుభవింతురనుట | 241 |
| 94. | విదేహముక్తిని బొందుదురనుట | 245 |
| 95. | దృశ్యప్రపంచంబసత్యంబనుట | 249 |
| 96. | సర్వము తానై వెలిగెడు పరమాత్మయగు బ్రహ్మస్వరూపమె సత్యంబనుట | 253 |
| 97. | మంగళము | 258 |
| 98. | ప్రాతస్మరణత్రయం | 259 |
| 99. | సిద్ధాంతబిందు | 260 |
| 100. | విజ్ఞాననౌకాష్టకం | 622 |






ఓం.

శ్రీసద్గురు పరబ్రహ్మణేనమః.

# పరమార్థ జడ్జిమెంటు.



## పీఠిక.



శ్రీమదనంతకల్యాణగుణగణ సహితుండును, కేవలజ్ఞానానంద స్వరూపుండునునైన శ్రీసద్గురు స్వాములవారి కటాక్షవీక్షణములచే దేజరిల్లు పరమార్థజడ్జిమెంటను నీగ్రంథమునందు జెప్పబడు ముఖ్యాంశము లేవియన.

శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యనిర్మల పరబ్రహ్మమగు ఆత్మస్వానుభవము హరిహరబ్రహ్మేంద్రాదులకైన నిట్టిట్టిదని తెలిసి పొగడుట కసాధ్యమై, వాచామగోచరమై, షడ్భావవికారశూన్యమై, అసంగనిర్వికల్ప, నిరంజన, నిష్కళంక, తేజోమయంబై, సకలచరాచరసంపూర్ణమై, సర్వముదానై, సర్వసాక్షియై, త్రికాలాబాధ్యమై,

సర్వకల్పనాతీత, స్వయంప్రకాశ శుద్ధనిర్గుణచైతన్యంబై, అపరోక్షసాక్షాత్కారంబై, పరమార్థంబై, సర్వజీవుల బుద్ధియనెడు గుహాలోపల నధిష్ఠించి (అహామహామని) యనగా నేను నేనని మదినిస్ఫురించుచు ప్రత్యక్షముగా వెలుగుచుండును॥ శ్లో॥ ఆచారక్రియతేకోటి దానంచ గిరికాంచనం। ఆత్మతత్వం విజానాతి ముక్తిర్నాస్తి గురోర్వినా॥ అనెడి శ్లోకరీతిగా నిత్యనైమిత్తికాది సత్కర్మానుష్ఠానసదాచారములుయథావిధినాచరించినప్పటికిని, కొండంత బంగారమును దానముచేసినప్పటికిని, సద్గురుకటాక్షము లేనివారి కాత్మస్వానుభవమున్ను, జీవన్ముక్తియునుగలుగజాలదు. మరియు ॥శ్లో॥ దుర్లభోవిషయత్యాగో దుర్లభం తత్వదర్శనం। దుర్లభాసహజావస్థా సద్గురోః కరుణాం వినా॥ అనెడు శ్రీవరాహోపనిషత్తువాక్యరీతిగా ప్రపంచ [illegible] పవని తాది ప్రపంచవిషయభోగంబులందు విరక్తి గలుగుట బహుదుర్లభంబు. అట్లువిరక్తిగల్గినప్పటికిని ఆత్మానాత్మవివేకముగలుగుట మిక్కిలిదుర్లభంబు। అట్లాత్మానాత్మవివేకముగలిగినప్పటికిని సర్వసంకల్పరహితమగు తురీయసమాధియనెడి ఆత్మానుభవంబుగలుగుట దుర్లభంబు. అట్టి సహజాత్మానుభవంబు సద్గురు కరుణాకటాక్షము లేనివారికి యెంతకష్టపడినను స్వప్నేపి సిద్ధింపజాలనేరదు. మరియు॥ శ్లో॥ ఆత్మానాత్మవివేకేన పునస్సంసారం నిహ్నతి।

తత్త్వనాజన్మకోట్యాపి బంధచ్ఛేదోనసిద్ధ్యతి॥ అనెడి ప్ర
మాణమురీతిగా నాత్మానాత్మవివేకము చేసినవారికే జనన
మరణదుఃఖరహితమగు నిజముక్తి గలుగుననియు। నట్లుగా
క జపతపవ్రతయాగదానాది సత్కర్మానుష్ఠానము లెన్ని
జేసినప్పటికిని జన్మ రాహిత్యమైన నిజముక్తి గలుగదనియు
వేదాంతశాస్త్రములందు సత్యముగా జెప్పబడియుండుట
చేత సాధనచతుష్టయ సంపత్తిగల ముముక్షువు ఆత్మానుభ
వమును బొందుటకు ముఖ్యాధికారులని స్పష్టమగుచున్న
దిగాన అట్లు సాధనచతుష్టయసంపత్తిగలిగి నతితీవ్రతర
పక్వముచే బ్రకాశించు ముఖ్యాధికారులైన ముముక్షువు
లీగ్రంథమును జూచినమాత్రమున కరతలామలకంబువలె
ప్రత్యక్షముగా జూచురీతిని ॥శ్రు॥ ప్రాణేంద్రియాద్యం
తఃకరణగుణాదేః పరతరంసచ్చిదానందమయం సర్వసాక్షి
కం। నిత్యముక్తం బ్రహ్మస్థానం పరమపదం॥ అనెడి నిరాలం
బోపనిషత్తురీతిగా దేహేంద్రియ ప్రాణమనోబుద్ధ్యహం
కార చిత్తాది సకలతత్వములకంటెను వేరుగా సర్వసాక్షి
గానుండుచు అహమహమని స్ఫురించుచుండు ఆత్మయేని
త్యముక్త సచ్చిదానంద పరబ్రహ్మమనియును. మఱియు,
శ్లో॥ నాహం దేహేనేంద్రియాణ్యంత రంగం। నాహంకారః
ప్రాణవర్గోనబుద్ధిః। దారాపత్యక్షేత్ర విత్తాదిదూరస్సాక్షి
నిత్యః ప్రత్యాగాత్మాశివోహం॥ అనెడి శ్రీజగద్గురు శంకరా

చార్య స్వాములవారివాక్యరీతిని నీదేహేంద్రియ ప్రాణాంతఃకరణ మనోబుద్ధ్యహంకారాదులు నేనుగానని యును, దారాపుత్రాదులు, క్షేత్రవిత్తాదులు నేనుగానని యును, వీనినన్నిటినెఱుంగుచు కేవలసాక్షిమాత్రస్వరూపమై పరశివంబై వెలుగుచుండు ఆత్మయే నేననియును. మఱియు॥ శ్రు॥ దేహోదేవాలయః ప్రోక్తస్సజీవః కేవలశ్శివః। త్యజేదజ్ఞాననిర్మాల్యం సోహంభావేనపూజయేత్ ॥ అనెడి మైత్రేయోపనిషత్తువాక్యరీతిగా భౌతికములగు దేహములే దేవాలయములుగానున్న, యీదేహములందువసించి అహమహమనుచుండు యాత్మయే పరబ్రహ్మస్వరూపమనియు. మఱియు ॥శ్రు॥ అశరీరం శరీరేషు అనవస్థేష్వవస్థితం॥ అనెడు కఠోపనిషత్తురీతిగా నేనను నాత్మ అశరీరియై, నాశరహితుడై, సర్వశరీరములందు వాసము చేయుచున్నాడనియు. మఱియు ॥శ్రు॥ సర్వభూతాధివాసంచ యద్భూతేషు వసత్యపి। సర్వానుగ్రాహకత్వేన తదస్మ్యహం వాసుదేవతదస్మ్యహం వాసుదేవః॥ అనెడి అమృతబిందోపనిషత్తురీతిగా సర్వభూతములందు అధిష్ఠానస్వా వ్యాపించి యాభూతములయొక్క వికారము దానుబొందక వాటిని నియంతగా సర్వసాక్షియేదియున్నదో యా వస్తువే వాసుదేవ పరబ్రహ్మమనియు, నాత్మయనియు జెప్పబడునుగాన అట్టియాత్మస్వరూపుడగు నేను వాసు

దేవ పరబ్రహ్మమగుచున్నాననియు. మఱియు ||శ్రు|| మయ్యేవసకలంజాతం మయిసర్వం ప్రతిష్ఠితం మయి సర్వం లయంయాతి తద్బ్రహ్మాద్వయ మస్మ్యహం|| అనెడి కైవల్యోపనిషత్తు నుడువుటచే పరబ్రహ్మమగు నాయందే సకలచరాచర జగత్తుపుట్టి నాయందే వర్ధిల్లుచు మరల నాయందేలయించుచున్నది, కావున నాత్మస్వరూపుడగు నేనే పరబ్రహ్మమగుచున్నాననియు. మరియు ||శ్రు|| అయమాత్మాబ్రహ్మ అనెడి|| బృహదారణ్యకోప నిషత్తు ||శ్రు|| ||ఆత్మానారాయణఃపరః|| అనెడి నారాయణోపనిషత్తును ||శ్రు|| ||ఏకమేవాద్వితీయం బ్రహ్మ|| యనుఛాందోగ్య ఉపనిషత్తును, ఉద్ఘోషించుటంబట్టి, తనకు రెండవది లేక సర్వముదానై సర్వపరిపూర్ణమై సూర్యచంద్రాది వెలుగుల నెల్ల వెలిగించెడి పరంజ్యోతియై వెలిగెడు ఆత్మయే దానని తెలిసి. ||శ్రు|| సచ్చిదానందానుభవ స్వరూపంజ్ఞాత్వా| ఆనందరూపో యస్తితిస్స ఏవసుఖం|| అనెడి నిరాలంబోప నిషత్తువచించునటుల, సచ్చిదానందస్వరూపమగు ఆత్మానుభవస్థితి యందుండుట పరమసుఖమని దెలిసి సర్వసంకల్ప శూన్యంబై తన్మయంబుగానుండుచు జీవన్ముక్తులై ప్రకాశించుచునుందురు కాబట్టి యిటులెల్ల మానవులును కైవల్యముక్తిం యను పరమపదమును బొందునిమిత్తమై, ముముక్షువగు జీవుడు సులభముగా దెచ్చెడు వ్యాజ్యస్వరూపమెట్లనగా||

శ్రు॥ గురుస్సాక్షాదాది నారాయణఃపురుషః॥ అనెడి మహానారాయణోప నిషత్తు. మఱియు ॥నగురోరధికః కశ్చిత్రిషులోకేషువిద్యతే॥ అనెడు యోగశిఖోపనిషత్తు నుడివినటుల, బ్రహ్మానందరాజ్యంబునంగాయాపురియను నగరంబున నవద్వారపుకోటలోన, హృదయాకాశ ప్రణవమంటపమున వెలిగెడు వేదాంతోచిత పరమార్థ న్యాయతీర్పుకోర్టునందు తురియసింహాసనమున నచల స్వరూపుడై, జడ్జిగారగు శ్రీసద్గురుప్రభు చక్రవర్తి సమానరహితుడై, ఆసీనుడైయుండ తత్కాలమందు జరుపంబడు వ్యాజ్యసంబంధకక్షివారలలో, వాది ముముక్షువను జీవుడు, వాదివకీలు, అతిసూక్ష్మగ్రాహ్యసాత్వికాంశబుద్ధి, వాదిసాక్షులు, ౧. వివేకుడు ౨. వైరాగ్యుడు ౩. శముడు ౪. ఉపరతి ౫. తితీక్షు ౬. శ్రద్ధ ౭. సమాధానుడు ౮. విశ్వాసుడు ౯. తముడు. మఱియు వాదితరపు దస్తావేజులు-నాలుగువేదములు ఉపనిషత్తులు-గీతాదిశాస్త్రములు, త్రిమతభాష్యములు, అద్వైతశాస్త్రములు.

ప్రతివాదితరపు, ప్రతివాదులు ౧. అజ్ఞానియు వానిచేజనించిన పామరుడు ౨. కామ్యకర్ముండు ౩. మూఢభక్తుడు ప్రతివాదుల వకీలు ఘోరమూఢబుద్ధి, ప్రతివాదులసాక్షులు:—౧. ధనాత్మ ౨. కళత్రాత్మ

౩. పుత్రాత్మ ౪. దేహాత్మ ౫. ప్రాణాత్మ ౬. మనోమయకోశాత్మ ౭. విజ్ఞానమయకోశాత్మ ౮. ఆనందమయకోశాత్మ ౯. శూన్యాత్మ ౧౦. సాంఖ్యాత్మ ౧౧. సాలోకాత్మ ౧౨. సామీపాత్మ ౧౩. సారూపాత్మ ౧౪. సాయుజ్యాత్మ. ప్రతివాదుల రికార్డులు, ఇహలోక కాముకులైన పెద్దల కాలమందు జరుపబడు గురుతుల ప్రకారము వ్రాయబడిన లెక్కలున్ను పరలోక కాముకులైన పెద్దలనుసరించివచ్చిన ఆగమపురాణేతి హాసములున్ను దాఖల్ జేసి వ్యాజ్యముజరుప ప్రియాదర్జి ప్రత్యుత్తరము. ఇష్యూలు, సాక్షివిచారణ, హియరింగి, జడ్జిమెంటు (తీర్పు) మొదలగువివరమున్ను వరుసక్రమముగా వ్రాయబడు యీపరమార్థజడ్జిమెంటను నీ గ్రంథమును మందాధికారులు జూచినప్పటికిన్ని చిత్తశుద్ధిగలిగి సులభముగా తన్నెరిగి నిజానందభరితులగునట్లు కొన్ని అంశములకు ప్రమాణోదాహరణములతోడ వ్రాయంబూనెదనుగాపున సఖండైకరసామృతపానముచే నిత్యతృప్తింజెందియుండు అపరోక్షానుభవయుక్తులైన పెద్దలు తప్పులెన్నక యానందింపగలరని వేడెదను.

ఇట్లు,

సర్వజన విధేయుడు.

కంచి, నిశ్చల, రామానందస్వాములు.



ఓమ్

సర్వంఖల్విదంబ్రహ్మ.

# శ్రీ సద్గురుమహిమ.

శుకరహస్యోపనిషత్తు.

నిత్యానందం పరమసుఖదం కేవలం జ్ఞానమూర్తిం।
విశ్వాతీతం గగనసదృశం తత్వమస్యాదిలక్ష్యం।
ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం।
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తన్నమామి॥

గురుగీత.

శ్లో॥ నిత్యానన్దాయ దత్తాయ నిర్మలాయచిదాత్మనే।
జ్ఞానోత్తమాయగురవే తస్మైశ్రీగురవేనమః॥
అజ్ఞాన తిమిరాన్ధస్య జ్ఞానాంజన శలాకయా।
చక్షురున్మీలితంయేన తస్మైశ్రీగురవేనమః॥
అఖండమండలాకారం వ్యాప్తంయేనచరాచరమ్।
తత్పదందర్శితంయేన తస్మై శ్రీగురవేనమః॥
జ్ఞానశక్తిం సమారుహ్య తత్వమాలావిభూషిణే।
భక్తిముక్తిప్రదాత్రేచ తస్మైశ్రీగురువేనమః॥

అనేకజన్మసంప్రాప్త కర్మధర్మవిదాహినే।
జ్ఞానానల ప్రభావేన తస్మైశ్రీగురవేనమః॥
గురుర్బ్రహ్మా గురుర్విష్ణు గురుర్దేవోమహేశ్వరః।
గురుస్సాక్షాత్పరబ్రహ్మ తస్మై శ్రీగురువేనమః॥
మన్నాధ శ్రీజగన్నాధో మద్గురు శ్రీజగద్గురుః।
స్వాత్మైవ సర్వభూతాత్మా తస్మైశ్రీగురవేనమః॥

సీ॥ వేదశాస్త్రపురాణవివిధాగమాది యంత్రోచ్చా
టనాది విద్యోన్నతములు, మతములద్వైతవా
మనవిశిష్టాద్వైత ద్వైతశాక్తికగాణపత్యములను,
దానంబు యజ్ఞంబు తపహోమ జపతీర్థమా
దిపూానిత్యకృత్యాదివిధులు। గురుతత్త్వవాక్య
విస్ఫురణదెల్పగలేవు మూఢులకివిమనోముఖ్య
సూత్ర॥ తే।గీ॥ ములుగడోచియు జిత్తంబుచలప
పరిచి। సర్వజీవుల నీరీతిసమయజేయు। గాన గురు
సేవకునుమది గలుగువాడు। అన్యములుమాని
గురుకృపనరయవలయు॥

సీ॥ కులమునాచారంబు బలముగాదెల్పుచు దిరిగెడి
గురువులుధరణిగలరు। బలమైనశీలంబు కులము
నాచారంబు దొలిగించి పరమాత్మ నెళవుజూపు।
గురువు గల్గుటజన్మసరిపాకముసగాని కలుగదు

నిత్యాత్ము గనగరాదు। ఆచారమునుశీల మనిపేక
పనను రహస్యార్థమబ్బు నాయనుచు దెలియ॥

॥గీ॥ వజ్రసూచనునుపనిషద్వాక్యమందు।
జననమును దేహమును జీవజాతికర్త।
మన్ని జాతుల యనుభవమురయనొకటి।
నానగులశీలముల నాత్మ గనగరాదు.

తే॥గీ॥ గురువులంచును బెక్కండ్రు తిరిగిధాత్రి।
శిష్యవిత్తాపహారణులై చేరియుంద్రు।
శిష్యులకు జన్మసంప్రాప్తి చేర్పలుడిపి।
యరుదెముక్తి బొందించెడు గురుడుతరుణి.

కం॥ ఘనుడైనగురువు నెరిగిన। మనుజునకును నిశ్చ
యైనమాటలవేలా। ఘనదేవమయుడు గురుడని।
యనవరతము గొలుచుకంటె నధికముగలదె.

కం॥ వ్యాపితమై సర్వాంతః। స్థాపితమైలోకసకల సచ
రాచరచి। ద్రూపమునై వెలిగెడిగురు। రూపుడు
కుడ్ర మొక్కియాత్మలో ప్రార్థింతుర్.

కం॥ నాశరహితుడనంతుడు। నైశిష్యకృతాపహారుడ
గు చుందనోవ్వ। ల్లాసిమై భక్తికార్యము। గాసిం
కనుజేయునట్టి ఘనునినుతింతుర్.

క॥ హరినేనను బ్రహ్మాదులు। పరికింపగ గురువెయు
నుచు భావించియునే। మరకితరము మరచినయా
పురుషుని పదపద్మములను బూజంతుసుమీ.

తే।గీ॥ శ్రుతిశిరోరత్న భూషణాన్వితమునగుచు।
నీరజాభము పోలికనిండివెలుగు।
చుంపువేదాంతకమల సూర్యాంశునైన।
గురునకే మ్రొక్కి వినుతింతుగుందరదన.

క॥ జ్ఞానమను శక్తినెక్కియు, నానాతత్త్వార్థభూష
ణములెసగగని। త్యానందపదవిజేర్చెడు। వానిప
దాబ్జముల భక్తివదలక తలతుక్.

క॥ ఏమార్గంబుననుగురు। స్వామికిసరిరాద దెట్టిబాడ
మొయున్నక్। శ్రీమత్కార విజ్ఞానము। చేమదితగి
లాత్మకన్న చెలువముగలదే.

తే।గీ॥ గురువుకంటె నిహాముబరమరయ లేదు।
టంచుశ్రుతులందు బలుమారువెంచబడును।
నొనరద్రికరణ శుద్ధిగానొకటిగాను।
నెంచిగురుపద పూజగావించవలయు.

సీ॥ ఏస్థలంబునగురు నెలమిదర్శించిన గామాది ష
డ్వర్గగర్వమడగు। నేదిక్కునను గురు పాదముల్సే
వించ సర్వదుఃఖాదులుసమసిపోవు। నెచ్చటగురు
నకు నచ్చుగామ్రొక్కిన భవబంధమునెల్లబార
దోలు। నెప్పుడు గురువరుడెలమిబోధించిన పరి
పూర్ణనిత్యాత్మ ప్రబలివెల్గు। తే॥గీ॥ముక్తిసిద్ధించు
సన్మార్గయుక్తిగల్గు। నాత్మతానని యితరంబులన్ని
మరచు। నేర్పుగలిగించు భ్రమలను నిగ్రహించు।
జేయు సద్గురుపాదరాజీవమహిమ.

మఱియు నిరాలంబోపనిషత్తు.



సర్వశరీరస్థ చైతన్య బ్రహ్మప్రాపకోగురు రూపా
స్యః॥ అనెడి శ్రుతి ప్రమాణములరీతిగా పిపీలికాది బ్రహ్మ
పర్యంతము సర్వజీవుల హృదయములందు సర్వసాక్షిగా
సర్వముదానై వ్యాపించియుండు పరబ్రహ్మమగు శుద్ధచై
తన్యమె పరమాత్మయనబడును. అట్టిపరమాత్మయే
సద్గురుడనబడును, అట్టిగురుబ్రహ్మమును యీపరమార్థజిజ్ఞా
సొంటు నిర్విఘ్నమై నెరవేరుటకు ధ్యానింపబడెను.

శ్రీరస్తు.

శ్రీసద్గురు పరబ్రహ్మణేనమః.

# పరమార్థ జడ్జిమెంటు.



౧॥ శ్రీకరయతులితకాంతిన్। ప్రాకటముగ సూర్య
చంద్ర పావకములు వే। జోక వెలిగించునదియెది।
యాకారణ వస్తుదలతు నంచితభక్తిన్॥

సీ॥ అగణితానందమై యచలప్రతాపమై జగదధిష్ఠాన
మై సత్యమగుచు। నిగమదూరంబునై నిత్యనిర్మ
లమునై సగుణనిర్గుణసర్వ సాక్షియగుచు। జగద
భిరామమై సంపూర్ణతేజమై పవలు రేయొకభంగి
భాసమగుచు। గగనాదిభూతమై ఘనచరాచర
మునై భగవద్విలాసముల్బలుకు శ్రుతులు.

తే।గీ॥ దేనియందున సకలంబు దెలియబుట్టు।
దేనియందున సర్వంబు దేజరిల్లు।
దేనియందున దృశ్యము ద్దెలియనగు।
దానినిర్విఘ్నమునకునై దలతునెపుడు॥

కం. సకలము దనలోనుండగ సకలంబునదానె వెలిగి
సన్నయమగునా। యకలంకగురునిబొగడుదు।సుఖ
సాగరజడ్జిమెంటు నూటిగ దెలుపన్॥

కం॥ శ్రీధరుడు యజుడుహరుడును। సాధనచేనరయలేని
సహజానంద। బోధాద్వైతంబునుదగ। సాధుల్కై
జడ్జి తీర్పు జాటుతుధరలోన్॥

తే। గీ॥ వ్యాసకాళిదాస వాల్మీక శుకశౌన। కాదిము
నులగవుల నమరదలచి। శ్రుతులునాదిగాగ
సొగసుగదగజేర్చి। చెపితి జడ్జిమెంటు చెలువ
మెరయ॥

సీ॥ పార్వతీపురమున బ్రబలిన మహనీయు। డరుడ్జోతి
వళ్లరుండనగబరగు। రామలింగాఖ్యుడు రమణి
యగాత్రుండు వారిపాదంబుల వలచికొలుచు।
భక్తశిఖామణి పరతత్వసుజ్ఞాని అరుణాచలస్వా
మి యార్యనుతుడు। నతనిశిష్యులలోననంత్యుం
డు నిశ్చలుం డనెడురా మానందుడార్యసేవ్యు॥

ఆ। వె॥ డైననేనుపరమ హంసబ్రహ్మానంగ। స్వామివే
దసార సాదుయుక్త। ములను శ్రుతులజూపి
మేలగుజడ్జిమెం। టవనియందు వ్రాతునధిక
ప్రీతి.

కం॥ కరణముల ద్రుంచిమేల్కని। కరణాంతబ్రహ్మమొ
సగు ఘనుడగుయచల। గురుకరుణామృతభాగ్య
ము దరుచుగనీన్యాయతీర్పు ధరలోనొసగున్॥

కం॥ ధరలోని వస్తుజాలము। త్వరజెడుతవి జెడనిదైన
దగునీగ్రంథం। బరయపఠనంబు సలిపిన। వరపు
రుషుడు శివుడెయంచు వచియింత్రుబుధుల్॥

## గ్రంథారంభము.



శ్రీమదఖండైక్య యద్భుతానంద స్వయంప్రకాశ తేజోమయమై ఉత్పత్తిస్థితి లయములు లేనిదియునై, ॥ఏకమేవాద్వితీయం బ్రహ్మ॥ యను శ్రుతిరీతిని స్వజాతీయ భేదములేనిదై, ॥బ్రహ్మమాత్రమసన్నహితి॥ యను శ్రుతిప్రకారము విజాతీయ భేదరహితమై, ॥నచక్షుర్న శ్రోత్రమపాణిపాద॥ మనెడి శ్రుతిమేరకు స్వగతభేదము లేనిదై, తనతేజస్సుచేత ననేక సూర్యచంద్రాగ్నుల కాంతులను దిరస్కరించునదియునై, చతుర్వేదముల చేతను షట్శాస్త్రములచేతను, అష్టాదశపురాణములచే తను, ఇతిహాసములచేతను, నిరువదియెనిమిది ఆగమము లచేతను, దెలియనలవికానిదై బహువిధములైన బ్రహ్మ క్షత్రియ వైశ్య శూద్రాది వర్ణములకు ధర్మానుష్ఠాన

కర్మములును, సత్వరజస్తమో గుణములును, పుట్టుట, పెరుగుట, బలియుట, చిక్కుట, ముదియుట, చచ్చుట యనెడి షడ్వికారములును, షడ్విధశక్తులును లేనిదియు నై బ్రహ్మేంద్రాదిదేవతలును, అసురులును, యనంతా సర్పగరుడగంధర్వ కిన్నరకింపురుష సిద్ధసాధ్య విద్యాధర చారణ అప్సరసలును, యక్షుగుహ్యాభూతములును, సూర్యచంద్రాదిగ్రహములును, నారదాది దేవఋషులు, బ్రహ్మఋషులు, యోగీశ్వరులు, మునీశ్వరులు, యతీశ్వరులు, కవీశ్వరులు మొదలగువారిచేత, సేవింపదగినదియు నై, కాలత్రయమందును నశింపకయుండునదియునై, ప్రకృతిగుణములును సంకల్పవికల్ప జననాదివికారములను లేనిదియునై, వినుటకును చూచుటకును ధ్యానించుటకును బొగడుటకునశక్యమై, యింతింతయని ప్రణుతింపరానిదియునై, పంచమలములు లేనిదియునై, విజ్ఞానస్వరూపమైనదియునై, యేదియంటరాని మింటినిండోలె నేక స్వరూపమైనదియునై, పంచావస్థలుమీరినదియునై, సత్యజ్ఞానానంద పరబ్రహ్మమై ప్రకాశించుచున్నైన ఆత్మను నజ్ఞానిపుత్రులైన పామర, కర్మి, మూఢభక్తులనువారలచే నపహరింపబడినదై యనంతకాలముగా ననాదిమాయాంధకారములో జిక్కి తన్ను మరచి యెంచనలవిగాని యనేక జన్మములనెత్తి పడరాని నిడుములబడి బుద్ధిపూర్వకమో

లేక అబుద్ధిపూర్వకమువల్లనో కూడిన సత్కర్మ పుణ్య పరిపక్వ విశేషముచేత మిక్కిలిహెచ్చైన మానవ జన్మమెత్తి నిష్కామ్యకర్మానుష్ఠానముచేత నీశ్వర కృప గలిగి దానివల్ల చిత్తశుద్ధియునుంగలిగి దానిపై నిత్యా నిత్యవస్తువివేకము, నిహాముత్రార్థ ఫలభోగవిరాగమును, దానిపై నింద్రియనిగ్రహమును, సర్వవ్యాపారరాహిత్య మును, శాంతశమదమశ్రద్ధా సమాధానముగలిగి యటు పిూదట మోక్షాపేక్షయను ముముక్షుత్వమునుబొంది మోక్షాధికారియైన జీవుడను వాడిల్లుకాలంగ మధ్య జిక్కువడి యగ్నిజ్వాలచేత సంభవించిన సహింపరాని తాపమును శుద్ధతీర్థస్నానముచేత సౌఖ్యమును జెందగో రినవాడై, చిక్కములో జిక్కువడి పరితపించు కాలమం దు దైవీకముగా విడబడి పరుగులిడు లేడిపిల్లమేరకు పం చపాశములతో జేరిన సంసారబంధములవీడి బైలుదేరిన వాడు నిదేసుఖమనిమదిదలచి వ్యర్థుడుకానివాడై తనకు సంభవించిన మాయాజన్య దుఃఖనాశమగు నాత్మలాభ మును పొత్తు, తనస్వాధీనమై తనతోపాటి యెల్లమానవు లును యనుభవించుట యత్యావశ్యంబుగాన, పైయాత్మ జ్ఞాన చోరదుఃఖనివారణ మయ్యేలాగుతానగు ఆత్మార మును, అరిషడ్వర్గాదులను ప్రతివాదుల వద్దనుండి తనకుదీసియిచ్చిరక్షించే నధికార్లులైతే ॥సీ॥ తగవున

గూర్చుండి ధర్మంబుతప్పితే తనకు నిల్లాలుకు దాకు జెడుపు। అర్థంబుకై చాడి యాశించి చెప్పితే నుభయ వంశంబులు నుడిగిపోవు। బకుపాతము జేసి పాపముగట్టిన బుత్రులకును దాకు బొందుగాను। గపటమైతగవునుగానక దీర్చిన కర్మునివంశంబుగాలిపోను। తే।గీ॥ వాదిప్రతివాది మాటలవరుస నెరిగి। సత్యమైనట్టిమాటలజాడ లెరిగి।యుభ యవాదులమాటల యుచితమెరిగి। తగవుదీర్చినవాడెపో ధర్మరాజు॥ అనెడి ప్రమాణమురీతిగా వాదిచే దేబడిన పిరియాదులను దావాసాత్తులను, ప్రతివాదులను ఉభ యకక్షుల సాక్షులను జక్కగావిచారించి తీర్మానించడము నకు మిక్కిలి సమర్థుడై, లంచముతీయనివాడై, సత్యుడై నిష్పక్షపాతియై, సూక్ష్మబుద్ధియుక్తుడై, పరమదయాళుడై, దుష్టనిగ్రిహశిష్టపరిపాలకుడై, సర్వాభిమానరహితుడై, యుపశాంతుడై, వేదాంతవిచారపరుడై సమరసభావుడై, సాత్వీకుడై, వితరణశాలియై యుండవలెను. అట్లులేని యెడల మనవంటి నిరపేదలైన ముముక్షువులకు నెంత మాత్రము న్యాయము దొరకనేరదని పలుతెరంగుల యోచించి తెలిసినవారినిగలిసి విచారించి సర్వలక్షణము లుగల పరమార్థన్యాయతీర్పుకోర్టు (న్యాయాధిపతి) జడ్జిగారగు శ్రీసద్గురుప్రభుచక్రవర్తిగారి సన్నిధానము నందు తనకున్యాయముగలుగునని మదినెంచి వచ్చిదా

పంద స్వరూపముగా దేజరిల్లు తానగు ఆత్మారామును సమస్తమైనవారును నిరాక్షేపముగా ననుభవించేలాగు దావాదెచ్చుటకు ప్రియత్నము జేసెను.

---

వేదాంతోచిత పరమార్థన్యాయతీర్పుకోర్టు జడ్జిగారగు సద్గురుప్రభు చక్రవర్తిగారికి న్యాయస్థాన మ లం క రిం చు ట.

---

శ్రుతి॥ గురుర్బ్రహ్మ గురుర్విష్ణుగురుర్దేవ
స్సదాచ్యుతః। నగురోరధికఃకశ్చిత్రిషులోకేషు
విద్యతే॥ యోగశిఖోపనిషత్తు.

శ్రుతి॥ ఆత్మానంరథినంవిద్ధి శరీరంరథమేవచ।
బుద్ధింతుసారథింవిద్ధి మనఃప్రగ్రిహామేవచ।
ఇంద్రియాణి హాయూనాహుర్విషయాంస్తేషు
గోచరాన్। జంగమాని విమనానిహృదగా
నిమనీషణః। ఆత్మేంద్రియ మనోయుక్తం
భోక్తేత్యాహుర్మహాషణయః। తతోనారా
యణస్సాక్షాద్ధృదయేసుప్రితిష్ఠితః॥

అనెడి పైంగళోపనిషత్తురీతిగానున్న. మఱియును.
పద్యము। సీ॥ అధికవైభవము బ్రహ్మానందనగరంబుగలదు

మిన్నులమిట్టివెలుగుచుండు। గోటచుట్టునగడ్తై మేటిప్రపంచంబు ద్వారముల్పది తర్కవాదబలము। వేదాంత సిద్ధాంతవీధులు విషయేంద్రియంబులంగళ్లు దేహాత్మబుద్ధి। వర్ణాశ్రమాచార నిర్ణయధర్మముల్కరితురగాదులు కర్మ ఫలము॥ తే॥ గీ॥ దృశ్యదర్శనరాగముల్ స్త్రీపురుషులు। గాగ యఖిలదృగాశలుగలిగినట్టి। పట్టణంబేలుసద్గురుపట్టభద్రు। డాత్మకాంతాసమేతుడై యవనినాథ॥ అనెడు శ్రీరామ స్తవరాజము మేరకు.

అఖిలాండభువనములకుమధ్య వేదాంత సిద్ధాంత వీధులున్ను, విషయేంద్రియంబులను యంగళ్లును, దేహాత్మబుద్ధి వర్ణాశ్రమాచార నిర్ణయధర్మములును, గరితురగాదులై దృశ్యదర్శనరాగములు స్త్రీపురుషులై తేజరిల్లు బ్రహ్మానందనగరంబను కాయాపురి పట్టణమునందు మిన్నులమిట్టివెల్గు సప్తప్రాకారములుగలిగి మహావున్నతమైప్రకాశించు (దశద్వారపురందేహ) మనురీతిగా బ్రహ్మరంధ్రింవినా నవద్వారపువిచిత్రికోటలోన వేదాంతోచిత పరమార్థన్యాయతీర్పుకోర్టను రహస్యార్థమహిమయు మంటపాంతరాళగర్భగృహమందు శుద్ధనోంకారతురీయంబను స్థిరసింహాసనమందు యారూఢుడై యాదిమధ్యాంత విహీనంబై స్వజాతీయ విజాతీయ స్వగతభేదశూన్యంబై

యనంతకోటి సూర్యచంద్రానలాలోకంబై స్వప్రకాశ జ్వలితాఖండ పరిపూర్ణనిత్యనిర్మల నిర్గుణనిర్వికల్ప నిరంజన నిర్వికార నిర్విషయా తీంద్రియావాఙ్మనసాగోచర యప్రమేయ శుద్ధబుద్ధముక్త కేవలాచింత్య యచలయనామయ నసంగ సర్వసాక్షి సర్వజ్ఞత్వాది యగణితసమగ్ర సుగుణపరిగ్రహుండై, సత్యజ్ఞానానంద సర్వవ్యాపక జ్యోతిర్మయ స్వరూపుడై, యాత్మనాయకిసమేతుడై, శుక వామదేవభృంగి నారదమార్కండేయ సనకసనందన సనత్కుమార సనత్సుజాత జనకాదిమునిపుంగవ సభాలంకారుడై, సమానరహితుడై నెల్లలోకములునేలు సద్గురుప్రభు చక్రవర్తియగు జడ్జిగారు కొలువమరియుండు సమయంబున, ఆధ్యాత్మిక ఆధిభౌతిక ఆధిదైవికములను తాపత్రయములను నొందిన ముముక్షువగు జీవుండను వాది సూక్ష్మగ్రాహ్యసాక్షికాంశ బుద్ధియను వకీలుద్వారా పిరియాదర్జి దాఖల్ చేయడమేమనగా—

---

## పిరియాదు అర్జి దాఖల్ చేయడము.

---

అనంతకల్యాణగుణగణ సమరస సన్మార్గసంపూర్ణ స్వతంత్ర చిన్మయస్వభావసువిచార వేదాంతోచిత పరమార్థ న్యాయతీర్పు కోర్టువారగు. యచలపరబ్రహ్మ

స్వరూపాపరోక్షసాక్షాత్కార సద్గురుప్రభు చక్రవర్తియై వెలుంగు జడ్జిగారిసన్నిధానమునకు నిరుపేదయగు ముముక్షువైన జీవుడనువాది పలుతెరంగుల నమస్కారములు జేసి వ్రాసుకొన్న పిరియాదర్జియేమనగా.

సర్వకాలసర్వదేశ సర్వవస్తువులయందు సమంబయి తానయ్యె వెలుగుచుండు ఆత్మార్థము యొకరికేగాక అందరికి బాధ్యతగలిగి యసంగమైనిండియుండగ యెప్పుడు లేకనే యిప్పుడు లోభగుణ ప్రధానులలో నగ్రగణ్యులగు మధుకైటభులతో సమానులైన యజ్ఞానియనువాడు బయిటరాకనే తనయొక్క యావరణశక్తిచేత నాత్మయొక్క అసంగత్వలక్షణము మరుగుపరచి విక్షేపకుని బంపి వానివల్ల గల్పింపబడిన వాసనలతోగూడిన పామరుడు కర్తమూఢభక్తుడను విరోధులుతానను యాత్మసొత్తును వారై తమతమ యనాత్మసొత్తులతోజేర్చుకొని తమతోగలసిపొయ్యేటట్టు హానిగలుగజేసినారు గనుక పైవివరించిన 'శివోహం'యను యాత్మసొత్తును, కల్పనాశూన్యంబై అనాదికాలారభ్య యసంగ స్వభావంబై యుండజేసి యికముందేకాలమునకైన పైప్రతి కక్షివారలు దురాక్ష్యజ్యమునకు రాకుండునట్లును, మరి వారి దుర్వాదముల రద్దుపరచి పైయజ్ఞానియగువాడు ఆత్మవస్తువును మరుగుపరచినమోసమున్ను ఆవరుణుండు

స్వయంప్రకాశప్రజ్ఞానమును అపహరించిన చోరియు, విక్షేపకుడు మిథ్యాజగము సృష్టించిన ఫోర్జరియున్ను మొదలగు యిటువంటిమోసము, చోరి, ఫోర్జరి తప్పిదములకుగాను కోర్టువారు దీర్ఘవిచారణలుగావించి వారల దండించుటయేగాక స్వయంప్రకాశంబై సర్వస్వాతంత్రంబైన ఆత్మసొత్తును సమస్తమైనవారున్ను నిరాటంకముగా ననుభవించి సుఖమొందజేయవలెనని ప్రార్థించెదను. దీనికిసాక్షులు ౧. వివేకుడు ౨. వైరాగ్యుడు ౩. శాంత్యాదులు ౪. విశ్వాసుడు యింకా వీరికిసమానులు ననేకులున్నారు. ఈ వివాద సంబంధశాసనములు ఉపనిషత్తులు, గీతాభాష్యములు, నద్వైతశాస్త్రములున్ను పిరియాదర్జితో దాక్కల్ జేసియున్నాను గనుక ధర్మదొరలు కటాక్షించి నిష్పక్షపాత న్యాయంబొసంగ మిక్కిలినొక్కి పదేపదే ప్రార్థించుచున్నాను. ఇట్లు ముముక్షుని చేవ్రాలు.



## ప్రతివాదులకు నోటీసుజేయుట.



ముముక్షువను వాది పిరియాదర్జితో దాక్కల్ జేసిన ఉపనిషత్ మొదలగు రికార్డులనుశోధించి సద్గురు

ప్రభు చక్రవర్తిగారు ప్రతివాదులకు జేయబడు నోటీసు ముఖాంతరమై తెలియపరచడమేమనగా, యసంగసంబంధమై దేజరిల్లు పొదువైననాత్మసొత్తును మీరున్ను మీతో జేరినవారున్ను దురాక్రమముగా మరుగుపరచుకొని దుర్వినియోగము పరచుచున్నారనియు, నట్లు జేయడము చట్టమునకు విరోధమనియును నెల్లమానవులున్ను దానున్ను ననుభవించేలాగు తీర్పు చేయవలెననియు, ప్రతివాదులు జేసినమోసము, చోరి, పోర్జరి మొదలగు తప్పిదములకు దండించవలననియు, ముముక్షువగు వాది మిమ్ముల ప్రతివాదులుగా జేర్చి పిరియాదర్జి దాక్కల్ జేసి యున్నందుచేత యీనోటీసుజూచిన తక్షణము హాజరై తగుమైనబదులు జెప్పవలెనుగాన మీతరపు సాక్షులతోనున్ను హాజరుకానియెడల క్రమప్రకారము విచారించి తీర్మానించబడునని కోర్టువారు ఉత్తరవుచేయుచున్నారు.

ప్రతివాదులుచేయు ఆన్సరు.

---

సర్వస్వతంత్ర చిన్మయస్వభావ సువిచారవేదాంతోచిత పరమార్థ న్యాయతీర్పుకోర్టువారగు యచలపరబ్రహ్మస్వరూపాపరోక్ష సాక్షాత్కార సద్గురుప్రభు చక్ర

వర్తిగారి సన్నిధానమునకు ప్రతివాదులగు ౧. అజ్ఞాని ౨. పామరుడు ౩. కర్మి ౪. మూఢభక్తుడు అను మేము నలుగురున్ను నమస్కరించి వ్రాసుకొన్న మనువర్జియగు యాక్షరు యేమనగా యీవాదియొక్క పిరియాదర్జి శుద్ధజూట్రా వివాదాంశమగు నేనను పరమార్థసొత్తు యెన్నటికిని యెల్లరకు సామాన్యముకానేరదు. అటుల యది అందరికి సొంతమనుట అబద్ధము. మేమొక్కొక్క రున్ను యనాదిగా మాసొంతమై యనుభవిస్తున్నాము గనుక ప్రయాదియగు వాది అర్హుడుకాడు. నర్హుడను నది యుత్తటక్కు ఇంతియగాక ఈవ్యాజ్యములోని నేనను దావాసొత్తు కాలాతీతమై మాయనుభవముగా యున్నది. వాటికి కాలదోషమైనందుచేత కాల నిర్ణయచట్టమునకు అతిక్రమించి యుండుటవల్ల దావా సొత్తును మావద్దనుండితీసి వాదికి యివ్వడమునకు కోర్టువారికి యెంతమాత్రము యధికారములేదు. వివాద సొత్తును మేము అక్రమముగా ఆక్రమించలేనందున మమ్ము దండించను యెంతమాత్రము చట్టములేదు. పై నుదహరించు నేనను ఆత్మసొత్తును మావద్దనే యెప్పటి వలె నుండచేయుటగాక, వాదిపిరియాదున్ను తోవుడు జేసిఆతప్పుదావావలన మాకుకలిగినఖర్చులు యావత్తు న్ను వాదినిచ్చేలాగు తీర్పుజేయవలయునని కోర్టువారిని పలుతెరంగుల ప్రార్థించుచున్నాము.

దీనికి సాక్షులు ౧. ధనాత్మ ౨. కళత్రాత్మ 3. పుత్రాత్మ ౪. దేహాత్మ ౫. ప్రాణాత్మ ౬. మనోమయుడు ౭. విజ్ఞానమయుడు ౮. ఆనందమయుడు ౯. శూన్యాత్మ ౧౦. సాంఖ్యవాధి ౧౧. సాలోకవాది ౧౨. సామీపవాది ౧3. సారూపవాది ౧౪. సాయుజ్యవాది వీటికి తగిన రికార్డులు ఇహలోక కాముకులైన పెద్దలకాలమందు జరుపబడు వాడుకప్రకారము వ్రాసిపెట్టినలెక్కలున్ను పరలోకకాముకులైన పెద్దల కాలమందు వారనుసరించిన కర్మకాండదస్తావేజులున్ను భక్తులనుసరించిన యాగమపురాణేతి హాసములున్ను వాయిదాప్రకారము దాఖలుజేసియున్నాము గనుక కోర్టువారు క్రమప్రకారము విచారించి క్రింది కోర్టువారు (హరిహరబ్రహ్మేంద్రాదులు) మాపక్షము తీర్పు జేసిన తీర్పునుకాయపరచకోరెదము. ఇట్లు అజ్ఞాని, పామరుడు, కర్మి, భక్తుడు నమస్కారములు. వక్కీలు ఘోరమూఢ బుద్ధిచేవ్రాలు.



## కోర్టువారిచ్చిన ఇష్యూలవివరము.

ప్రజ్ఞానఘన సత్స్వరూపులగు పరమపారమార్థిక న్యాయాధిపతులై వెలయు జడ్జిగారగు సద్గురుప్రభు చక్ర

వర్తిగారి సన్నిధానమందు వాదియిచ్చిన పిరియాదున్ను ప్రతివాదులిచ్చిన స్టేట్మెంటున్ను చదివించి వినిజూచి పైకోర్టువారునిచ్చిన ఇష్యూలుయేమనగా

౧-ది, వివాదసొత్తుగు తాననుఆత్మ సర్వసామాన్యమాలేక యెవరికైనా కొందరికి హక్కా?

౨-ది, ఈవాది పిరియాదు తేవడమునకు యర్హుడా కాడా?

౩-ది, ఈపిరియాదును కాలనిర్ణయ చట్టము బాధించుచున్నదా లేదా?

౪-ది, ఈపిరియాదులోని వివాదంబా ఆత్మసొత్తును యక్రమముగా దాచియుంచిన యెదురులు దండార్హులా గారా?

౫-ది, వాదికి దావాసొత్తును తీసియివ్వవచ్చునా కూడదా?

అను యైదు ఇష్యూలుయిచ్చి యిష్యూవాయిదా నియమించినారు. ఆ వాయిదాప్రకారము వాది ప్రతివాదులున్ను, సాక్షులున్ను హాజరైనతోడనే యసత్తైన లోకవ్యవహారములకు మొదట వాదితరపు సాక్షులను విచారించడము న్యాయస్థలమందు వాడుకగాయుండినప్పటికిన్ని అందుకువ్యతిరిక్తముగా యీలాటి కేసులలో గ్రంథ

వను జరపడము కోర్టువారికి యుక్తమని చట్టముయున్నం దుచేత కోర్టువారు మొదట ప్రతివాదితరపు సాక్షులను విచారించ నాజ్ఞాపించెను.



## ప్రతివాదులతరపు.

### ౧-సాక్షి ధనాత్మవిచారణ.



తాఁబట్టినపట్టు సాధించే ఘోరమూఢబుద్ధియను ప్రతివాదివకీలులేచి పేరుపిలిచి ధనాత్మయనువాని కోర్టు వారిముందునిలిపి సర్వశక్తిగలసద్గురుప్రభు చక్రవర్తిగారి సన్నిధానమందు నిజముతప్ప మరేమియు జెప్పడములేదని ప్రమాణముచేయించి ఈతీరున ప్రశ్నలుచేసెను.

ప్ర. నీవు యెవరు?

ఉ. ప్రజలు నన్ను పెద్దమనుష్యుడని వాడు కొందురు.

ప్ర. ఎందుచేనిన్ను పెద్దమనుష్యుడందురు?

ఉ. ప్రబలధనికుడని లోకులనుకొనుటచె.

ప్ర. అహంపదార్థమగు యాత్మనునీ వెరుగుదువా?

ఉ. ద్రవ్యమే అహంపదార్థమగు యాత్మయని యెరుగుదును.

ప్ర. అందుకు శ్రుతియుక్త్యనుభవములుగలవా?

ఉ. శ్రుతియుక్త్యనుభవములు పెక్కులుగలవు.

ప్ర. ధనమే యాత్మయనడమునకు శ్రుతియేదో జెప్పుము.

ఉ. నిర్ధనపురుషోపశ్వసమానః॥ యనియు॥ సర్వే జనాఃకాంచనమాశ్రయంతి॥యనియును॥

శ్లో॥ యస్యాస్తివిత్తంసనరః కులీనస్సపండితస్సశ్రుతవాౝ గుణజ్ఞః। సయేవవక్తా సచదర్శనీయ సర్వే గుణాఃకాంచనమాశ్రయంతి॥ యనిబర్తృహరియును॥ శ్లో॥ వేదమూలమిదంబ్రాహ్మ్యం భార్యామూలమిదంగృహం। కృషిమూలమిదంధాన్యం ధనమూలమిదం జగత్॥ అని నీతిశాస్త్రిం॥

శ్లో॥ ధనమార్జయకాకుస్థ ధనమూలమిదంజగత్తని॥ వసిష్ఠుడు॥

కం॥ ధనమూలము జగమంతయు ధనవంతునకిష్టమగు పదార్థములెల్లౙ। దనచేతిలోనివగుటను ధనమార్జింపంగ నెవ్విదమునవలయుౘ॥

కం॥ బడమెగల వెడగునైనను। బుడమింగలవార
లెల్ల భూషింతురు శ్రీ। వెడవాసిన దూషింతురు।
కడుపేదరికమునకంటె కష్టముగలదే॥ అని
భారతము॥

శ్లో॥ మాతానిందతి నాభినందతి పితా భ్రాతానసం
భాషతే। భృత్యఃకుప్యతి నానుగచ్ఛతిసుతః
కాంతాచనాలింగతే। అర్థప్రార్థన శంకయాన
కురుతే స్వాలాపమాత్రంసుహృ। తస్మాదర్థము
పార్జయశ్రుణు సఖేహ్యర్థేన సర్వేవశా॥ నీతి
శాస్త్రిము॥

తా॥ దరిద్రుని తల్లినిందించును, తండ్రిసంతోష
పడడు, అన్నతమ్ములు మాట్లాడరు, పనివాడుకోపబడును,
కొడుకు వెంబడిరాడు, ఆలు కౌగలించదు, స్నేహితుడు
పలుకరించడు కాబట్టియే సఖుడా ధనమునేసంపాదింపు
ము. ధనముచేత నందరు స్వాధీనులగుదురు. ఈ
హేతువులచేత ధనమునె ఆత్మగానిశ్చయింపబడినది.

శ్లో. వాసశ్చర్మ విభూషణాని పణినోభస్మాంగరా
గోధునా। గౌరేకస్సచ కర్షణేన కుశలస్సం
పత్తిరేతాదృశి। ఇత్యాలోభ్యవిముచ్య శంకర
మగాద్రత్నాకరం జాహ్నవి। కష్టంనిర్ధనికస్య
జీవితమహోదారైరపిత్యజ్యతే॥

తా॥ రుద్రుడు ధరించుటకు వస్త్రములు లేక చర్మమును ధరించెను, ఆభరణములులేక సర్పములధరించెను, గంధమునకు లేక భస్మమును ధరించెను, గుఱ్ఱమునకులేక ఎద్దునెక్కెను ఇట్టిదురవస్థలనుజూచి గంగ శివుని త్యజించి సముద్రమును ప్రవేశించెను కాన ద్రవ్యహీనుని కష్టమనునది భార్యకూడ పరిత్యజించునుకాన ధనమె ఆత్మయగును.

శ్లో॥ శత్రువత్ పుత్రదారేషు బందువర్గేషుచోరవత్।
పాతకీవసభామధ్యే అహోకష్టందరిద్రతాం॥
నీతిశాస్త్రం॥

తా॥ దరిద్రుడు భార్యాపుత్రులకు శత్రువలెను బంధువులకు దొంగవలెను సభికులకు పాతకునివలెను కనబడును కాన ద్రవ్యమే ఆత్మయనబడును.

కం॥ గడనగలమగనిజూచిన యడుగడుగుకు మడుగు
లిడుదు రతివలుధరలో। గడనుడుగు మగని
జూచిన నడపీనుకవచ్చెననుచు నగుదురు
సుమతీ॥

“కాబట్టి ధనముకలిగియుండుట బొందిలో ఆత్మను కలిగియుండుట”.

కం॥ కలదెతనికి ధనమతనికి జెలికాంౘ్రుం జుట్టము
లును జెలగుదురెందుర్ల్। గలిమిగలవాడె పురు
షుం డిలబండితుడగుటవిత్త మెనయన్వల
యుర్ల్॥

కం॥ విడిముడి యెడలినదేజం బెడసెడునటువంటి
వానికెల్ల క్రియలుబెం। పడగిచెడువేసవిని బరు
వడి నడరనివాగులవలె వలయుర్ల్ దెలియర్ల్॥

కం॥ అలతిపనికైనసాధకు డలవడ డర్థంబులేమి
నయ్యర్థంబుర్ల్। బలువితములనార్జించెడు వలతి
యతడె సర్వకార్యవరసాధకుడౌ॥ యీలాగు
శ్రుతులనేకముగలవు.

ప్ర. ద్రవ్యమే యాత్మయనుటకు యుక్తియేమి
జెప్పగలవు?

ఉ. ద్రవ్యము లేనివాని నడపీనుగని తిరస్కరిం
చి నన్నుజూచిన మాత్రమున అందరు
లేసి వందనమొనరించి నాకు ఆసనాదు
లిచ్చి మరియాదచేయడమేయుక్తి.

ప్ర. ద్రవ్యమె యాత్మయనుటకు అనుభవము
జూపుడు?

ఉ. నాద్రవ్య సముద్ధిని కండ్లతో జూచినప్పుడున్ను
చేతులతో తాకినప్పుడున్ను సంతోష
ముప్పొంగి సదానందముగా యుండడమే
యనుభవమని బధులు నుడివెను.

శ్రుతియుక్తియనుభవములతో జెప్పిన ధనాత్మవాదిని
జూచి వాదివకీలు సూక్ష్మగ్రాహి సాత్వీకాంశబుద్ధి
తర్కించి ప్రశ్న జేయుచున్నాడు.

---

క్రాసుప్రశ్నలు॥ నీవు ధనమే నేనని చెప్పుచున్నా వా? లేక ధనమునాదని చెప్పెదవా?

నీవు పైగనొసగిన దృష్టాంతములన్నియు తత్వశాస్త్రపరిశీలనలే మాత్రములేక అవ్యుత్పన్నులగు బద్ధసంసారులకు యొకపర్యాయముగా పురాణములందు కల్పింపబడు లౌకికన్యాయములేగాని వేదాంత తత్వశాస్త్రవిభక్షుణులగు పారమార్థికులకు అంగీకారములు కానేరవు. నేనివ్వబోవు తత్వశాస్త్రప్రమాణములవలన నీవిచ్చిన లౌకిక దృష్టాంతములన్నియు పూర్వపక్షపరచబడును. క్రమతర్కములందు నిలువక పటాపంచలు కాగలవు యదియెటులనగా.

శ్లో॥ అర్థానామార్జనేదుఃఖ మార్జితానంతురక్షణె। నాశేదుఃఖంవ్రయేదుఃఖం కిమర్థందుఃఖభాజనం। మాతాపుత్రవిరోధాయ హిరణ్యాయనమోనమః॥ యనియు॥

కం॥ దనమెచ్చిన మదమెచ్చును మదమెచ్చిన దుర్గుణంబుమానకహెచ్చుౕ। దనముడిగిన మదముడుగును మదముడిగిన దుర్గుణంబుమానును వేమా.

శ్లో॥ యథైవశృంగంగోఃకావే వర్థమానస్యవర్థతే తథైవతృష్ణావిత్తేన వర్థమానె నవర్థతే॥

తా॥ గోవుకొమ్ములు గోవు పెరిగినట్లంతయు యెల్ల పెరుగుచున్నవో ఆలాగే తృష్ణధనమెచ్చుకొలదియధికమగుచున్నదని భావము అట్టి ధనము నీచము ద్రవ్యార్జనమునందలి పడెడిపాట్లు.

శ్లో॥ భ్రాంతందేశ మనేకదుర్గవిషమంప్రాప్తం నకించిత్ఫలం। త్యక్త్వాజాతి కులాభిమానముచితం సేవాకృతానిష్ఫలా। భుక్తంమాన వివర్జితం పరగృహేష్వా శంకయాకాకవ। త్రృష్టేజృంభసిపాపకర్మపిశునేనాద్యాపి సంతుష్యసి। ఖలాలాపాస్సోఢాః కథమపిత దారాధన పరైర్ని

గృహాంతర్బాష్పం। హసితమపిశూన్యేన మన
సాకృతోవిత్తస్తంభప్రతి హతధియా। మంజలి
రపిత్యమాసే మోఘాసేకిమపరమతోనర్తయ
సిమాం॥

తా॥ రాళ్లతో ముండ్లతోనిండిన మిగుల కష్ట త్రోవలునడిచి అనేకదేశములుతిరిగి జాతియొక్కయు సత్కులముయొక్కయు యభిమానమువిడిచి నీచులసేవ చేసి మానము త్యజించి కాకివలె జిగ్గులేక పరులయిండ్ల యందు భుజించితి ద్రవ్యము లభించకపోయె ఇంకను తృప్తి జెందక పాపిష్టకర్మలకు నేడ్చెదవే అయ్యో తృష్ణా పలువలు పల్కుమాటలుసహించి కన్నీరు సంకటముచే రాలుట లోపలనే నణచి ఆపలువల ప్రీతికై శూన్య భావముచే వెడనవ్వునవ్వితి పాపిష్టులగు మహాలుబ్ధుల కందరికి వందనమొనర్చితి ఇంక నేకార్యములు పూను నట్లు చేసెదవే ఓ ద్రవ్యదురాశా అని ధనాపేక్షకు లోబడిన వారెట్టి నీచకార్యములుచేయుచున్నారో చూడుడు.

శ్రీభగవద్గీత

శ్లో॥ ఆశాపాశ శతైర్బద్ధా కామక్రోధ పరాయణాః।
ఈహంతే కామభోగార్థమన్యాయె నార్థసంచ
యాన్॥

తా॥ అనగా ఆశయనుత్రాళ్లచే నూరువిధములుగ గట్టబడిన కామక్రోధయుక్తులైనవారు కామభోగముల కొరకు అన్యాయముగ ధనము సంపాదించుచున్నారు.

ఋషులఅభిప్రాయము.

శ్లో॥ అర్థజానివిదుఃప్రాజ్ఞాః దుఃఖస్యైతానిదేహినాం।
అర్థస్యోత్పాదనేచైవ పాలనేచతథాక్షయె।
రాజతస్సలిలాదగ్నేశ్చోరతస్స్వజనేనపి। భయ
మర్థవతాంనిత్యం మృత్యోఃప్రాణభృతామివ।
యదాహ్యామిషమాకాశేపక్షిభిఃశ్వాపదైర్భువి
భక్ష్యతేసలిలేమచ్ఛైః తథాసర్వత్రవిత్తవాన్॥

తా॥ అర్థము కూర్చుటయందును పాలించుట యందును వ్యయముచేయుటయందును ఈదుఃఖములు నరులకు యెడతెగకయుండునని పెద్దలందురు. రాజు వల్లను, జలమువల్లను, అగ్నివల్లను, బంధుజనుల వల్లను, దొంగలవల్లను భయము దేహధారులకు మృత్యువెంబడించియున్నట్టు ద్రవ్యవంతులకుండును మాంస ఖండము ఆకసమున పక్షులచేతను భూమిమీద కుక్కలు మొదలగు క్రూరమృగములచేతను నీళ్లయందు చేపల చే తనునేరీతి భక్షింపబడునో అటులనే అర్థవంతుడును అంతట భక్షింపబడును.

శ్రీశంకరులు.

శ్లో॥ కిమభయమిహ వైరాగ్యం। భయమపిచకిం
విత్తమేవసర్వేషాం॥

తా॥ నిర్భయమగు పదార్థమేదనిన విరాగము, అందరికి భయము గలిగించు పదార్థమేదనిన, అర్థమే యనుట.

శ్లో॥ అర్థమనర్థం భావయనిత్యం। నాస్తితతస్సుఖలే
శస్సత్యం। పుత్రాదపిధనభాజాంభీతిః స్సర్వ
త్రైషావిహితారీతిః॥

తా॥ అర్థము అనర్థముగాభావించవలెను, అందుచే నేమాత్రమైనను సుఖనిశ్చయము లేదు.

మఱియు॥ గోచిపాతరాయుడు దొంగలమిండడు అన్నట్లు లోకానుభవమునందు ద్రవ్యములేనివాడు నిర్భయుడై యడవియందైన, యూరనందైన, లేక మరి యెచ్చటనైనను సుఖజీవియై యున్నాడుగదా; మఱియు ధనలోభమువల్లయప్పుయిచ్చినా లోకులపహరించుకొను టచే శోకమును బొందుకాలమందున్న దొంగలువచ్చి నప్పుడు ధనాపేక్షచేత నీవడ్డగించినయెడల నీప్రాణమునకే యపాయము వచ్చుటకు సందియములేక ప్రత్యక్షానుభవముగా నెరుగుదువు గదా ? యిట్లు సకలవిధ దుఃఖస్వరూపముగాగలిగి ప్రాణహాని గలుగ

జ్ఞేయు ద్రవ్యమును యేలాగుసుఖమన్నావు? పైనిజెప్పిన అనేక ప్రమాణములరీతిగా రవలేశమున్ను సుఖములేని ధనముచేత ననేకులు రాగద్వేషగర్వములనుబొంది పెద్దలను దిరస్కార యవమానములు మొదలైనయనర్థములు చేయుచుండుట యనుభవసిద్ధమైయుండగా దుఃఖాస్పదమగు ద్రవ్యము నిత్యానందాకారమైన యాత్మస్వరూపమని యేలాగుజెప్ప సాహసించినాడవు, అని ప్రశ్నచేయ నపుడీధనాత్మయనుసాక్షి బదులుచెప్పుటకు యేదిదోచక దిగ్భ్రమజెంది నిశ్చేష్టితుడై ఆకులు లేని త్రాటిమానుమేరకు కదలకమెదలక నిలువబడియుండ గోర్టువారు వానిముఖమునుజూచి చిరునవ్వునవ్వి తప్పుసాక్ష్యమివ్వవచ్చిన వీని అజ్ఞానగాఢాంధకారమగు కారాగృహమున బడద్రోయించి విషయేంద్రియ సర్పములచేత హింసింపజేసి, అసత్యమువలికిన వీనినాలుకను ఆశయను ఖడ్గముచే ఖండించుడని యాజ్ఞాపించి జడ్జిగారు రెండవసాక్షిని పిలువ నాజ్ఞనొసంగెను.

## ౨-వ సాక్షి, కళత్రాత్మ విచారణ.

సద్గురుప్రభు చక్రవర్తిగారగు జడ్జిసన్నిధానమున ప్రతివాదుల వకీలు ఘోరమూఢబుద్ధియనువాడు లేచి

కళత్రాత్మనుబిలిచి ప్రమాణముతీసి రెండవసాక్షిగా వచ్చిన నీవు నేననుయాత్మను నెన్నడైనా యెరిగి యున్నావాయని ప్రశ్న సేసినందుకు—

ఉ. సదా నాభార్యనే ఆత్మయని నిక్కముగా నెరుగుదును.

ప్ర. నీభార్యనే యాత్మయనిచెప్పుటకు శ్రుతి యుక్తియనుభవము లేవి?

ఉ. ప్రపంచమందు భార్యను అత్మనాయకియని యు, గళత్రాత్మయనియు, ప్రాణనాయకియనియు, నాత్మ కంటె ప్రియవస్తువు మఱొక్కటిలేదని శ్రుతులుమొద లైనవిచెప్పుటచే ప్రియురాలనియు నింక ననేకవిధములు గా శ్లాఘించి వాడుకొనెదరు, అందుచే నాత్మసము లని చెప్పవలసివచ్చినది. ఇందుకు శ్రుత్యుక్తులను గొన్ని యీాదిగువ నివ్వబడును.

శ్లో॥ శాస్త్రప్రయోగా ద్వివిధాచ్ఛవేదా। దాత్మా
హ్యనన్యః పురుషస్యదారాః। దారప్రదానా
న్నహిదానమన్య త్ప్రదృశ్యతేజ్ఞానవతాంహి
లోకే॥

తా॥ ధర్మశాస్త్రవచనమువల్లను బలుతెలుంగుల బాగడు వేదములవలనను మొగవానికి భార్యవేఱుగాన

ఆత్మయేయగుచున్నది, కాబట్టి వివేకులు అన్నిదానస ముులకంటే కన్యాదానము ముఖ్యమనియు జెప్పెదరు. ॥శ్రీమద్రామాయణము॥

మఱియు, వస్తుతత్వజ్ఞానముగలిగి జగన్మిథ్యయని యు, స్త్రీలు హేయులనియు జక్కగనెఱిగిన వసిష్ఠులు అగ స్త్యులు మొదలగు మహర్షులు భార్యలాత్మసములని యు వారలులేక నిత్యనైమిత్తికాదికర్మలు జరుగవని మనోనిశ్చయముగలవారలై భార్యాసమేతులై వెలసిరి మఱియు వారలెవరనిన,

శ్లో॥ యథాశచీమహా భాగాసక్రం సముపతిష్ఠతి। అరుంధతీ వసిష్ఠంచ రోహిణీశశినంయథా॥ లోపాముద్రాయ దాగస్త్యం సుకన్యాచ్చ వనుంయథా। సావిత్రీసత్యవంతంచ కపిలం శ్రీ మతీయథా॥ సౌదాసంమదయంతీవ కేశినీసగ రంయథా। నైషధం దమయంతీవచ్చైమీాపతి మనువ్రతా॥ వరిష్ఠాసర్వనారీణా మేషాచదివి దేవతా। రోహిణీనళినాచంద్రం ముహూర్తమపి దృశ్యతే॥

తా॥ సచీదేవి ఇంద్రుని, అరుంధతీ వసిష్ఠుని, రోహిణి చంద్రుని, లోపాముద్ర అగస్త్యుని, సుకన్యా

దేవి వసుని, సావిత్రీ సత్యవంతుని, శ్రీమతీదేవి కపి లుని, మదయంతీ సౌదానుని, కేశినీ సగరుని, దమయంతీ నలుని ఈ ప్రకారము మహాత్ములవరించి, ఆత్మనాయకీతిలకులయిరి. ఇంతియగాక

“భార్యాసమోనాస్తి శరీరపోషణం” సకల పురుషార్థములకానుకూల్యంబైన శరీరమును బోషించుటకు భార్యకంటె నితరులెవ్వరు సమర్థులుగారనియు మిక్కిలినొక్కి వక్కాణించియున్నదికాన ఇల్లాలే ఆత్మయగును.

ఇంకను లోకోత్తమములగు అనుభవముల జూపబడును. ప్రపంచమందు ముఖ్యదైవంబులనబడు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులగు ముమ్మూర్తులు తమఇల్లాండ్రగు సరస్వతీ, లక్ష్మి, పార్వతీ దేవులను ఆత్మప్రియురాండ్రని నలువ తనయాలును నోటనుంచుకొనెను. విష్ణుదేవుండు తనదేవిని తనరొమ్మున నుండజేసెను. సాంబుండు దన పత్నిని సగముదేహముగాగొనెను. భార్యలు ఆత్మవంటి ప్రియవస్తువులగుటచే నీలాగు నంగీకరించిరి. వీరల పిచ్చివారలనవచ్చునా? భార్య తనమగనికి ఆత్మకాదని ఆక్షేపించువారలే శుద్ధ అవివేకులు. ఇంకను వినుండు, ఈ త్రిమూర్తులు తనపెండ్లాలు ఆత్మసదృశులేయగుట

చే వారలకు భృత్యస్యభృత్యులైయున్నారు. ఇందుకు గ్రంథదృష్టాంతము. "శంభుస్స్వయంభు హరయోహరి ణేక్షణానాంయెనాక్రియంతిసతతం గృహకర్మదాసాః" అనగా=శంభుడును, బ్రహ్మయును, హరియును, యే కారణముచే లేడికండ్లవంటి కండ్లుగల ఉమాసరస్వతీ లక్ష్ములను స్త్రీజనంబులకు సదావారలయింటి పనుల చేయుచుండు వారలగుదురో? అనిచెప్పియున్నది, మఱి యొక గ్రంథమందు, కొన్ని న్యాయంబులంబట్టి స్త్రీపురుష సంగమహేతువవలననే ప్రజావృద్ధియగుతున్నది. అటు గాక స్త్రీవేరుగానుండి బిడ్డలుపుట్టింపజాలదు. లేక పురుషుడుమాత్రమే వేరుగానుండి సంతానము వృద్ధిజేయంజాలడు. ఈకారణములంబట్టి భార్య ఆత్మయేయగును. ఇంకను కొన్ని యుక్తియుక్తములగు దృష్టాంతముల నివ్వబడును.

తే॥గీ॥ అఖిలదుఃఖరోగార్తున కౌషధంబు।
సుగుచిరంబుగ భార్యయేచూవెయొందు।
యొనరభార్యాసమేతుడై యలరువాని।
కెంతలాబదలయ్యును నెరుకపడవు.

కం॥ అలయునెడ డయ్యునెడనా। కలియు దృష్ణయు
నైనయెడల గడుకొని ధరణీ। తలనాథపురుషు

నకుని। మ్ములభార్యయుపాచు జిత్తమునదుఃఖం
బుల్॥ అని భారతాదివచనంబులె చాలినంత
యని సమయోచిత పురాణవాక్యంబుల దృ
ష్టాంతములిచ్చి తనకక్షిని బలపరచ ప్రయ
త్నించునప్పుడు.

వాదివకీలు సూక్ష్మగ్రాహ్యసాక్ష్యకాంశబుద్ధి లేచి చేయు క్రాసుప్రశ్నలు—అనగా సాక్షిని తర్కించి అడుగుట. నీవు సత్సాంగత్యము సద్గ్రిందపఠణము యెన్నడు జేయని బద్ధుండగుటచే నీమనంబున కానుకూల్యముల ఖునకొన్ని లౌకికగ్రంథముచే దృష్టాంతములిచ్చినాడవు, అవి దుర్బలములేగాని ప్రబలములుగానేరవు. పార మార్థిక విచారణయను జంఝామారుతమందు నీలౌకికోక్తులు పుల్లాకులవలె యెగిరిపోవునట్టివి, ప్రపంచమంద నేకకోట్ల స్త్రీజనంబులలో నీచే నుడవబడినవారలు బహుకొద్ది, వారలు నొకలెక్కలోజేరరు. సముద్రమందు ఆవగింజలు కొన్ని వేసినట్టు “అమృతంసద్గుణీభార్య” అన్నట్టు ఆయుత్తమస్త్రీలు యీమహర్షులకని యవత రించి యుందురు. వారలామహర్షుల తపోయజ్ఞాదుల కానుకూల్యలగుచుందురుగాని పశుప్రాయులై వర్తించు నరాధములవలె సంభోగాపేక్ష గొన్నవారలుగానేరరు.

ఇట్టి అధికస్వల్పసంఖ్యగల కులాంగనల దృష్టాంతముల నిచ్చుటచే ప్రయోజనంబులేదు. ప్రయోజనములేని త్రిమూర్తులైనవారి పత్నుల దృష్టాంతములిచ్చినాడవు అవి పండితాంగీకారములుకావు (పురాణః కల్పనాకథః) అనునది ప్రసిద్ధమేగదా? అందు దేవతాంతరములు, లోకాంతరములు, మతాంతరములు, ఇవిమొదలగునవి అర్థవాదంబులు, అజ్ఞులగు లౌకీకుల తృప్త్యర్థము ఔప చారములుగా చెప్పబడ్డవి, వేదాంతశాస్త్రపరిచయము గలవారికే దీనియదార్థము తెల్లంబగును. స్త్రీలుసామా న్యముగా తత్వార్థవేద్యులగు మహానీయులచే దూషితు లనుటకు ప్రబల దృష్టాంతంబులుంటున్నవి యీాదిగువ జూడనగును.

శ్లో॥ ఆత్మబుద్ధిసుఖంచైవ గురుబుద్ధిర్విశేషతః। పర బుద్ధిర్వినాశాయ స్త్రీబుద్ధిఃప్రళయంకరీ॥ అని నీతిశాస్త్రం నుడువుటచే త్రిమూర్తులు స్త్రీల తోగూడిన వారలనబడుటచేతనే వారల గౌర వము లల్పముగానెంచబడెను.

ఆ-వే॥ శిరము యోనివాని జింతింపదోషంబు। యురి
ము యోనివాని మరువవలయు। పుక్కిటయో
నివాని భూషింపదోషంబు। విశ్వదాభిరాను

వినర వేమ॥ "ఈశ్వరునకు వేసితి యిను మంత ఘనసొడ్డు। బ్రహ్మకు వేసితి పాడుసొడ్డు। విష్ణువుకు వేసితి విపర్యాసపుసొడ్డు। విశ్వదాభి రామ వినర వేమ॥

సీ॥ కోరికవలరాజు కుడిచి వేసినపుల్లె పద్మనాభుడు మోచు పసిడిదండి। వేడ్కతో జనులెల్ల విప్పి జూచిన బరణిగారాబుముల కెల్లకప్పచిప్ప। అజుడు దినమునుదప్పి కారగించెడుగిన్నె రాజుల బట్టెడు గాజుకుప్ప। సంకకప్పెరశివుని శిరసు కిరీటంబు మహిని౦ద్రుడును సొక్కమందుబుఱ్ఱ॥

ఆ-వె॥ పాడచదువనేర్చి పరికించిచూచును। యూడింపనేర్చుదానాడనేర్చు। నింతకంటె చేటు నికనేమిగానము। విశ్వదాభిరామ వినర వేమ॥

శ్రుతి॥ కేశకజ్జళధారిణ్యోదుస్స్పర్శాలోచనప్రియాః।
దుష్కృతాగ్నిశిఖానార్యోదహంతితృణవన్నరం।
జ్వలితాఅతిదూరేపి సరసాఅపినీరసాః।
స్త్రీమోహినరకాగ్నీనా మింధనంచారుదారుణం। కామనామ్నాకిరాతేన వికీర్ణాముగ్ధచేతసః।
నార్యోనరవిహంగానా మంగబంధనవాగురాః।

జన్మపల్వలమత్స్యానాం చిత్తకర్దమచారిణాం।
పుంసాందుర్వాసనారజ్జు ర్నాడీబడిశపిండికా।
సర్వేషాందోషరత్నానాంసుసముద్గికయానయా।
దుఃఖశృంఖలయానిత్య మలమస్తుమమస్త్రియా।
యస్యస్త్రీతస్యభోగేచ్ఛానస్త్రీకస్యక్వభోగభూః।
స్త్రియంత్యక్త్వాజగత్త్యక్తం జగత్త్యక్త్వాసుఖీభ
వేత్॥ యాజ్ఞవల్క్యోపనిషత్॥

తా॥ కాటుకదిద్దినకన్నులగల స్త్రీలనుజూచుటకు సుందరముగానున్నను వారలదాకరాదు, ఆజ్వాలకు పట్టుబడక దూరముగానుండవలెను. మరిన్ని కట్టెలను అగ్నిదహించి భస్మముసేయునటుల బురుషులను పాపమగు జ్వాలకు వొప్పగువారలు ధహించి నశింపచేతురు. మదనుడను కిరాతకుడు పురుషులనబడు పక్షులను ఆడువారను వలలనొడ్డిపట్టి బాధింపుచున్నాడు. జన్మమను తటాకమందు చిత్తమను అడుసున సంచరించు పురుషులను చేపల దుర్వాసనయను దారమునందు సంధించి స్త్రీలనుగాలములవేసి మన్మదుడను బెస్తవాడు పట్టి మోహామను ఇంగలమందు పచనముచేయుచున్నాడు. దుఃఖరూపముగల స్త్రీలుపురుషులకు గాళ్లసంకిళ్లను బోలుదురు. ఎవనికి స్త్రీగలదో వానికి భోగమందిచ్ఛకలుగును. స్త్రీలేనివానికి భోగమందపేక్షవుండదు.

స్త్రీతగలాటము వదిలెనేని జగత్తుతగలాటమువదులును. జగత్తుతగలాటముతీరినేని సుఖస్వరూపుడు కాగలడు.

ఆ-వె॥ భార్య తనదుపాలి బాఱసంకెల్లురా। చినచిన
శిశువులుజింజనాలు। సంసారమనియెడు చెర
సాలకొట్టము విశ్వదాభిరామ వినరవేమ॥

కం॥ పలలపు ముల్లునుకీకస। ములునునరంబులును
గల్లబాలసునజేయఁగ। వెలసినబొమ్మలగుంకొ।
మ్మలయంత్రపు నవయవముల మంచిదెదియ
గుఁగ॥

తేగీ॥ నల్లనెఱచినజర్మమునల్లబాష్ప। సలిలమును
వేరువేరుగాసల్పనేత్ర। మునువిచారింపదగు
రమ్యముగవెలుంగు। నేని మోహమునొందగా
నేటికిటుల॥

ఉ. ఏలలనాస్తనంబున నహీనసుకాంతులనొప్పు
నట్టిము। త్యాలసరంపుస్వాకృతి సురాచల
శృంగతటీవియద్ధునీ। మాలిక యట్లుచూడ
బడు మాన్యతనల్లదివల్లకాటిది। గ్జాలమునం
శ్వభక్ష్యమగుగాలముగూడిగగూటిముద్దగుఁగ॥

సీ॥ కేశకజ్జళధారిణుల్గిల్బి షాగ్ని। రూపులంట నశ
క్యులులోలనేత్ర। ఆత్మలోచనశిఖలచే నవని

నరులు దృణమునుంబోలె వడినిదహింపగరు॥
వాసిష్ఠము॥

కం॥ మరుడనుమేటికిరాతుడు। సరభసమున ముగ్ధ
లైన జనవిహాగములన్। గరమర్థిబట్టనోడ్డిన
యురులుసుమీధాత్రిలోన యువిదలుదలపన్॥
అని లఘువాసిష్ఠమును॥

శ్రుతి॥ ఆదిమధ్యావసానేషు దుఃఖంసర్వమిదంయ
తః। స్త్రీయంత్యక్త్వాజగన్త్యక్త్వం జగన్త్య
క్త్వాసుఖీభవేత్తని॥ మహావాక్యరత్నావళి
యనుజెప్పి వచ్చుటచేత నీవు భార్యను నే
నని జెప్పుతున్నావా లేక నాభార్యయనిజెప్పు
తున్నావా?

నీకన్యముగానుండి సదాదుఃఖమూలముగా
నుండు భార్యకు నీవు భయపడడము నీకంటె దేహబల
మనోబలములలో నధికమనియా? లేకవిద్యాబుద్ధిసామా
ర్థ్యసంపదధైర్యములచేతనో? లేక దేనియందధికురాలని
యాబిడకు భయపడుదువు? స్త్రీలయందువ్యామోహ
ము గలిగి వారలకు వశ్యుడై వారలచేతి కోతిపిల్ల చం
దంబున వారలచే నాడింపబడెదవు. ఈమాత్రమువల్ల
నారల శ్లాఘించిపలికెదవు. నీలోపురుషత్వముండెనేని

యీలాటిసిగ్గుమాలిన మాటలాడెదవు. మఱిన్ని నీవు భార్యముఖము జూచినంతనే దుఃఖములన్నియు నాశన మవునన్నావుకదా? అటులగాక భార్యనుజూచినంతనే కామవికారమగు దుఃఖమున్ను, శుక్లమోచనమైనదుఃఖమున్ను, వ్యాధివచ్చుననే దుఃఖమున్ను, స్త్రీకోరిన ప్రకారము వస్త్రాభరణములున్ను, పండుఫలాదులున్ను, పసుపుకుంకమ పుష్పతాంబూలచందనాదులు గోరి యిచ్చుటకు దనకు శక్తిలేనందున నాస్త్రీపరులపాలగునేమోయను క్లేశమున్ను, వ్యభిచరించునో లేక యేమవునోయను సందేహాదివెతలున్ను, నిట్లు బహువిధములైన వ్యసనములుగలుగజేయుస్త్రీల నేలాగు పరమానంద సుఖదాయకులని చెప్పవచ్చునాయని యడిగినందుకు నిందులకు దగినబదులాడనెటుదోచక మౌనమునవలంబించి దొంగవలె మిణకరించుచు బెనుమొద్దుమేరకు నిలువ గోర్టువారుజూచి వీనికి యీషణత్రయసంకెళ్లువేయించి జననమరణ సంసారమను సుడిగాలియందుద్రిప్పుటలువేట్టుడని యాజ్ఞావిధించినవారై మూడవసాక్షియగు పుత్రాత్మను బిలువమనెను.

---

## 3-వ సాక్షి పుత్రాత్మవిచారణ.

---

తనపట్టునే సాధించెడి ఘోరమూఢబుద్ధియను ప్రతివాదివకీలులేచి పుత్రాత్మయనుసాక్షిని బిలిచి సత్య

శక్తిగల సద్గురుప్రభు చక్రవర్తిగారి సన్నిధానమున నిజముతప్ప మరేమియు జెప్పడములేదు నేజెప్పునది సత్యమని ప్రమాణముచేయించి ఋజువుపరచునిమిత్తమై కోర్టువారియెదుట నడిగెడు.

ప్ర. నీపేరేమి?

ఉ. నాపేరు పుత్రాత్మ.

ప్ర. ప్రకృతకేసునందు దావాసాక్షిగు నేనను యాత్మనెరుగుదువా?

ఉ. పుత్రుడే ఆత్మయని యెరుగుదును.

ప్ర. ఏవిధమై పుత్రుడే యాత్మయనియెఱిగినాడవు?

ఉ. సదాయానందమై యుండుటచేత.

ప్ర. పుత్రుడేలాగానందమై యుండును?

ఉ. పొరిగింటి శేషయ్యకు పుత్రుడులేనందుచేతనే సదా దుఃఖమును బొందుచున్నాడు, నాకుపుత్రుడున్నందుచేతనే నెల్లప్పుడు సుఖముగనున్నాను.

ప్ర. నీవు పుత్రుడే యాత్మయనుటకు శ్రుత్యుక్తియనుభవములేవి?

ఉ. శ్లో॥ ఆత్మావైపుత్రనామాసి॥ పుత్రేణాలోకాఞ్జయతి॥ అపుత్రస్యగతిర్నాస్తి స్వర్గోనైవచనైవచ।

తస్మాత్పుత్రముఖం దృష్ట్వాభవేత్పశ్చాద్ధివాపసః॥ పున్నా మ్నో నరకాత్త్రాయతేస్వయం। తస్మాత్పుత్రయితిప్రోక్త స్స్వయమేవస్వయంభువః॥ అనియును.

కం॥ వినుగార్హ్యపత్యమునన। య్యనలము విహరింప
బడి తదాహవనీయం। బనవెలుగునట్లు వెలు
గును। జనకుడుదాబుత్రుడై నిజద్యుతితోడన్॥

కం॥ నీపుణ్యత ను వ ల నన్। నీపుత్రకుడుద్భవిల్లె
నెంతయునొప్పన్। దీపంబువలన నొండొక।
దీపముప్రభవిల్లినట్లు తేజంబెసగన్॥

కం॥ అనుదినసంతోషణములు। జనితశ్రమతాపదుః
ఖ సంశోషణముల్। తనయులసంభాషణము
లు। జనకులకును గర్ణయుగళ సద్భూషణ
ముల్॥

అనునటుల ఆత్మ నేపుత్రుడై పుట్టినాడను శ్రుత్యాదులుంగాక యొకదీపమునందు మరొకదీపమును వెలిగించినప్రకారము గుణరూపములన్నియు నామేరకుండున వేయుకొ్త. ఎంతవ్యసనమువచ్చినను పుత్రునిజూచినంత నేయవిమాని యానందమగునదే యనుభవమని జెప్పిన మాత్రమున వాదిపక్షీలుకోర్టువారిముందుగనిలిచి మూడవ సాక్షినడిగెను క్రాసుప్రశ్న॥ ఆత్మోహం॥ నేనను

యాత్మను నీవుపుత్రుడని శుష్కవాదములు సేసి నందు కై యిచ్చిన శ్రుతిస్మృతి దృష్టాంతములనపార్థములు సేయంబడినట్లు గానంబడుచున్నది. పుత్రశబ్దమునకు వాస్తవార్థమును దెలిసియుంటివేని మాంసాస్థి చర్మ రక్త మలజల సముదాయ మానుషాకార క్రిమివిశేష ములనఖండసచ్చిదానంద పరిపూర్ణవస్తు విశేషంబగు నీవుగా నెన్నవు. మఱియు నీమానుష శరీరతత్వస్థితి ఆధునిక దేహతత్వశాస్త్రిజ్ఞులు చిరకాలపరిశోధనలు సేసి కన్నదియేమనగా మానుషశరీరములోని మాంసరక్త రే తస్సు మూత్రపురీషములాదిగా గలవానియందు అసం ఖ్యేయములగు క్రిమిసముదాయములు నిబిడీకృతములై యుండునవియనియు వీనిలో దేనిపరిశోధించిచూచినను (మైక్రాస్కోపు యనుభూత అద్దపుగొట్టమునకు) గానం బడుననియు,స్త్రీపురుషసంపర్గసమయమునందు స్త్రీగర్భ ములో జొరబడిన స్ఖలితమొందిన రేతస్సులోని క్రిము లుకొన్ని పిండకోశమందు నిలుచుటగలవు వానిలో నొకటిరెండు నాశముజెందక స్త్రీగర్భములోని రక్తాదు ల నాధారముకొని కంబిళిపురువులు స్వయముగా నొక విధ కవచమేర్పరచుకొని మరియొక ఆకృతితో బయలు వెడలునట్లు మనుష్యరేతస్సులోని క్రిమియును నొకకవ చమును దా నేర్పరచుకొని యందులోను నవమాస

ములలో గరచరణాద్యవయములవృద్ధి నొందించుకొని పదియవమాసమున మానుషాకృతితోడ ప్రసవమునొందుటగలదు. ఇచ్చట పిండోత్పత్తిశాస్త్రము విశదముగా వ్రాయ ననానుకూలమగుటంబట్టి బహుసంగ్రహముగా చెప్పవలసివచ్చెను. ఈశాస్త్రమును అంగ్లేయభాష లోనిదియెత్తి వ్రాయంబడియుండునవి చదివినయెడల నీ విషయము తెల్లంబగును. ఈలాటి పరిణామములనొంది మానవాకృతిజెందినపుత్రుండనువాడుశుద్ధచైతన్యుడవగు నీవెట్లుయగుదువు. ప్రపంచమందు మనుజసామాన్యులు అనంతవిధభ్రములుజెందినట్లు అనృతజడదుఃఖరూపమగు పుత్రాకృతిని నీవగు సచ్చిదానంద స్వరూపమగు ననిభ్రమింపదగదు.

శ్లో॥ అలభ్యమానతనయః పితరౌక్లేశయేచ్చిరం। లబ్ధోహిగర్భపాతేన ప్రసవేనచబాధతే। జాతస్యగ్రహరోగాది కుమారస్యచధూర్తతా ఉపనీతేప్యవిద్యత్వ మనుద్వాహశ్చపండితే। యూనశ్చపరదారాదిదారిద్ర్యంచకుటుంబినః। పుత్రదుఃఖస్యనాస్త్యంతో ధనిచేన్మ్రియతేతథా॥ ఏవంవివిచ్య పుత్రోసౌప్రీతింత్యక్త్వానిజాత్మని। నిశ్చిత్యపరమప్రీతింవీక్ష్యతే తదహర్నిశం॥

తా॥ తలిదండ్రులకు పుత్రుడు లేనికాలమందును దుఃఖము, గర్భమందున్నపుడును దుఃఖము, గర్భభిన్నమైనను దుఃఖము, భూమియందుపుట్టినను దుఃఖము, పెరిగినను దుఃఖము, గ్రహరోగములందును దుఃఖము, బాల్యమందునుదుఃఖము, ఉపనైనవిద్యాభ్యాసకాలమందును దుఃఖము, సర్వదా పుత్రునివల్ల దుఃఖమేయనుభవించివచ్చుటచేత బుత్రునిపైనుంచియుండు ఆసక్తిని సర్వాత్మనా విడిచినవారై ఆత్మార్థమునందు బరమప్రీతి పెట్టవలయునని యాజ్ఞవల్క్యోపనిషత్తు.

సీ॥ సుతులు లేకుండెు సద్గతిలేదనిరిగాని తానుధన్యుండైతె తనయులేల। శుకమునీంద్రుడుభార్య సుతులునార్జించక వ్యర్థుడైపోయనా వసుధలోన। ధృతరాష్ట్రనకుదండి సుతులు నూర్గురుండి తాముద్ధరించిరాతండ్రినెల్ల॥ అను నరహరిశతకముచేతనున్ను గొట్టబడిపోయెనుగదా నీవు పుత్రుడు నీవనవచ్చునా లేక నాపుత్రుడనవచ్చునా? నాపుత్రుడనిన నీవువేరు నీపుత్రుడు వేరైగోచలేదా? మఱిన్ని పుత్రుడే యానందమనుటకు బోగింటిశేషయ్యగారు సాక్షియని జెప్పినావుగదా, వాడు పుత్రుడు లేనందుచేత సదావ్యసనము పొందుచున్నాడన్నావు. నీవు నీపుత్రుడు క్షేమముగానుండగోరి సదావ్యసనము పొందియున్నావుకదా? పుత్రుడే యాత్మయను శ్రుతి

స్మృతులు సామాన్యజనంబులకు ఔపచారికముగాఁజెప్పి నదేగాని యదార్థమా? పుత్రుని గుణరూపములు నీవల నే యున్నదన్నావుగదా? నీవు సుగుణుఁడైతే పుత్రుఁడు దుర్గుణశిఖామణియై యున్నాఁడు, నీవుదుర్గుణుఁడైతే వాఁడు సుగుణుఁడైయున్నాఁడు. తండ్రి అందగాఁడైతే పుత్రుఁడ వలక్షణుఁడై యున్నాఁడు. పుత్రునిఁజూచినంత దుఃఖ నాశనమై యానందము ప్రాప్తియగునన్నావుగదా? క్షుద్బాధమొదలైన వ్యాధివచ్చినకాలమందు భోజన ము మొదలగు యౌషధములులేకనే నీపుత్రునిఁజూచినం త పోతున్నవా? పుత్రుఁడే ఆత్మఁడైతె పుత్రుఁడుపుట్టినం దుకు ముందున్ను మృతిజెందిన వెనుకున్ను నితరమైన చోటులకు బోయియుండు కాలమందున్ను నీవుయుంటివి వాలేదా? మరియు నాత్మ యనునది యేకత్వమునుబొం ది నితరలక్షణములకు చోటులేక యేకలక్షణమై యుండ వలయును. అనేకబిడ్డలుగలిగితే యనేకలక్షణములు గలిగినయెడల ఆత్మనుజేరినవియే లక్షణమనియు నిట్ట నేక ప్రశ్నలుతర్కించి యడిగినందుకు నేమియు బదు లాడనేరక యున్నాదముపట్టినవానివలె నిరాకరించ గోట్టు వారుజూచి వీఁడు యప్రమాణసాక్షియని యెఱిగి వీనికి అజ్ఞానమను గాఢాంధకారగిడ్డంగిలోఁద్రోసి విషయానంద సంకెళ్లు గాళ్లకుదగిలించి పుత్రేక్షణయను సర్పములచేత

హింసింపుడనివిధించి నాలుగవసాక్షిని బిలువమని యాజ్ఞాపించెను.



## ౪-వ సాక్షి దేహాత్మవిచారణ.



ప్రతివాదివకీలు ఘోరమూఢబుద్ధియనువారు లేచి దేహాత్మయను ప్రతివాది సాక్షినిబిలిచి ప్రమాణము తీసి యీకోర్టువారియెదుట నీలపర్వతమునకు సమానమై నిలువబడియున్న నీవు వెవనికుమారుడవు, నీపేరేమియని యడిగినందుకు.

ఉ. నాతండ్రిగారిపేరు పుత్రాత్మ నాపేరు దేహాత్మ.

ప్ర. నీవేలాగు పుత్రాత్మకు జన్మించినావు?

ఉ. నాతండ్రిగారి శుక్లబలీయముచేత జన్మించినాడను.

ప్ర. నీకు నేనను ఆత్మనెరుగుదువా?

ఉ. ఆత్మయనునది ఈదేహమేగాక మరేమియు గాదని యెరుగుదును.

ప్ర. దేహమే యాత్మయనుటకు శ్రుత్యుక్త్యనుభవములేవి?

ఉ. దేహోహం॥ అను వేదవాక్యముగాక "శరీరమాద్యంఖలుధర్మ సాధనం" అనియు ॥శ్లో॥ స్మృతితో దుఃఖమూషోహం। హస్తపాదాదివానహం। ఇతి భావనరూపేణవ్యవహారేణబధ్యతే॥ యనివాసిష్ఠంబును।

కం॥ దేహముచెన్నగనుండిన పోషణతత్వంబులన్ని బొందుగ దెలుసుకా। దేహము బడలికబడినను బోషణతత్వములువచ్చి పొందవువేచూ॥ అను శ్రుతి వాక్యములును। దేహమునశించినవెనుక భోగములనుభవించడమునకు వీలులేనందున దేహమున్నప్పుడే సర్వము ననుభవించడమేయుక్తి, ఈజగమందేదిబాగుండిన ను ఆనందములేకనే దేహము మిక్కిలిసుందరస్థి యారోగ్యముగా నున్నయెడల నానందముకలుగుటదే అనుభవమనిజెప్పి దేహాత్మవాది నిలిచినంతనే నాతిపక్షి లు సేయు

క్రాసువిచారణ॥ ఈదేహమే యాత్మయనిజెప్పి నావుగదా? ఆలాగైతే ఆత్మను నాదేహమని జెప్పదగునా? మరియు నాత్మయొకనికి బుత్రుడుగా బుట్టినా? నీవు నీతండ్రిగారి శుక్లమునకు యుద్భవించినావని జెప్పి నావు కావున నీవు జడమైయుండవలనేగాని చిత్తైనానుంటకు గారణమేమి?

ఉ. నాపితామహుని శుక్లమునకు నాతండ్రిగారు జనించి చిత్తైయుండిన ప్రకారము నాతండ్రిగారిశుక్లమునకు నేనుజనించి చిత్తైయున్నాను.

ప్ర. ఆశుక్లమును జిత్తుగా జెప్పగూడునా?

ఉ. శుక్లము చిత్తైనందుచేతనే స్థూలమునుజిత్తైనటించు.

ప్ర. ఓయి నీజాతిని లోకులేమని వాడుకొందురు?

ఉ. నన్నుజూచి బ్రాహ్మణజాతియని లోకులందురును నాకునమస్కారములు సేయుదురు.

ప్ర. మానవులందరునేలాగునమ్మి నిన్ను బ్రాహ్మణజాతియందురు?

ఉ. తాతముత్తాతల కాలమందుండి బ్రాహ్మణపరంపరతో జేరిన నాతండ్రిగారి గర్భమందు నుద్భవించినందుచేతనే నన్నును బ్రాహ్మణవర్ణస్థుడందురు.

ప్ర. నీతండ్రిగారి శరీరమందు గలిగిన మలమూత్రాదులున్ను శుక్లరక్తరోమాదులు మొదలైనవి బ్రాహ్మణజాతిగానె యుండవలెను నవియన్ని యెందువలన బ్రాహ్మణజాతిగాకపోయెను, మరియు నిప్పుడు నీకేలాగుజీవనము?

ఉ. పంచవిషయములనుభవించడమే నాకు జీవనము.

ప్ర. నీవు పంచవిషయముల నెవరివలన ననుభవించుచున్నావు?

ఉ. దేహరూపియగు నావలన నేననుభవించుచున్నాను.

ప్ర. అయితే మరణమందును సుషుప్తిమూర్ఛా కాలములందును దేహరూపియైన నీవల్ల నేవిషయమునైనా నీవనుభవింతువా? మరియు ఈదేహమెత్తకముందును యెత్తి దేహమునశించిన పిమ్మటనున్ను నీవున్నావా లేవా? అది యేమిన్ని నీవు యెరుగనంటివా, ఈదేహముతో నీవుకూడియున్న కాలమందును నీ దేహము నేలపడి నిద్రలో పీనుగవలెనుండు సమయంబున స్వప్నావస్థగలిగి నీరాకపోకలు మొదలగువ్యాపారములు జేసినావుకదా? మరియు నీవు యీదేహమును జ్ఞానమని జెప్పినయెడల నీదేహమందుండిపెరుగు వెంట్రుకలు నఖములు మలమూత్రాదులు సమస్తమున్ను జ్ఞానస్వరూపమగు యానందముగాజూడ గొంచమైనను సరిపడదు. ఈదేహముతో జేరినవియున్ను ముందుండిన స్వరూపమువాని చెడుగబ్బుగలిగి పోతున్నవే, మరియు పాదాదికేశపరియంతమువరకు గూడియున్న అవయవ

ములలో దేనియందైనా కించిత్సుఖమున్నదా? మొ
దట నొక వెంట్రుకను అన్నపానాదులందును,
బదార్థములందు నుండజూచినయెడల భుజింపయో
గ్యముగాయున్నదా? మరియు వెంట్రుకలందొకటినెత్తి
అగ్నియందు వేసిన నీవు సమీపమందుండగలవా? మ
రియు చెవిలో గులిమి, కంటిలో మురికి, కన్నీరు, ము
క్కున చీమిడి, నోటగారు యెంగిలి, గోళ్ళ వాదపిత్తాదు
లు, చెమట, మలమూత్ర రక్తచీము, నరములు, యెము
కలు, తోలు, యేలుగపాములు మొదలైనవిచేరి గుంపు
గూడి యీదేహములో యున్నప్పుడును వెలిబడినప్పు
డును దేనిచేతనైనా సుఖమున్నదని యావగింజప్రమాణ
ము చూపించగలవా? ॥శ్లో॥ జన్మదుఃఖంజరాదుఃఖం
జాయాదుఃఖం పునఃపునః। సంసారసాగరందుఃఖం తస్మా
జ్జాగ్రతజాగ్రతః॥ అనియు॥ శ్రుతి॥ దేహోహమితి సం
కల్పోమహాపాపమితిస్ఫుటం। దేహోహమితియత్ జ్ఞానంత
దేవనరకంస్మృతం॥అని తేజోబిందును॥శ్రుతి॥ జాతంమృత
మిదందేహంమాతాపితృమలాత్మకం। సుఖదుఃఖాలయా
మేధ్యం స్పృష్ట్వాస్నానంవిధీయతే॥ ‹‹ధాతుబద్ధంమహా
రోగం పాపమందిరమధ్రువం। వికారాకార విస్తీర్ణం
స్పృష్ట్వాస్నానంవిధీయతే॥ నవద్వారమలస్రావం సదా
కాలె స్వభావజం। దుర్గంధందుర్మలోపేతం స్పృష్ట్వా

స్నానం విధీయతే॥ మాత్రాసూతక సంబంధంసూతకే సహజాయతే। మృతసూతకజందేహం స్పృష్ట్వాస్నానం విధీయతే॥ అనియు మైత్రేయోపనిషత్తును॥ కం॥ అతి హేయం బతిచంచల।మతినిస్సారంబ నిత్యమతిఘనతాప। త్రితయవిదూషితమీజగ।మతిదుఃఖంబనుచు దజ్ఞుడొందును శాంతిన్॥ అని అష్టవక్రగీతయును॥ గీ॥ పుట్టు దుఃఖమునను బొరలుదుఃఖమునను గిట్టుదుఃఖమునను గ్రందజనును। మనుజదుఃఖమువలె మరిలేదుదుఃఖంబు విశ్వదాభిరామ వినరవేమ॥ యని వేమన్నగారున్ను॥ గీ॥ చీమునెత్తురులచేతను జితుకుచుండు। మూత్రమలసంయుతంబుపై మురికితోలు। కండలెమ్ములు బ్రేవులునిండియుండు। నిట్టిదేహంబులందవస్తేమి జెపుమా॥ అనిరామస్తవరాజమందును॥ శ్లో॥ నాహం దుఃఖీనమేదేహేబుద్ధిర్నాస్తి నమేమృతిః ఇతిభావన రూపేణ వ్యవహారేణముచ్యతే॥ యనివాసిష్ఠమును॥ శ్రుతి॥ తదేతదృచాభ్యుక్తం ఏషనిత్యోమహిమా బ్రాహ్మణస్య నవర్ధతేకర్మణానోకనీయాన్ తస్యైవస్యాత్పదవిత్తం విదిత్వానలిప్యతేకర్మణా పాపకేనేతి తస్మాదేవంవిచ్ఛాంతోదాంత ఉపరతిస్తితిక్షుస్సమాహితోభూత్వాత్మన్యేవాత్మానంపశ్యతి। సర్వమాత్మానంపశ్యతి। నైనంపాప్మాతరతి। సర్వంపాప్మానంతరతి। నైనంపాప్మాతపతి। సర్వం పాప్మానంతపతి। విపాపోవిరజోవిచికిత్సో బ్రాహ్మణోభవతి॥ అనెడి బృహదారణ్యోపనిషత్తురీతిగా, బ్రాహ్మణత్వము బ్రహ్మజ్ఞానమువలన సిద్ధించుగాని కర్మానుష్ఠానము

వలన సిద్ధించును. అట్లు బ్రహ్మజ్ఞానముగల బ్రాహ్మణుఁడు కర్తయైన నందుబద్ధుఁడుగానేరఁడు. శాంతిదాంతి ఉపరతి తితీక్షశ్రద్ధ సమాధానములనెడి శమాదిషట్క సంపత్తిగలవాఁడై ఆత్మస్వరూపుఁడైన తన్నుఁదాను బ్రహ్మముగాఁ దెలిసికొని, సదా ఆత్మానుసంధానమును, సర్వప్రపంచములను బ్రహ్మస్వరూపమని భావించునట్టి అహంకార రహితుఁడే బ్రాహ్మణుఁడుగాని జన్మముచేతను కర్మానుష్ఠానముచేతను బ్రాహ్మణుఁడు కాఁజాలఁడనియును॥ శ్రుతి॥ సర్వధర్మాన్పరిత్యజ్య నిర్మమో నిరహంకారో భూత్వా బ్రహ్మేశం శరణముపగమ్య తత్వమసి సర్వంఖల్విదంబ్రహ్మ నేహ నానాస్తి కించనేత్యాది। మహావాక్యార్థానుభవజ్ఞానాత్। బ్రహ్మైవాహమస్మీతినిశ్చిత్య, నిర్వికల్ప సమాధినా స్వతంత్రోయతిశ్చరతిససన్న్యాసీ। సముక్తస్సపూజ్యస్సయోగీసపరమహంసస్సో వధూతస్సబ్రాహ్మణ ఇతి చ॥ అనెడి నిరాలంబోపనిషత్తురీతిగా సర్వధర్మములను వదలి నేను నాదియనెడి అహంకారమమకారములను నాశముజేసి, పరబ్రహ్మమందు భక్తిగలిగి సమస్తము బ్రహ్మస్వరూపమే, అనేకమనునది కొంచముకూడ లేదు, బ్రహ్మ మొక్కటేయుండునది దానికిరెండవపదార్థము లేనే లేదు, అట్టిపరబ్రహ్మమే ఆత్మస్వరూపముగా నున్నదనెడి మహావాక్యార్థానుభవ జ్ఞానమువలన ఆత్మస్వరూపుఁడగు నేను బ్రహ్మమునకంటెను వేరుగాను, నేనే బ్రహ్మము, బ్రహ్మమే నేనని దృఢనిశ్చయముగలిగి సకలసంకల్పశూన్యుఁడై సకలదృశ్యములమఱచి కేవలజ్ఞప్తిమాత్రుఁడై

నిర్వికల్ప సమాధినిష్ఠయందు స్వతంత్రముగ సంచరించు వాడే సన్న్యాసియనియు, ముక్తుడనియు, ప్రాజ్ఞుడని యు, యోగియనియు, పరమహంసుడనియు, అవధూత యనియు బ్రాహ్మణుడనియు జెప్పబడును. ఇట్లు శ్రుతి స్మృతి పద్యములచేత నపార్థయుక్తి నీశ్రుతియుక్తి అను భవములు చెడిపోయెనుగదా? రవలేశము సుఖదాయక ముగా నీయస్థిరదేహమును సుఖస్వరూపమైన ఆత్మయని నెట్లుజెప్పసాహసింతువనగా నేప్రశ్నలకును బదులాడ క ముందుసాక్షులవలె స్తబ్ధుడైమిణకరించ గోర్టువారా సాక్షినిజూచి యప్రమాణసాక్షిగా వచ్చినవీనికి జనన మరణమను దేహాది సంసారబంధసంకెళ్లు వేయించి గాఢాం ధకార బిలములోద్రోయుడనితీర్మానించి యిహలోకకాము కులైనవారిని అనేకులవిచారించి క్రాసు వేయ బదులాడ నేరక ముందుసాక్షులవలె దండాహర్హులైనవెనుక రెండ వ ప్రతివాదియగు కర్మకునితో జేరిన సాక్షులవిచారించ దొడగి ప్రాణాత్మవాదిని పిలువమని యాజ్ఞాపించెను.

---

## ౫-వ సాక్షి ప్రాణాత్మవిచారణ.

---

ఘోరమూఢబుద్ధియను ప్రతివాదివకీలు లేచి కో ర్టువారిసముఖమునకు ప్రతివాదితరపు ౫-వ సాక్షియగు ప్రాణాత్మవాదిని బిలిచి ప్రమాణముచేయించి సత్యము గా జెప్పవలయునని భయపరచిచేయు

ప్ర. నీపేరేమి?

ఉ. నాపేరు ప్రాణాత్మవాదియని జెప్పుదురు.

ప్ర. నీవు నేనను ఆత్మనెరుగుదువా?

ఉ. నేననుఆత్మ ప్రాణమువినా వేరుగాదు.

ప్ర. ప్రాణము వినా నేననుఆత్మ వేరుకాదనుటకు శ్రుతియుక్త్యనుభవముల జెప్పగలవా?

ఉ. అన్యోంతరాత్మా ప్రాణమయః॥ అనియు ॥ప్రాణో బ్రహ్మ॥ అనియు॥ ॥ప్రాణోవాఆశాయాభూయాన్యథావా అరానాభౌసమర్పితా ఏవమస్మిన్ ప్రాణేసర్వగ్ సమర్పితం ప్రాణః ప్రాణేనయాతిప్రాణః ప్రాణందదాతీప్రాణాయ దదాతీప్రాణోహపితా ప్రాణోమాతా ప్రాణోభ్రాతా ప్రాణస్స్వసా ప్రాణఆచార్యః ప్రాణోబ్రాహ్మణః॥ అని ఛాందోగ్యోపనిషత్తు మొదలైనవిచెప్పును. సర్వమున్ను లయించిన సుషుప్తికాలమందున్ను నేనులయించక యుండడమేయుక్తి. నేనుజేసినాను, నేనువచ్చినాను, నేనువచించినాను, పోయినాను, మలమూత్రాదుల విసర్జనముసేయుచున్నాను, ఆకలి దప్పికగానున్నాను, బలహీనుడైయుండి యిప్పుడు బలవంతులతో సమానుడై ఆనందుడై రమించుచున్నాను, సదాయానంద్రమయుడుగానున్నాననునదే నాయనుభవమని జెప్పి నిలువగా వాదివకీలుసేయు

కాప్రిసుప్రశ్నలు॥ నేనను ఆత్మార్థమే నీవైయుండగ నీవు పాణమేనేనని జెప్పవలయుగాని నాపాణమని

జెప్పగూడదు. వాక్కాది కర్మేంద్రియముల నాధియుని జెప్పగూడదే మరిన్ని నీవుచెప్పిన శ్రుతులు॥ ఏతస్యప్రాణస్యాపశ్శరీర॥ మనుబృహదారణ్యోపనిషత్తుచేత గొట్టబడి పోయెనుగదా? నీకేప్రాణాధారమనునది యెరుగవుగాబోలు? నీవు తెలివిమైయుంటే సుషుప్తి మొదలగు అవస్థలయందు నాసికాద్వారమందున్న ఆభరణమును వేరొక్కడపహరించుకొని పోవుచున్న కాలమందు నాచోరుని యిట్టివాడని నెరుగ శక్తిలేకను వెలివిసురుగాలికావున నీవుక్షణక్షణము వికారముజెందియుండుటచేత నిన్నున్ను నీకన్యమున్ను నెరుగ యోగ్యతలేకయున్న నీవెట్లుజ్ఞానస్వరూపమైన ఆత్మయనందగునని అనేకప్రశ్నలువేయగా దేనికిన్ని బ్రత్యుత్తరమునివ్వనేరక మూగవానివలేమిణుకరించువాని గోర్టువారుచూచిగాఢాంధకారబిలములో దలక్రిందుగావ్రేలాడజేసి రేచకపూరకములగు జీకటీగలచేగరపించుడని కఠినమైనదండనవిధించి ఆరవసాక్షిని బిలవమనియాజ్ఞాపించెను



## ౬-వ సాక్షి మనోమయుని విచారణ.



ఘోరమూషబుద్ధియను బ్రతివాదివకీలులేచి మనోమయునిబిలిచి కోర్టువారిముందుగనిలిపి ప్రమాణముచేసి నీకు నేనను ఆత్మను దెలుసునా తెలియదా నిజముగా జెప్పుము?

ఉ. మనోమయుడగు నన్నువినా మరివేరొక ఆత్మ లేదు. నేనే యాయాత్ముడను.

ప్ర. మనోమయుడే యాత్మయనుటకు శ్రుతియుక్తి యనుభవము లేవి?

ఉ. ఆన్యోంతరాత్మామనోమయః॥ అనురీతిగాయన్యుడైన అంతరాత్మా మనోమయుడనే శ్రుతియునుంగాక,॥ శ్లో॥ మనసాకల్పితంసర్వం మనసాపరిపాలితం మనసా సంస్మృతం తస్మాత్ మనఏవాస్తి కారణం॥ అనియు

పం॥చా॥ మనంబె స్థూలసూక్ష్మముల్ ప్రమాతృమాన
మేయముల్।మనంబె కామరాగరోషమత్సరాది
వృత్తులున్। మనంబెసర్వధర్మముల్ మనంబెబం
ధమోక్షముల్। మనంబెదృశ్యమంతయుం గ్రి
మంబుచేనెరింగినన్॥ అనిసీతారామాంజనేయం॥

కం. మనసేమాయాజగములు। మనసేసంసారదోష
మార్గము సర్వం। బునుమనసేకాని మరే।మిని లే
దనుచునెరిగిమెలగున్మృపాలా॥అనిరానుస్తవము॥

అని శ్రుతిపద్యములుగాక సర్వమునకు రాజవలె నేనులేని సుషుప్తికాలమందు జగముతోచక నేనుగలిగి యుండు జాగ్రిస్వప్నకాలమందు జగముతోచడమే యుక్తి. నేను రాగిని, ద్వేషిని, మోహుడ, లోభిని, నేను జూచినాను, విన్నాను, తిన్నాను, గంధమెరిగినాను, నా యిల్లు, నావాకిలి, నాగొడ్డు, గోచి, యనిదోచడమే యనుభవమనిజెప్పి నిలిచిన మనోమయునిజూచి వాది వకీలు సేయు

కా॥ సు॥ నీవేఆత్ముడవైతే నాయొక్కమనంబని జెప్ప నలవిగాదని నీవు యెరుగవు కావున కోర్టువారిముందుగ జాగ్రతతో యోచించి చెప్పుము. నీవెవని కుమారుడవు?

ఉ. నేను వేశ్యాజాతిగావున నాతండ్రిపేరు నాకు దెలియదు.

ప్రి. నిన్ను దశమాసములు గర్భముధరించి కన్నతల్లి పేరేది?

ఉ. దశమాసములుచూలైగన్న నాతల్లిపేరు జగన్మోహినిసల్లాయియను అవిద్యయండ్రు.

ప్రి. నిన్ను సాకిన తల్లిపేరేది, జెప్పుమా?

ఉ. మనుష్యులమోసముసేయు ఆవరిణీనసునది.

ప్రి. నీయొక్కజీవనమెట్టిది?

ఉ. శ్రోత్రాదీంద్రియములను దాసీజనముల గానహాట్యంబుల నేర్పడమే నాజీవనము.

ప్రి. ఈవివాదసొత్తేలాగువారికి నీవనుభవించు చున్నావు?

ఉ. నాతల్లి ముఖాంత్రముగాదొరికి యనుభవించుచున్నాను.

ప్రి. నీతల్లిగారికది యేలాగు సంప్రాప్తమాయెను?

ఉ. నాతల్లి దాసికావున నామెకుదొరికినవిధము కోర్టువారికే స్పష్టముగా దెలుసును.

ప్రి. ఇప్పుడాసొత్తెవరివశంబున నున్నది?

ఉ. ఎప్పుడున్ను మాయాధీనమై యున్నదని జెప్పినంతనే వాదివకీలు కోర్టువారివద్ద మనవి జేసుకోవడమేమనగా? ఈసాక్షి కల్పనలకన్నటికి బుట్టిల్లుగానుండుటచేత నితని ననేకప్రశ్నలడగడమునకుత్తరవు దయసేయవలెనని ప్రార్థించ గోర్టువారాలకించి ఇట్లు అబద్ధములకు మూలమైనవారిని విచారించి చక్కగా దండించడమే మనధర్మము కావున నీపోకిరిని కావలసినవరకు ప్రశ్న సేయమని నిరాక్షేపముగా నుత్తరవిచ్చినంతనే మనోహయునిజూచి నీవడిగినవరకు బదులు చెప్పవలయునని యెచ్చరికపరచి, నీయొక్క స్వరూపము చిత్తా, జడమా యనియు, చిత్తునిన జిత్తుకు వికారమేదియును ఆక్షేపణవచ్చును. జడమన్నావా జడముమట్టివలె గదలక మెదలక యుండవలయు, చిజ్జడములు చేరినవియనిన జీకటి వెలుతురు లేకము గా సేరదు. యీరెండువ్యతిరేక వస్తువులొకచోటనుండనట్లు, చిత్తున్ను జడమున్ను గలసిన పదార్థమొకటిగ నుండ నేరదు, యున్న యెడల జూపించుము. మరియు

ప్ర. నీవుసదా జేయుపనులేవి యోచించి చెప్పుమా?

ఉ. శబ్దాదివిషయపంచకములను దలచడమే నా పనులగును.

ప్ర. ఆశబ్దాదివిషయ పంచకమే నీవైతే ఆశబ్దాదులు శూన్యమై చెడిపోనుగదా? నీవున్ను ఆలాగు కావలసియున్నది, మరిన్ని శబ్దము నాకాశభూతముయొక్క గుణము. స్పర్శము వాయువుయొక్కగుణము. రూప

ము యగ్నియొక్క గుణము, రసము జలముయొక్క గుణము, గంధము పృథివియొక్క గుణము, ఇవి యన్నియు పంచభూతాంశములైయుండగ నీకెట్లు ఇవి స్వరూపమగును. మరియు నవి జడంబులగునుగదా? వాటికి మెఱిగెడు శక్తియేదియని యడిగినందుకు

ఉ. ఆగుణములు నేనుగాను, వాటినెరుగునది యే నేనని జెప్పి నిలిచెను.

ప్ర. ఎఱుగునది యెరుక, యదియాత్మను జేరినదే గాని నీకెఱిగెడు యెఱుక యేవిధము గలిగెను?

ఉ. నాకెఱిగెడు శక్తిలేకపోయినను నాత్మవిషయముల నెరుగు సాధకుడైయున్నాను.

ప్ర. ఒక్కొక్కయింద్రియమున్ను ప్రాణవాయువు న్ను నీవు యెఱుగుటకు సాధకమేగాని నీవలన యేవిషయములను నెరుగ సాధనమై యున్నావు?

ఉ. సరేంద్రునివలె సర్వేంద్రియములకున్ను నేను పైవిచారణచేయువాడనుగా నున్నాను.

ప్ర సర్వజనసమూహమునకు పైవిచారణసేయు భూపాలునివలె నున్నానని జెప్పినావుగదా? అట్లునిన్ను పైవిచారణకుగాను నుండమని నియమించినవారెవరు?

ఉ. నన్నెవరున్ను పైవిచారణకర్తగానుండమని నియమించినవారులేరు, యెల్లప్పుడున్ను పైవిచారణకర్తగా నుండడమే నానాడుకగానున్నది.

ప్ర. ఒకడేయొక్క ఆదరణలేక మరియొకని సొత్తును వానికిదెలియక దొంగతనముగా నపహరించి యనుభవించేకాలమందు సొత్తుకు బాధ్యతగలవాడు గని పట్టి యేలదొంగలించినావనగా నాయొక్క వాడుకయని చెప్పినయెడల వానిగ్రోత్తదొంగకైనా వీడు ప్రబల పరాక్రమము గలిగిన ప్రాతదొంగయని బలమైనదండన విధింతురుగదా, యటువలెనే నీకున్ను కోర్టువారు బల మైన దండనయుగు బహుమతినిచ్చి పంపుదురు. మరి యు నీవు పైవిచారణగానుండి చేయుపనులేవి?

ఉ. నాస్త్రి, నాపుత్రులు, మిత్రులు, నాయిల్లువాకి లియని ఇంద్రియములతోను, విషయేంద్రియ సుఖదుఃఖ ములతో జేరిజేరకయుండి తలచడమేనాపనులగును.

ప్ర. నీవు నాభార్యయని పలికినందుచేత అపరంజిని గొంచముకొంచముగా నరికిమెత్తిన అపరంజిగానే తుని గి వచ్చునుగదా? ఆలాగు నీభార్యను తునకలుపరచి మెత్తితే భార్యగానే రావలయు నట్లురాక రక్తమాంస ములుగా నెట్లురాదగును? మరియు నీవు నాభార్యయ ని జెప్పినావు నది స్థూలపంచభూతములనుండి వచ్చినవి, నీవు శరీరములోపలయున్నావు ఆయొక్క విషయముల నగా శరీరమునకు వెలిగానున్నవి. శరీరమునకు వెలి గానున్న విషయములకున్ను లోపలనుండు నీకున్ను నే లాగు సంబంధము పొసగు, నవిగావచ్చి నిన్ను నాదియని జెప్పుమనినవా? నవిజడముగాబట్టి చెప్పనేరదు. నీవే నాదియని జెప్పడముచేత, మరియొకనిసొత్తును నాదియని

జెప్పినవానికి దండనలు గలుగునా గలుగవా? జెప్పుము. ఆలాగె సకలవిషయములను నాదియనిన నీకు నేయొక్క ఆధారమును నగుపడకున్నందుచేత నీవు సత్తా, చిత్తా, అసత్తా, జడమా, యానందమా, నీవువికారివా, నిర్వికారివా? యని యిట్లనేకప్రశ్నలుసేయగా బలుతెరంగుల యోచించి పరుగులిడ దారిలేక మిణకరించగా గోర్టువారుజూచి దొంగలకందరికి బెద్దదొంగగా వీడున్నందుచేత వీనికి స్వరూపానుసంధానమనుపనులిచ్చి విషయవైరాగ్యమనెడు సంకిళ్లువేయించి రేయింబగులులేనిచోట ద్రోయుడని కఠినమైన దండనవిధించి తక్కినసాక్షులను బిలువనాజ్ఞాపించెను.

---

## ౭-వ సాక్షి విజ్ఞానమయుని విచారణ.

---

ప్రతివాదివకీలు ఘోరమూఢబుద్ధియనువాడు లేచి విజ్ఞానమయునిబిలిచి ప్రమాణముచేయించి సర్వశక్తియుక్తులగు సద్గురుప్రభు చక్రవర్తిగారైన గోర్టువారిని జూచి యేలినవారి సన్నిధానమందు ప్రతివాదులతరపు సాక్షిగానచ్చియుండు యితను మాలో మిక్కిలిగణ్యమున్ను దేజస్సున్ను గలిగి మాకు ముఖ్యసాక్షిగా నుండుటచేత నితనికిమరియాదసేసి విచారించుకొరకై యాసనమివ్వవలెననియు బ్రార్థించగా గోర్టువారు హృదయమను

పీఠము నివ్వమనిరి, యీలాగె హృదయమను నాసన మందమరినంత

ప్ర. తమపేరేది?

ఉ. నన్ను విజ్ఞానమయుడందురు.

ప్ర. మీతండ్రిగారి నామధేయంబేది?

ఉ. వారిని మహాయహంకార ఋషియని బిలుతురు.

ప్ర. మీకు నేనను నాత్మసాత్తు దెలియునా?

ఉ. నన్నువినా ఆత్మసాత్తులేదు నేనేయగుదును.

ప్ర. నేనను ఆత్మసాత్తు నీవేయనుటకు శ్రుతియుక్తి యనుభవములేవి?

ఉ. అన్యోంతరాత్మా విజ్ఞానమయః॥ విజ్ఞానమానందం బ్రహ్మ॥ అనియు మనోమయునికన్నా యంతరాత్మా విజ్ఞానమయుడనే శ్రుతియున్ను, భువినేలు నరాధిపునివలె నతని ఆజ్ఞప్రకారము నరులు నడుచుకొనుమేరకు సర్వేంద్రియములున్ను నాయనుమతిప్రకారము నడవడమే యుక్తి॥

ఈకోర్టులోపలవచ్చిన యేకక్షివార్లకున్ను, సాక్షులకున్ను, కోర్టువారుమరియాద సేయక నాకుమాత్ర మాసనంబొసంగి మర్యాదసేయడమే యనుభవమనెను.

అతి సూక్ష్మగ్రాహ్య సాత్వికాంశ బుద్ధియను, వాదివకీలు లేచి కోర్టువారికి నమస్కరించి యీసాక్షిని విశేషముగా విచారించ దయసేయవలనని ప్రార్థించిన ప్రకారముత్తరవైనతోడనే వాదివకీలు సేయు

ప్రశ్న॥ నిన్ను నీవెవరని యెరుగుదువా?

ఉ. నేను విజ్ఞానమయుడను.

ప్ర. మీతాతగారిపేరేమి?

ఉ. ఋషిమూలం నదిమూలం విచారించగూడదు.

ప్ర. నిన్నుగన్న తల్లిగారిపేరేమి?

ఉ. నాతల్లిగారిపేరవివేక చూడామణి.

ప్ర. సదా నీవుచేయుచుండు పనులేవి?

ఉ. చూచుట, వినుట, స్పర్శించుట, రుచియెరుగుట వచనించుట, మొదలైన ఇంద్రియ వ్యాపారములే నా పనులు.

ప్ర. చూచుట, వినుట మొదలగుపనులు, చక్షురాదీంద్రియంబులు చెడిపోయిన కాలమందు నీవలన నీపనులేవిధముగా జేయనగును? కానేరవనిన, పైని వివరించిన పనులు చేయుచున్నానని నెట్లుజెప్పితివి, నేనను మాటను నీవేయని అర్థమైతే, నాయిల్లువాకిళ్లి యన్నట్లుగా లోకులు నాబుద్ధియని జెప్పుచున్నారు, యట్లుండగ నేనను ఆత్మను నీవెన్నినట్లు తానని యేలాగుజెప్పవచ్చును.

ఉ. ఈపరకు లోకమందు నన్ను నీవెవరని అడిగినవారులేరు, నీవీదినము నాగుట్టుబొత్తిగాజెడిపినాడవు, గణ్యాతబోగొట్టినాడవు, నేనెటువంటివాడనగా మూరెడు గరు నేనే సంపన్నుడు,నేనే విద్యావంతుడు, కరణకాంత

ము నందు శాస్త్రప్రకారము పౌండ్రికమువరకు నే జే యని యాగ యజ్ఞనములు లేవు, నాయోగ్యతనుగురించి తెలుసుకోవడమునకు నా సమానమైనవారికిదప్ప దక్కినవార్లకు దెలియదు. ఈసభలోనుండు ప్రతికర్తలున్ను మొదగరు మెచ్చటనున్నా నాకే మిగుల యుపచారములతో నగ్రతాంబూలమిత్తురు నన్ను జూచినంతనే సకలమైనవారున్ను నమస్కారములు సేయవలెను, అట్లుజేయనివారిపై కోపగించి శాపమిత్తును. నే నేక సంతగ్రాహిని, నేనే సర్వజ్ఞుడ, నాకుపై నీశ్వరాదులు లేరు, నాకు గురువున్ను లేడు, నాకు నీయోగ్యతలన్ని స్వయముగానే గలిగెను, నేనెంతనో దేవసోమపానము జేసియున్నాను ఆపుణ్యముచేత గొంత కాలమునకు జక్కని ఇహలోకసౌఖ్యవిశేషముల ననుభవించి దానిపైన దివ్యవిమానము నెక్కి దేవలోకమునకుబోయి యచ్చోట ఇంద్రాదిసకల దేవతలును నాగాళ్లమీదబడి నన్ను సేవించుకొన్న, అందరున్ను నన్నత్యున్నతస్థానమునందుంచి దేవామృతమును పసిడికొడుములచే దేవతలు తెచ్చియివ్వ నేద్రాగినవాడనై రంభాయూర్వశీ మొదలగు అప్సరస్త్రీలను, నాభార్యబిడ్డలతో నేలాగునధిక స్వేచ్ఛగా ననుభవింతునోయాలాగె దేవలోకమంధనుభవింతును, నే ననుభవించే సుఖములను జెప్పనలవిగాదని తన్మాహాత్మ్యమును మానవులెరుగలేరని తన్నుదానే పొలుమారక వర్ణించుచున్నవన్ని యువిని వీనియందు గోష్టవారి మాటాసముగలిగి దుర్మార్గుడైన వీనికింద్రియ

నిగ్రహమును సంకెళ్లు వేయించి వీనికొసగియున్న మరియా దలదీసి వీని దండిపొండియను బహువచనప్రయోగముల నిల్పి యేకవచనముచే వచించుమని వాదివకీలుకు జెప్పి హెచ్చరించి కోర్టువారిముందే వీడు మిక్కిలి యలక్ష్యము గా వచనించినవాడు తక్కినచోట వీడణగడని సాక్షులు లేకనే బహుగా దెలియుటచేత ముందుదండింపబడిన సాక్షులమేరకు వీనినిదండించడము సరికాదనిదలచి నిప్పు డేవీనికి కర్తృత్వాది నాశనముగు ఉరివేయుదమని దోచు చున్నది గాన చక్కవిచారించి వీనియందు దప్పులదగ మోపి దండించ మతినెంచి తానుగా విచారణసేయ నా రంభించెను.

ఓరిమూర్ఖుడా! నిన్నడిగిన ప్రశ్నలకు సరియైన ప్రత్యుత్తరముల నివ్వలేక కోపగించినావు, ఇదివరకు నిట్లుప్పై పిరియాదువచ్చి యీకోర్టువారిముందు విచా రణకు నిన్నెవరున్ను దేవందుచేత నీకు యింత యహంకా రమెచ్చెను నీగుట్టునిప్పుడే బయులగుతున్నది, నిన్ను నీవే పొగడడము కపికులతిలకమైన పోతుకోతియనునది తనవట్టలుపట్టుకొని తాప్రీతిగా ముద్దాడినట్లు, నాకు నేనే పెద్దవాడని పొగడుకొన్నావు, నీవిచ్చిన వాఙ్మూల ము చేతనే మహాతాగియనియు క్రోధియనియు దుర్గుణ శిరోమణియనియు జక్కగా దెలియనాయెను, నీవు కర్మ ముల జేసినందుకై నీశ్వరుడు నీకు స్వర్గాదిభోగఫలముల నిచ్చియుండ నతనిమరచి నాకువేరు ఈశ్వరుడు, [illegible] మొదలగువారలు లేరని జెప్పినావు. అదియెట్లనిన

ఒకడు యజమానునివద్ద కూలిమాట్లాడుకొని యేపను లున్ను జేయక తనంతటదానే యడవికిబోయి గోడపెట్టి నయెడల నాకర్మము వానికేమిఫలమునిచ్చును, నట్లు ఈశ్వరుడు యేకమై సర్వాధారముగా సర్వవ్యాపకమై యుండుటచేత నతనినియతిలేక నీకు స్వర్గాదిభోగముల నెవరిత్తురు, యెట్లుగలుగును. మరియు గురువులేకనే విద్యలన్నియు వచ్చినదిగా జెప్పుచున్నావది యేలాగనగా నొకస్త్రీపతి కృపలేకనే తొమ్మండ్రుగురుపుత్రులనుగన్నా ననుదానికి వ్యభిచారియను పేరేగాని యుత్తమస్త్రీయని జెప్పరు, ఆలాగె నీకున్ను యోగ్యుడను పేరురానేరదు. నీవుకర్మమైన పనులజేసి స్వర్గఫలమైన కూలినివహించి మరల వారిచేత క్రిందద్రోయబడి భూమికివచ్చి కర్మములం జేసుకొనుటేలాగున్నదనగా, బిడ్డలాట్లాడపోయి భక్షణమైనవెనుక మరల గృహమునకువచ్చి తల్లివద్ద భక్షణములు తీసుకొనియాడుకొను వారలకు సమానుడైయున్నావు. నీమేరక నేకజీవకోట్లు విహరించుచున్నవి, వారిలో నీవున్ను నొకడేగాని యతిశయములేదు, నీవు నేనే కర్తయని చెప్పుటవలన యాజడమయిన కర్తృత్వము నంతఃకరణములలో జేరినదిగా యున్నది, మరి వాటిలోనుండు చలనత్వము ప్రాణునిజేరినున్నది యనుక నిట్లుజూడ నీస్వరూపమే అసత్యమైపోతున్నది మరియు యోచించినయెడల విధవరాలుగాక సుమంగళియునుండాక యున్నవిధమున నీవు సత్తుగాక యసత్తుగాక, చిత్తునుగాక, జడమునుగాక, యేదియునుంగాక,

యిబ్బందియై మాయవలన కల్పింపబడిన స్థూలశరీర ప
ర్ణాశ్రమధర్మములున్ను, స్థూలశరీరముయొక్క షడ్భావ
వికారములున్ను, నింద్రియములయొక్క వికారములు
న్ను, ప్రాణునిచలనత్వమున్ను, అంతఃకరణముయొక్క
కర్తృత్వమున్ను, ఆత్మయొక్క ప్రకాశవత్తైన జ్ఞానము
న్ను నంతయుజేర్చి నేను గర్తనని జెప్పవచ్చునా?
శ్రుతి॥ జ్ఞానేంద్రియైస్సహ బుద్ధిర్విజ్ఞానమయఃకోశః॥ యా
ను పైంగళోపనిషత్తుచేఃరకు బుద్ధియు, జ్ఞానేంద్రియంబు
లైదున్ను గూడి విజ్ఞానమయకోశమనబడును, లేక అన్న
మయ, ప్రాణమయ మనోమయంబులనెడి మూడుకోశ
ములతోడ అంతఃకరణములున్ను గూడి యీయంతఃకరణ
సంబంధమగు ధ్యానమననాది వృత్తులు యెప్పుడుగలుగు
చున్నవో అప్పుడు విజ్ఞానమయుడనబడునుగాన ఆత్మానా
త్మల వేరుపరచినయెడల నీకెప్పుడున్ను ప్రయోజనము
లేదు. నీకొక స్వరూపమున్న లేకపోవుటవలన నిన్ను
ఉరివేయులాగు తీర్మానించియున్నామని (తీర్మాన) తీర్పు
చదివినంతనే ఈప్రకారము మృతిజెందినాడని తెలియక
నే పోయెను. ఆజీవత్వమైనది, తోడిపెండ్లికుమారుని
వలె నేనెవరనే విచారములేక యవిచారముపొంది సుఖ
జీవించికొని యుండుటవలన నిప్పుడు ఆత్మానాత్మల విజ్జడ
వివేకముచేతను, గురుకటాక్షముచేతను తక్కిన వరా
యూ కార్యములవలెనె, ప్రాతిభాసిక వ్యావహారిక, యు
సత్తులవలె బొంకైదోచును, అసత్తైన వ్యవహారమునకు
వచ్చుటగాకను విచారణమాత్రములో విజ్ఞానమయుడు

యుత్యాంతవక్తైపోవడమే మృతించాందినాడనే పల్కుకుంటోని భావము.

---

## ౮-వ సాక్షి ఆనందమయుని విచారణ.

---

ఘోరమూఢబుద్ధియను, ప్రతివాదులవకీలులేచి, కోర్టువారిముందుగ సాక్షి ఆనందమయునిబిలిచి ప్రమాణము దీసినంతలో వకీలు అభ్యంతరము విచారించడము కాలయాపనమవుచున్నదని యెంచి కోర్టువారె విచారణచేయ నారంభించిరి.

ప్ర. నేనను ఆత్మనెరిగియుంటె జెప్పుమా?

ఉ. ఆనందమయుడనే, నన్ను వినా ఆత్మయనునది లేదు.

ప్ర. ఆనందమయుడే యాత్మయనుటకు శ్రుతియుక్త్యనుభవములేవి?

ఉ. అన్యోంతరాత్మానందమయః॥ అనురీతిగా, విజ్ఞానమయునికంటె అంతరాత్మాయానందమయుడనియు॥ ఆనందం బ్రహ్మ॥ అను శ్రుతియునుంగాక సర్వప్రాణికోట్లున్ను, సుషుప్తిసుఖమునకునై చాప, తలగడ, దిండుదివాసు, మొదలగు సాధనముల వెతకడమే యుక్తియనబడును.

సమస్తమైనవారున్ను జాగ్రత్స్వప్నావస్థలుమాని మానస ధర్మచలనములులేక యొకప్పుడుపొందు అవస్థే సుషుప్త్యానందానుభవమని యూరకుండ

కోర్టువారానందమయునిగూర్చి చెప్పినదియేమన
న, నీవుజెప్పినదిచూడ నజ్ఞానయవస్థతో జేరినది. ఏకదేశ
మై వెలుగుచున్న యానందము, అవస్థాత్రయ వికార
ములతో జేరినదై యుండుటవలన. అది పండితాంగీకార
ము గానేరదు.

శ్రుతి॥ తత్ బ్రహ్మతాపత్రయాతీతం। షట్కోశవిని
ర్ముక్తం। షడూర్మివర్జితం పంచకోశాతీతం। షడ్భావవి
కార శూన్యమేవమాది సర్వవిలక్షణంభవతి॥ అనియు॥
॥నిర్వికల్పమనంతంచ హేతు దృష్టాంతవర్జితం। అప్రమే
య మనాదించజ్ఞాత్వాచ, పరమంశివం॥ యను శ్రుతిరీతి
గా సర్వాతీతమై, నిర్వికారమై, నిర్వికల్పమై, నిరుపాధిక
మై, యేవిధముచేత జెడనిదై, నిత్యమై, సత్యమై, వెలు
గుచు నేనను ఆత్మ సుఖాతీతమని శ్రుతులుపలుకుట
వలన నాత్మ నీవుకాదని ఈసాక్షిని తప్పుసాక్షియని త్రో
యబడెను.

---

## ౯-వ సాక్షి శూన్యాత్మ విచారణ.

---

ప్రతివాదివకీలు సాకారమూఢబుద్ధియనువాడు
లేచి శూన్యాత్మనుపిలచి కోర్టువారిముందుగ నిలిపి, ప్ర
మాణముచేయించి నిన్ను అడిగెడు ప్రశ్నలకు జాగ్రత
గానుండి ఉత్తరములివ్వవలెనని అడిగిన

ప్ర. నీకు నేనను ఆత్మ దెలియునా?

ఉ. నేననిఆత్మను అసత్స్వరూపమనియెఱుగుదును.

ప్ర. వాటికి శ్రుతియుక్త్యనుభవములేవి?

ఉ. అసదేవ ఇదమగ్ర ఆసీత్॥ అనెడుప్రకారము ఆదిని అసత్తేయుండెను॥సృష్టేఃపురానామరూప వివర్జితం జగత్॥ అనెడిప్రకారము సృష్టికిపూర్వము ఈప్రపంచము నామరూపములులేక యుండినప్పుడు ఆత్మ అసత్తై యున్నదను శ్రుతియునుంగాక ప్రాగభావమైయుండి ఘటముగలిగినదే యుక్తి. సుషుప్తియందేమియు దోచకుండునదే యనుభవమని నిలిచెను.

ప్ర. ॥నాసతోవిద్యతే భావోనాభావోవిద్యతేసతః॥అను గీతావాక్యముమేరకు పదార్థములుండి కలుగవలెనే గాని లేక గలుగుట న్యాయవిరుద్ధము. నీవు దృష్టాంతముగాచెప్ప సాహసించిన మొదటిశ్రుతియందు, ఆదిని శూన్యమేయుండినదని అర్థముస్ఫురించినను, అవలనైన జగద్రూపపదార్థము గోచరించుటవలన నీవుభ్రమగా గొనిన అసత్తునందు సత్తు అంతర్భూతమై యుండినదని తత్వవిచక్షణులు తెలుగుదురు. అదెటులనగా సుషుప్త్యవస్థయందు గాఢాంధకార శూన్యమును దినెదినే అనుభవించినను నిద్రమేల్కొనినతోడనే సకలప్రపంచమును యథాస్థితిగనుంటున్నది. అవస్థాభేదరూప ఆ గాఢాంధకార శూన్యదృశ్య సుషుప్తిలోగనుబడిన ప్రపంచమందకమానదు. కాబట్టియుండునది కనబడకపోయినలోపము నీయందేయుండునని యెన్నవలసియున్నది. మఱియు నీవుజెప్పిన రెండవశ్రుతికి సమాధానము. సృష్టికి

ప్ర. అచ్చటచ్చట మాయ యేగలుగ జేయుచుండగ ఆత్మయనేకమన్నావు, ఒకయొరుక మరియొక యొరుకకు భేదము కద్దాలేదా? భేదమనిన యొరుకకు భేదముల్లై యుంటు వస్తువులు జడమైపోవునుగదా? యభేదమనిన నొకటికిమరొకటి లక్షణభేదములేక యుండుటవలన నేకమగునుగదా? ఆత్మస్వరూపమైన యొరుకను అనేకమని యేలాగన్నావనగా, ముందు సాక్షులవలె వీడున్ను మిణకరించ గోర్టువారుజూచి దండనవిధించకమునుపే ప్రశ్నలను దెబ్బలకు దొలగిపోను దారిలేక మూర్ఛితుడైనాడు, యీమేరకు రెండవప్రతివాదియొక్క సాక్షుల తప్పుసాక్ష్యములని కొందరినిదండించి తక్కినవారిని ద్రోయించినమాత్రమునకర్మపరాయణుల విచారణముగిసెను; ఇకనుభక్తిపరాయణులవిచారణకు బిలువమనెను.

---

## ౧౧-వ సాక్షి సాలోకకామి విచారణ.

కోర్టువారు సాలోకకామియను సాక్షిని బిలిచి ప్రమాణముచేయించి తామే ప్రశ్నసేయుచున్నారు.

ప్ర: నీమతమునందు ముఖ్యాంశము లెన్నివిధములౌను?

ఉ: జగజ్జీవపరములను మూడువిధములై యుండును.

ప్ర. అయితే వీటిలో నిత్యముగానున్న ఆత్మ యెవరు?

ఉ. నిత్యముగా బ్రజ్వరిల్లు నీశ్వరుడే యాత్మయగును.

ప్ర. ఈశ్వరుఁడు నిత్యుఁడై యెందున్నాఁడు?

ఉ. సూర్యప్రకాశమువలె నతఁడెందు నిండియుండుటయు గాక కైలాసాదిలోకములందున్ను భక్తజనులకై భూమి యందుగల దేవాలయాదులందున్ను సమానరహితుఁడై నిండియున్నాఁడు.

ప్ర. నీవు నిత్యుఁడా లేక యనిత్యుఁడా?

ఉ. నామతము మేరకు అనిత్యుఁడే, అతనినుహిమయగు నిత్యత్వమును నాజీవనమువలన యనిత్యత్వమును బొందును, ఆరక్షకుని కృపచేత నిత్యత్వమైన సంపద నొంది దేవలోకమునందుబోయి నిత్యసుఖమనుభవింతును గాక.

ప్ర. ఈశ్వరుఁడున్ను నీవున్ను జడమా లేక చిత్తా? చిత్తంటివేని నతనికిన్ని నీకున్ను యేవిధభేదమున్నది?

ఉ. అతఁడు సర్వజ్ఞుఁడు నేను కించిజ్ఞుఁడుగానున్నాను.

ప్ర. నీవు స్వభావముగా సుఖియా లేక దుఃఖియా?

ఉ. నేను సదా దుఃఖస్వరూపియైయున్నాను.

ప్ర. నీవెందువలన స్వభావదుఃఖియైయున్నావు?

ఉ. నేను పాశబద్ధుఁడైయుండుటవలన సదా దుఃఖస్వరూపిగానున్నాను.

ప్ర. ఆపాశబంధములు కల్పననా లేక సత్యమా?

ఉ. పాశబంధములు సత్యమేగాని కల్లగాదు.

ప్ర. సత్యమైతే ఆపాశబంధములు నివర్తియవునాగాదా

ఉ. ఈశ్వరునికృపవల్ల అవి నివారణగావచ్చును.

ప్ర. ఆతనికృప నేలాగు సిద్ధించును?

ఉ. త్రికరణశుద్ధిగా సదా నతనిధ్యానించు భక్తులకే ఆతని కృపగలుగును.

ప్ర. పాశమును స్వభావమని జెప్పినావు అట్టి స్వభావమైన॥ యెలుకతోలు దెచ్చి యేడాదియుతికినా నలుపునలుపేగాని తెలుపుగాదను॥ ప్రకారము యెప్పటికైనా నివర్తిగాదుకదా?

ఉ. ఎలికతోలుదెచ్చి యెంతయుడకపెట్టి యుతికినా తెలుపుకానేరదనుమాట సహజమే యందుకు సందియము లేదు, ఇదియట్లుగాదు అజ్ఞానయుక్తజీవునికి స్వభావముగా నున్నను ఈశ్వరుని కృపవలన దీరునని శాస్త్రములు పలుతెరంగుల జెప్పుచున్నవి.

ప్ర. సుషుప్త్యవస్థయందు జగజీవపరముల నెడు త్రివిధపదార్థములను జూచినావా లేదా? మరియు సుషుప్త్యవస్థయందు సుఖుడై యున్నావా లేవా? దుఃఖములనుభవించుకొని దుఃఖరూపుడై యున్నావా? దుఃఖానుభవము పొందలేదనిన త్రివిధపదార్థములున్నవనియు, నేను సదా దుఃఖియైయున్నాననియు నేలాగు జెప్పినాడవు?

ఉ. నేజెప్పినది శాస్త్రానుభవమేగాని స్వానుభవముగానేరదు.

ప్ర. శాస్త్రములజూచినానన్నావుగదా॥ శ్రుతి॥ శశశృంగేణ నాగేంద్రోమృతశ్చేత్. జగదస్తితత్ ।మృగతృష్ణాజలంపీత్వా తృప్తశ్చేత్ అస్త్విదంజగత్ ॥మాయాకార్యాదికంనాస్తి మాయానాస్తిభయంనహి।ఇదంప్రపంచం

నాస్త్యేవనోత్పన్నం నోస్థితంక్వచిత్" అనెడితేజోబిందూపనిషత్తురీతిగా కుండేటికొమ్ములు పొడుచుకొన్నటువేనుగచ్చిన యెడలజగత్తున్ను సత్యమగును. ఎవడైనను ఎండమావులందలి జలముపానముజేసి తృప్తిబొందినయెడలజగత్తు సత్యముగానుండుననియు, మాయయు మాయాకార్యాదికమైన జగజ్జీవాదులున్ను మిథ్యయేయనుట యుగాక॥

శ్రుతి॥ చైతన్యంవినాకించిన్నాస్తీతి॥ అని నిరాలంబోపనిషత్తున్ను, "నతుద్వితీయమస్తి" నాస్తిద్వైతంకుతోవిదితేవేద్యంనాస్తి" "ఏకమేవ సన్నేహనానాస్తికించన" ఏకధైవానుద్రష్టవ్యం, అను ఈలాగనేక ప్రబలశ్రుతులునుంగాక ॥శ్రుతి॥ యస్యామతం తస్యమతంయస్యనవేదసః। అవిజ్ఞాతం విజానతాంవిజ్ఞాతం అవిజానతాం॥ యన్మనసానమనుతే యేనాహుర్మనోమతం। తదేవబ్రహ్మత్వం విద్ధినేదంతదిదముపాసతే॥ అను కేనోపనిషత్ రీతిగానెవనికి బ్రహ్మము తనచే నెరుగపడదనే తలంపుగలదోవానిచే బ్రహ్మమెరుగ బడ్డదియగును; ఎవనికిబ్రహ్మమెరుగబడుననే తలంపుగలదో వాడెరుగనివాడౌను. ఎరుగుటయన్న తలంపుగలవానికి నెరుగరానిదిగానున్ను ప్రత్యక్ష్యాది ప్రమాణములచే నెరుగబడదనే తలంపుగలవానికి యెరుగబడ్డదిగానున్ను, ఎదిమనసుచేత నెరుగ

బడరానిదో, దేనిచేమనను నెరుగబడుచున్నదో, దానియే బ్రహ్మమని యెరుగుము. ఎది ఇదియిదియని ఉపాసింపబడుచున్నదో దానిని బ్రహ్మమని యెరుగగూడదు. శ్లో॥ నచైకం తతన్యత్ ద్వితీయంకుతఃస్యాత్। నవా కేవలత్వం నచా కేవలత్వం । నశూన్యంనచా శూన్యమద్వైతకత్వాత్ । కథంసర్వవేదాంతసిద్ధం బ్రవీమి॥ అనెడిసిద్ధాంతబిందురీతిగా, ఏకమనుట కేలేనప్పుడు రెండవదియేకారణముచేత నుండును. కేవలత్వములేదు. అకేవలత్వములేదు, శూన్యములేదు, అశూన్యములేదు, ద్వైతమునులేదని సర్వోపనిషత్తులచే సిద్ధాంతపరచియుండగనెట్లుచెప్పుదుననియు, శ్రుత్యాదులుజెప్పియుండడము గొంచమైననెరుగవుగాబోలు? ఆత్మానుభవములేక కర్మశాస్త్రములలోని మాటలు, నీటిపైగొండరాళ్లు తేలుచున్నవనుమాటవలె నుపయోగములేక పోవుచున్నది. అదియేలననగా॥ ఆ॥వె॥ నేరనన్నవాడు నెరజాణమహిలోన, నేర్తునన్నవాడు వార్తగాడు, యూరకున్నవాడె యుత్తమోత్తముడెందు, విశ్వదాభిరామవినరవేమ॥ యనునట్లు స్వానుభవములేక, కర్మశాస్త్రములు జెప్పుకర్మలచే సాధింపగోరబడు ఫలములన్నియు, యుదకమునకువచ్చిన యూష్ణమువలె, గోడయందు వ్రాయు చిత్రమువలె, కాలెడుపెంకునందు విడిచిన జలమువలె, పురుషునికి గుచములుబోల్చు, టెంకాయ చిప్పలుంచినట్లున్ను, ముఖమందమగు

నటుల నరిదళము వ్రాసినట్లున్ను, నాటకమందు విశ్వామిత్రుని వేషమురీతిగా కర్మసాధ్యమైన పదవులున్ను, "క్షీణేపుణ్యే మర్త్యలోకం విశంతి" అనురీతిగా పుణ్యస్వర్గాదిపదవులు పోగొట్టుకొనబడినవై మనుజుడధోగతి జెందుచున్నాడని వ్రాయుచ్చి, మరియుబైని నుదహరింపబడిన కర్మభక్తి పరాయణులు తత్వపరిశీలనలు సేసియున్నట్టు దెలియ సామర్థ్యాలుగాని మందాధికారులకై, దేవతాంతరములు, మతాంతరములు. లోకాంతరములు, గల్పింపబడ్డవి. అవితత్వపరిశీలనా కాలమందు గొట్టబడిపోవునదట్లుండగా, పారమార్థికమందు త్రిమూర్తులు, ఇంద్రాదులు, వారలలోక వైభవములు మొదలగునవి దృశ్యములైనవేగదా? యద్దృష్టంతన్నష్టం, యన్నట్లు నామరూపంబులు మొదలగునవి నశ్వరములనుట స్పష్టమేగదా? "వాచారంబణంవికారో నామధేయం"॥ బనియు "యతోవాచానివర్తంతేఅప్రాప్యమనసాసహ" అనియు ఈలాగనేక శ్రుతివాక్యములున్నవి యెరుగవుగదా?

శ్రుతి॥ ఏకంరూపం బహుధాయఃకరోతి" అజాయమానో బహుధావిజాయతే" అనెడుప్రకారము, యుండునది యొకటే, బహుపదార్థములులేవని చెప్పుచుండ తద్వ్యతిరిక్తముగా జెప్పంబడు హరిహరబ్రహ్మాదులు, శశశృంగము, గగనారవిందము, వంధ్యాపుత్రుడు యివియెటుల

నామమాత్రంబులైనట్లు వస్తుతాలేనివాటితో సములగు దురు. ఒకవస్తువుండుచోట మరియొకవస్తువెటులైననుండ వల్లబడదుగదా? అఖండపరిపూర్ణబ్రహ్మంబే దేశకాలవస్తు పరిచ్ఛిన్నరహితంబైయుండ నీత్రిమూర్త్యాదులున్న వారల లోకవైభవములెట్లుండనగును? శ్రుతియుక్తియనుభవముల కును పొసగనేరదు. మరియు కార్యకారణవాదములలోన నవస్థాదోషము సంప్రాప్తంబగును. ఇటులనీ మూర్తిత్రయ మునకే మోసదోషములు వచ్చినపుడు, పణ్మతముల భక్త తిలకులు సాలోక, సామీప, సారూప, సాయుజ్యపదవులు జెందుటెట్లు? మొదలులేదు సుబ్బక్క బిడ్డలెందరన్నట్టును, ఆసామిలేనిచోట చెయిదట్టిపిలచినట్టున్నూ యగుచున్నది. ప్రపంచమే బ్రహ్మస్వరూపముగానుండునపుడు, తదన్యంబు గా విషయరూపముగా దలంచుట భ్రమయేయగును. “భ్రమమూలమిదంజగత్” అనిమరియు జగత్తొకటియున్న దనితలంచి అందలివ్యవహరించుటెల్లను భ్రమయేయగును. ఉండునది బ్రహ్మమేగాని ప్రపంచమనునదిలేదని పెద్దల యనుభవముగాన ఈసాక్షితప్పుసాక్షిగా నున్నాడని వాని సాక్ష్యమును ద్రోపుదుసేసి ఆమేరకు సామీప్యకామి, సారూప్యకామి, యోగియును సాయుజ్యకామివరకు, కర్త లచేతనే ఐక్యముక్తిగలుగుననియు, జెప్పువాక్యములవిని వారలవాదములన్నియు పూర్వపక్షపరచిత్రోయబడెను. కోర్టువారు పైనజెప్పినమేరకు ప్రతివాదులసాక్షులను

మొదటవిచారించి కొందరికిదండనలు విధించినవారై, మరికొందరి సాక్ష్యముల పూర్వపక్షపరచి, అనగా తప్పు సాక్ష్యములనియు నివర్తించి, వాది తరపుసాక్షులను విచారించడమునకై పిలువమని యాజ్ఞాపించెను.



వాదితరుపు - ౧ వసాక్షి - వివేకుని విచారణ.



అతిసూక్ష్మ గ్రాహ్యాసాత్వికాంశబుద్ధియను వాది వకీలు లేచివాదితరపు మొదటిసాక్షియగు వివేకుడను వాని గోర్టువారిముందుగ బిలిచిప్రమాణముచేయించి కోర్టువారి సముఖమున నాతరపుసాక్షులను నేనడుగవలసిన మాటలేవియులేనందుచేతయెదిరివకీలుకావలసినవరకు నడుగవచ్చునని మనివి సేసినందుకుప్రత్యుత్తరము రాకమునుపే కోర్టువారుఅనుమతిలేకనే మిక్కిలి తొందరగలిగినవాడై, తనపట్టుసాధించనెంచెడుఘోరమూఢబుద్ధియను ప్రతివాదివకీలు' వివేకునిచాయదిరిగి విచారించనారంభించిన వాడై అడిగినవియేవనగా?

ప్ర. నీపేరేది, నిజముగజెప్పుము?

ఉ. నాపేరు వివేకుడనబడును.

ప్ర. నీవెవనికుమారుడవు?

ఉ. నేనుతత్వపరిశీలకునిపుత్రుడను.

ప్ర. నీవు నేనను ఆత్మనెరుగుదువా?

ఉ. లక్షణము చేతనాత్మనెరుగుదును.

ప్ర. ఆత్మనెరుగుటకులక్షణమెందుకు?

ఉ. మీతోపాటి మూఢులయ్యుజడస్వరూపులయ్యు, భ్రష్టులుగాక నుండునది చిత్తుగానుండుట చేతనున్ను, యాచిత్తునెరుగుటకు లక్షణమత్యావశ్యము.

ప్ర. దానికేయుక్తి జెప్పగలవు?

ఉ. శబ్దాదివిషయ పంచకమువలె, శ్రోత్రాదిజ్ఞానేంద్రియములుజడమైపోకనే చిత్తుగానుండుట చేత, లక్షణము లేకనే ప్రత్యేకముగా నెఱుగబడు విషయములవలె లేకనేయున్న, పైయింద్రియముల నెరుగనను లక్షణము చేత, ఆయింద్రియముల నెరుకయని యెరుగవలెను. అది యేలాగనిన, నగ్నియొక్క యూష్ణము! తృణము మొదలగు కాష్ఠములను, దహించడముచేత్తృణకాష్ఠాదులు, వహ్నిస్వరూపముగా నెరిగిన మేరకు, నేననుఆత్మస్వరూపముచేత, పంచకోశ పంచవిషయేంద్రియముల నెరుగబడుటచేతను, పైవిమర్శించిన విషయేంద్రియములచే, ఆత్మనెరుగసాధ్యముకానందుచే, జ్ఞానస్వరూపమైన యెరుకనే, నేననుఆత్మస్వరూపమని లక్షణముచేత నెరిగినాడను.

ప్ర. అయిననతనికికర్తృత్వాది సంసారంబుకద్దా లేదా?

ఉ. నేననుఆత్మకు, కర్తృత్వాది సంసారంబులు లేవు.

ప్ర. కర్తృత్వాది గుణములు ఆత్మకెందువలనలేక పోయెను?

ఉ. అవస్థాత్రయములు, తోచితోచి, నశించునట్లు యొకటివెనుకనొకటి నశించుటచేత, స్థిరాస్థిరయజ్ఞాన విషయములలో కలిసి యసంగసంబంధమై, సర్వముదానుగాక ప్రత్యగాత్మ స్వరూపుడై, యెరుగుతున్నదిగావున నాత్మకు కర్తృత్వాది గుణములులేవు, యకర్తయని యెరిగినాను.

ప్ర. అత్మ కర్తయనియు, భోక్తయనియు, పుణ్యాపాప కర్మలతనికి గద్దనియు, దానిచేజననమరణ సంసారదుఃఖములు గద్దనియు, శ్రుతియుక్తియను భవముగానుండ లేదా?

ఉ. ఆత్మకు కర్తృత్వాది గుణములు గలవనిచెప్పిన శ్రుతిస్మృతులు స్థూలారుంధతి న్యాయముగానుండును, అవిమీబోంట్లకు సమానులైన అవివేకులకై జెప్పిన ఔపచారికములగును. ఆత్మనుజేరినవివినుము.

శ్లో॥ నాహంకర్తా నైవభోక్తాప్రకృతేస్సాక్షిరూపతః। మత్సాన్నిధ్యాత్ప్రవర్తంతే దేహోద్యా అజడాఇవ॥ స్థాణుర్నిత్యస్సదానందశ్శుద్ధో జ్ఞానమయోఽమలః। ఆత్మాహం సర్వభూతానాం విభుస్సాక్షీనసంశయః॥ బ్రహ్మైవాహం

సర్వవేదాంతవేద్యంనాహం వేద్యంవ్యోమవాతాదిరూపం, రూపంనాహంనామనాహం నకర్మ॥ బ్రహ్మైవాహం సచ్చిదానందరూపం॥ నాహం దేహో జన్మమృత్యూకుతోమె, నాహంకారః క్షుత్పిపాసెకుతోమె।నాహంచేతశ్శోకమోహాకుతోమె,నాహంకర్తాబంధమోక్షౌకుతోమె॥ అనిసర్వసారోపనిషత్తున్ను జెప్పుటయెరుగవుకాబోలు, వినుము, తా॥ నేనుగర్తనుగాను, భోక్తనుగాను, ప్రకృతికిసాక్షిస్వరూపమైయుందును, నాసన్నిధానముచే దేహాదులు జడముకానిదై కర్మలజేయుచుండును, స్థిరముగాను నిత్యముగాను నెల్లప్పుడానందముగాను, శుద్ధమై,జ్ఞానస్వరూపమై మలరహితుడై యుందును, నేనుసర్వభూతములకునుఆత్మ, ఎచ్చటవ్యాపించియుండువాడను,సాక్షిగానుండువాడను, సందియము లేదు, సర్వవేదాంతములచేనెరుగబడువాడనునేనే, యెరుగబడుఆకాశము వాయువు మొదలగు రూపములునేనుగాను, నేనురూపముగాను, నామముగాను, కర్మాదులుగాను. సచ్చిదానందస్వరూపమగుబ్రహ్మము నేనే. నేను దేహముగాను, నాకు జననమేది? నేనహంకారముగాను, నాకాకలిదప్పిక లేవి? నేను మనసుకాను, నాకుదుఃఖమోహము లేవి? నేనుకర్తనుగాను నాకుబంధమోక్షము లెక్కడివి? అని శ్రుతులు పలు తెఱుంగుల ఆత్మనుగొనియాడుచున్నది, ఆత్మయనునది, యనుభవమైనసుషుప్తిదశలో, భ్రాంతితోజేరినమనసు

లేనందున, కర్తృత్వాది సర్వసంసారము లేకసాక్షిమాత్రుడై యుండుటచేత నీవుచెప్పిన శ్రుతి యనుభవములున్ను మానసభ్రాంతియేగాక వేరుకాదని గ్రహింపబడెను.

ఇంకొక్క రహస్యమున్నది, యేమనగా, ఈయాత్మను అజ్ఞానియను మొదటియెదిరి మరుగుపరచి, యావరణంబను లాగిరిపడుచు చేతతిక్కనొందినవాడై, విక్షేపమను కుష్టరోగ స్త్రీనిగూర్చియితనికిసంబంధపరచి, కర్తృత్వాది గుణములను రోగముల గలుగజేసి, పామరుడు, కర్మి, భక్తుడను పుత్రుల, యుత్పత్తిజేసినదియుంగాక, సదాతాపత్రయ దుఃఖములనుభవించేలాగు మోసముచేత, అసంగునిసంగునిమేరకు జేశినారని చెప్పినవాటినన్నియు విని ప్రతివాదివకీలు, మిక్కిలి కోపముగాధిఃకరించిజూచి, సాక్షిగావచ్చిననీవు చట్టప్రకారము అడిగినమట్టుకే జవాబుచెప్పవలసియుండగ నిన్ను వకీలుఅడిగిన విషయములకు విరోధమైజెప్పుటచేతనీవు మిక్కిలిఅధిక ప్రసంగిగానున్నావుఇకనొకమారట్లుజెప్పినయెడలకోరట్టువారివలన దండింపబడుదువు, జాగరూకతవహించివచరింపుమని భయపరచి, చురచురజూచి యడుగబడు.

ప్ర. ఆత్మార్థమనుసాత్తు సత్తాలేక అసత్తా?

ఉ. ఎల్లప్పుడున్ను ఆత్మసాత్తనునది యసత్తుగానేరదు, అదిసత్తే.

ప్ర. ఎందువలన ఆత్మనుసత్తన్నావు?

ఉ. సర్వకారణమై యేదినశించినప్పటికిన్ని తాను చెడకయుండుటచేత.

ప్ర. దానికేమిశ్రుతిజెప్పగలవు?

ఉత్త॥ శ్రుతి॥ సదేవసోమ్య ఇదమగ్రఆసీత్ ॥ అనిఛాందోగ్యోపనిషత్తుజెప్పుప్రకారము సృష్టికి మునుపు, ఈదృశ్యమానఅసత్యరూపమైననీప్రపంచము, నామరూపములు లేనిదై, కేవలనిర్విశేష చిన్మాత్రపరబ్రహ్మమె సత్తామాత్రమైయుండెననియు, శ్రుతి॥ స్వప్నాంతం జాగరితాంతం, చోభౌయేనాపశ్యతి,మహాంతవిభు మాత్మానంమత్వాధీరోనశోచతి॥ అనికఠోపనిషత్తురీతిగా, జాగ్రత్స్వప్నసుషుప్తులనెడి మూడవస్థలయందును, జ్ఞానస్వరూపుడగు ఆత్మసత్యముగానాశరహితమై, సర్వసాక్షిగాకాలత్రయమందుండుట చేతనే సత్తనెడిశ్రుతుల నంతములు కలవు.

ప్ర. ఆత్మసత్తనుట కేమియుక్తి జెప్పగలవు?

ఉ. మన్ను, ఇనుము, బంగారు, మొదలగు కారణవస్తువులందు కల్పింపబడిన ఘటఖడ్గభూషణాదికార్యముల వలెనాశముజెందక పైకారణవస్తువులు యెప్పుడునిత్య

ములై యుండుమేరకు ఈదృశ్యమాన ప్రపంచంబంతయు నాత్మకుగార్యంబయ్యును ఆయాత్మనిత్యంబై సత్తై యుండు ననే యుక్తియగును.

ప్ర. అయిన నాత్మను సత్తన్నందుకు అనుభవమేమి?

ఉ. దేహేంద్రియ కరణప్రపంచాదులు జెడినను, తాను జెడక కాలత్రయము లందునుదానగు ఆత్మనిత్యముగా నుండడమేఅనుభవము.

ప్ర. ఆత్మయనునది చిత్తా లేక జడమా?

ఉ, ఆత్మయనునది చిత్తేగాని కాలత్రయ మందును జడము కానేరదు.

ప్ర. ఏలఆత్మను చిత్తనందగు?

ఉ. అతడు దేహత్రయములకు విలక్షణుడై, అవస్థాత్రయములకుసాక్షియై సర్వము నెరుగుటవలన చిత్తనబడును.

ప్ర. అందుకుశ్రుతియేమి జెప్పగలవు?

ఉత్త॥ శ్రుతి॥ ప్రజ్ఞానంబ్రహ్మాహం॥అనియు, శ్రుతి॥ యస్సర్వేషుభూ.తేషుతిష్ఠ-సర్వేభ్యో భూతేభ్యోంతరో యం సర్వాణిభూ తానినవిదు॥అని బృహదారణ్యోపనిషత్తుజెప్పినమేరకు, ఆత్మస్వరూపమనునది, సకలభూతము లందు వ్యాపించియున్నను, ఆభూతభౌతికాదీంద్రియ

కరణముల చేత, నెరుగుటకుసాధ్యముకానిదిగా, యేజ్ఞానముకలదో ఆజ్ఞానస్వరూపమగు వస్తువేయాత్మయననగు, పంచభూతములకుతమ్మునితరముల నెరిగెడి జ్ఞానము లేనందున నవిజడములనబడును. జ్ఞానస్వరూపమై సర్వము నెరుగుచుండు యాత్మచిత్తనబడును, ఇట్లనియనేకశ్రుతులుద్ఘోషించుచున్నవి.

ప్ర. ఆత్మచిత్తనుటకు యుక్తియేమి జెప్పగలవు?

ఉ. నేత్రేంద్రియముచే నెరుగబడు దృశ్యరూపంబులు జడములు, మఱియు నా నేత్రేంద్రియమును, మాంస రక్తాదులతో గూడి దేహావయవములలో నొకటి యగుట వలన నదియును జడమగును, ఇక నెటులనగా నిట్టి నేత్రేంద్రియముద్వారా యీదృశ్యమాన ప్రపంచమును నేది యెరుగుచున్నదో యదె ఎఱుకరూపమగు ఆత్మ యగును, ఇదియే సాధుయుక్తి.

ప్ర. అయితే యాత్మను చిత్తనుటకు యనుభవమేమి?

ఉ. తానుగా జూడబడిన స్థూలదేహము స్వప్నమందుండక పోవడమున్ను, సుషుప్తియందు. సూక్ష్మదేహమున్ను గనుబడక పోవడమున్ను, ఆత్మఅనుస్యూతుడై యీ రెంటిని గాంచుచుండడమే యనుభవమని బుద్ధిమంతులగు తత్వజ్ఞు లెరుగుదురు.

ప్ర. ఈవివాదసాక్తిగునాత్మ దుఃఖస్వరూపమా లేక సుఖస్వరూపమా?

ఉ. ఎల్లప్పుడుని దిసుఖస్వరూపమేయగును.

ప్ర. దీనికి శ్రుతియుక్తియనుభవములేవి యెరుగుదువు?

ఉ. శ్రుతి॥ ఆనందం బ్రహ్మోహం॥ అనియు, శ్రుతి॥ తదేతత్ ప్రేయః, పుత్రాత్ ప్రేయో, విత్తాత్ప్రేయో, అత్మానమేవ ప్రియముపాసేత్" అనియు లోకమునందు, ఆనంద రూపమగు ఆత్మయే యెల్లవారికి ప్రియముగానుండును. అజ్ఞులగు సామాన్యులకు, ధనము, భార్య, పుత్రులు, మొదలగునవి, యానందకరములై దోచుటవలన వారలకు వానియందు బ్రియముగా నున్నది, వానివలన దమకపాయముగలిగినట్లైన, పైజెప్పిన వానినన్నిటిని విడిచి తన్నుగాపాడు కొరకు ప్రయత్నించును గావున, అన్నిటికంటెను ఆత్మస్వరూపుడగు తానే తనకు మిక్కిలి బ్రియుడుగా నున్నాడుగాన, ఆత్మ పరమానంద రూపముగు చున్నాడనియు ॥శ్లో॥ ఆపదర్థం ధనంరక్షేత్ దారాత్ రక్షేత్ ధనైరపి, ఆత్మానం సతతంరక్షేత్ దారైరపి ధనైరపి॥ అనెడి నీతిశాస్త్రమున్ను ॥శ్రుతి-ఏషోస్యపరమానంద ఏతస్యైవానందస్యా న్యానిభూతాని మాత్రా

ముపజీవంతి॥ అని బృహదారణ్యోపనిషత్తు రీతిగా, ఆనందరూపుడగు ఆత్మ దేహమందుండుటవలన జంతుజాలంబులన్నియు జీవించి యుంటున్నవని శ్రుతులు జెప్పను-పెండ్లికుమారునకై తోడిపెండ్లి కుమారునకున త్తగారుజేయు యుపచారమురీతిగా, దేహవాసనా దోషావివేకముచే తనకై బిడ్డలు మొదలైన వాటియందు ప్రీతిగలిగియుండడమ గుచున్నది, అయినను తనయొక్క సుఖమునకు హానిగలుగజేయు పుత్రమిత్రకళత్రాదిసర్వప్రపంచమును నిరాకరించి తనయందే మిక్కిలి ప్రీతిగలిగియుండడమే అనుభవమగును.

ప్ర. నేనను ఆత్మయెంతకాలము కర్మబద్ధులనుజేరి యజ్ఞానకార్యములగు పంచకోశాదుల ననుభవించును?

ఉ. ఘటపటాదులు నిండియున్న చీకటింటనుండుపురుషునింజూచి తామెంతకాలమై దీని యనుభవించుచున్నారని యడిగినట్టున్ను, స్ఫటికమునకు నెరుపువర్ణము బూయించి యోస్ఫటికమా, ఈయెరుపువర్ణమెన్నిదివసములుగా ననుభవించుచున్నావని యడిగినట్లున్ను, ఆకసమందు దోచబడు నీలాదివర్ణముల నీవెన్నాళ్లుగా ననుభవించుచున్నావని యాకాశమును జూచి యడిగినట్లున్ను, పసుపుకామాలవచ్చి దానిచే దపించువాడు, శంఖమునుజూచి ఓయుశంఖుడా! ఈపసుపు అరిదళవర్ణమును యెంతకాలమై

యనుభవించుచున్నావని అడిగినట్టుగానున్నది, అది యెట్లు నగా అసత్తు స్వరూపులగు యజ్ఞానాదులు తన్నుజూచి ఓయి ఆత్మా, పంచకోశాదుల నెన్నిదినములుగా ననుభవించుచున్నావని యడుగుట జూడ గొడ్రాలి పుత్రుడు అరుంధతికి సమానురాలైన మహాపతివ్రతను నెంతకాలము నుభవించి చెడ్డావని యడిగినట్టున్ను, నీమాటలుమిక్కిలి పరిహాసముగా నున్నది. అది కోరట్టువారికే తెలుసునని వాదము మాని యూరకుండెను.

ప్రతివాది వకీలగు ఘోరమూఢ బుద్ధియనువాని జూచి నీవుచేయు క్రాసు ప్రశ్నలవల్ల, బియ్యమును దంచ దంచ తెలుపవడము మేరకు నీవు ప్రశ్నల నడుగ నడుగ మీగుట్టుబయిటపడి వాస్తవము తెల్లంబగు చున్నదిగదా! యిక నీ ప్రశ్నల నిలుపుమని చెప్పి వాదితరపునవచ్చినయీ సాక్షి మిక్కిలి యోగ్యతగలవాడని మదినెంచి యితనికి నిరూపకుడను కితాపు పేరునిచ్చి, ఈకేసుముగింపయ్యే వరకు వాదియగు ముముక్షువునకు సహాయముగా బొమ్మని చెప్పి తనవద్ద నుంచుకొని తక్కిన సాక్షులలో రెండవ సాక్షిని బిలువమనెను.

---

౨-వ సాక్షియగు వైరాగ్యుని విచారణ.

---

తా బట్టినకుందేలుకు మూడేకాళ్లని సాధించేఘోర మూఢ బుద్ధియను ప్రతివాది వకీలు, వైరాగ్యునిగోరట్టు

వారి ముందుగ బిలిచిప్రమాణమూలముగానడుగబడు,

ప్రశ్న॥ ఓయినీపేరేమి, కోర్టువారిముందు నిజముగ జెప్పుము?

ఉ. నానామధేయము వైరాగ్యుడు.

ప్ర. నీవెవనికుమారుడవు?

ఉ. నేనువివేకుని కుమారుడను.

ప్ర. నీవునేనను యాత్మనెరుగుదువా?

ఉ. నేనను ఆత్మను నెరుగుదును.

ప్ర. నేనను ఆత్మయిప్పుడెచ్చటప్రకాశించుచున్నది?

ఉ. కల్పితాకారులగు మిమ్ములనందరిని రూపుమాపిన చోటనేయాఆత్మ ప్రకాశించునదియని జెప్పినంతనే,

ప్రతివాదివకీలు కోపముగలవాడై కోర్టువారినిజూచి, యీ సాక్షిమిక్కిలి మోసగాడు, యెట్లనగానితను, మొదట బ్రహ్మచర్యమను యాశ్రమమందుండియదిపూర్తిగాకము నుపే, దానినివిడిచిపెట్టి, మహాయోగ్యునివలెగృహస్థాశ్రమమునకువచ్చి, అగ్నిసాక్షిగానొకస్త్రీని వివాహముజేసుకొన, దానియందుబుత్రులగని, ఆశచేతమిక్కిలి కష్టముల నొందువానివలెనభినయించి కొంతకాలముండి దొంగవలెజెప్పక దేశాంతరముపోయెను, ఇతనిభార్య బిడ్డలువెదుకు

లాడికని పెట్టి యేలపారివచ్చినావనగా, పనికిదొంగప క్కవములజెప్పెడులాగుమీకుసంపాదించివేయనాకుశక్తి లేనందున, దేశాంతరముపారివచ్చినానని జెప్పినందుకు వారుసంపాద్యము జేసినీవుమాకు పెట్టవద్దు ఇంటనుండి నీవుకాలముగడపుమని జెప్పి వేడుకొన్నందుకువీడు మోక్ష సుఖమునతి సులభముగా నిచ్చుటనుండి యనుభవించ బోవుచున్నాననగా, నదివారువిని ప్రత్యక్షముగా ని జమైయున్న విషయసుఖములను విడిచి పరోక్షమై శుద్ధ యబద్ధముగానుండు మోక్షసుఖమునుకోరుట, చేతనుండు పాయసాన్నమును భుజించక అందరాని మోచేతినినాకు వృథాశ్రమపుచ్చుకొనువానివలెజేతనున్న ఫలమునువిడిచి యందనిపంటకు దోటివేయువానివలెనున్న దని కేవలము గాదలచి, ఛీఛీయనిజెప్పునప్పుడే వీడుమిమ్ములనేను విడ నాడలేదు, మీకుకావలసిన సమయమునవత్తునని, మోస పుచ్చివారినిండ్లకు బొమ్మనిజెప్పి వెనుకవానప్రస్థుడనివేష ముదాల్చి యొకానొకప్పుడు తనయింటికివచ్చుటపోవుటగా వంచనకాడై యుండి కడపట సన్యాసమను ఆశ్రమమందు విధించిన కర్మలేవియు నాచరించక యిన్నాళ్లెంటు దీసినవానివలె నేవిషయములచేత బాధించక నుండేలాగు సన్యాసియనిపేరుపెట్టుకొని నీకుభేభేనీతల్లితండ్రితాతలకుభే భేయని జెప్పినవైశ్యునివలె సన్యాశాశ్రమమున్ను మోస ముజేసి అతివర్ణాశ్రమియని పేరుకొని, తనకుసమానులైన

పోకురులను గొందరఁ జేర్చుకొని, విధినిషేధములు లేక, యెప్పుడున్ను పూయావాదమైన యశుచి వచనములవచించువీనికి, సంకెళ్లువేయించి, కుటుంబఘోరపంకంబగు పెద్దపల్లమందు ద్రోయవలె, నేలననగావీఁడుజీవన్ముక్తి యను పెద్ద సంకిళ్లను, విదేహముక్తియనుపెద్దపల్లమును యపేక్షించిన వాఁడుగనుక, వీఁడిష్టప్రకార మిటువంటి తప్పిదముల జేసినందుచేత దండించబడినాఁడని నందరికిన్ని దెలిసేలాగుశిక్షించప్రార్థించుచున్నాననగా, గోర్టువారు వైరాగ్యుని జూచి దీనికేమి సమాధానము జెప్పగలవని యడిగినందుకు.

వైరాగ్యుఁడు కోర్టువారి సముఖమున జక్కనిలిచి నమస్కరించి నామనవిని గొంతసేపు యేలినవారు చిత్తగించిన యెడల నేజెప్పెడు సమాధానమందు గోర్టువారికి దండార్హులెవరగుట విశదంబగు, దానినొక నిమిషములో తెలిపింతునని జెప్పందొడగెను.

శునకంబు కాటినెండిన నిస్సారంబగు యెముకనుగని అందు సారమున్నట్లు భ్రమిసి చాలా తడవు కొరికి తన దంతములకు బాధగలిగి అందుండియేర క్తముబయిలు వెడలనది శుష్కశల్యంబులోనిదని భ్రమిసి మరింతకొరకు చుండ దంతబాధ యధికంబై భగ్న మనోరథంబుగలదయి అప్పటికాయెముకగొరకడముమాని శ్రమనివారణ

జేసుకొన్నట్టు ఈహేయ సంసారంబునందభిరుచిగలవా డు అసారమగు సంసారమందు సారమున్నట్టు రేయింబ వలు కష్టపడుచుండి లోకమందవమానంబుజెంది, దినె దినే దేహంబు శుష్కించి బడలికజెందికృశించి కడకు సంసారకష్టములకు మూలకారణంబగు, భార్యాస్వరూపం బీ విధముగా నాలోచించువాడు? స్త్రీముఖము సుందరమైె న, మేనిపసుపు గంధ తిలకమెరుగులు వేదుకనేల, కండ్లు సుందరమయితె కాటుక దిద్దనేల, వచించునోరుసువా సనగా నున్నయెడల నధరము యెరుపు తిరిగేలాగు సువా సన ద్రవ్యయుక్త తాంబూలచర్వణమేల, శరీరమంద మైన యెడల చిత్రవర్ణములేల, నల్లచిట్టపురాళ్లతో నేను గను దోమురీతిగా శీకాయ యిప్పపిండి, కుంకుడుకాయలు, సబ్బు మొదలగు, వాటిచే గడుగనేల, వారలపలుకులు మ ధురంబులైన యెడల,సంగీతసాహిత్యములువినడమెందుకు, వారలస్వరూపము సుందమయినయెడల నాభరణాలంకార ములేల? వారలదేహములుసువాసన స్వభావమైనయెడల, హేయమగు గబ్బునివర్తియగుటకుపునుగుజవ్వాది పన్నీరు చందనయత్తరుపూసిమరుగుపరచనేల? నిటువంటివి స్త్రీల యందు గలిగిన దోషములు ॥సీ॥ బహువిధరోగముల్ భా ర్యానుభోగంబు శిగ్గులచేటునీస్త్రీలకూట, మత్యంతపాత కంబంగనాసంగమంబిహ పరదూరంబులింతిపొందు, దుఃఖ

స్వరూపంబు తోయ జేషణపొందములుద్బంధ మరణంబులు విడచెలిమి । అతిఘోరనరకంబు సతులలోలత్వంబు తల మెత్తరాములుచెలులగోష్ఠి॥ కాపురంచెడిసంసార కష్టపాటు । రోతకూటిబ్రతుకరణ్యరోదనంబు, లేమిజెప్పుదు నే హ్యామంచెరిగిదీని । సన్యసించినవాడుపోజాలుడధిపా॥ అని రామస్తపరాజమందున్న ॥శ్లో॥ విషయేంద్రియసంయోగాద్యత్తదగ్రేఽమృతోపమం । పరిణామేవిషమివతత్సుఖం రాజనంస్మృతం॥ అనిభగవద్గీత వాక్యముండుటగాకఅనేకశ్రుతిస్మృతులు కళత్రాత్మనిరసనమునకుగాను వచ్చియుండుటచేతనింతటితోజాలింపబడెను, యిదియునుంగాక ఈబండసంసారములోని అతిహేయములగుదోషంబులుమిక్కిలి కొద్దిగాజెప్పనలవికాదుగానిసవిస్తరముగానుడువుటకు వేయినోళ్ళు నురెండువేలనాలుకలుఁగలయాది శేషునికైనానలవికాదుకావున కోరట్టువారె దయనుసిన్యాయముల నుయోచించిధర్మమార్గమున తీర్మానించవేడెదను. ఇటుల ప్రార్థించగోరట్టువారువైరాగ్యునిమాటలనున్ను నాతండు చెప్పినశ్రుతియుక్తియనుభవములనునాలకించి యీసాక్షి మిక్కిలియోగ్యుడనియు సత్యవాదియనియు, డైరిప్రాయించివాదికినీవున్ను సహాయముగాయీకేసు ముగించేవరకుముందు సాక్షివివేకునితో గూడనుండుమనినా జ్ఞాపించి తక్కిన సాక్షులబిలువమనెను.



## 3- వపాక్షి,శమమను వానివిచారణ.

మూడవ సాక్షిగావచ్చిన శమాదిషట్కసంపత్తియను వారిని బిలిచి ప్రమాణముచేయించి తనపట్టునేసాధించె డుఘోర మూఢబుద్ధియనుప్రతి వాదివక్కీలు క్రోస్సువారి ముందుగనిటుల ప్రశ్న సేయుచున్నాడు.

ప్ర. మీరెవరు?

ఉ. మాపేర్లు, శముడు, దముడు, సమాధానుడు, అనుమువ్వరు పుత్రులున్ను, ఉపరతి, తితీక్ష, శ్రద్ధయను మూవురు పుత్రికలున్ను, యంతయార్గురు వచ్చియున్నామనగా?

ప్ర. మీరెవని బిడ్డలు?

ఉ. మేమువైరాగ్యుని బిడ్డలము

ప్ర. మీలోమొదటివారెవరు?

ఉ. మాకందరికిబెద్ద శముడనువాడు

ప్ర. శముడనువాని జూచినీపేరేమి?

ఉ. నన్నుశముడని పిలుతురు.

ప్ర. నీకునేనను యాత్మను దెలుసునా?

ఉ. నేననుఆత్మనునేనెరుగుదును.

ప్ర. ఆయాత్మను నేలాగెఱిగితివి?

ఉ. ఈకేసునప్రతి వాదులగు, పరమశత్రువులను నిర్మూలమగునటుల రూపుమాపిన యుత్తరక్షణము మార్తాండుని వలెదానై నుదయించు నేననుఆత్మను జక్కగా నెరుగుదును.

ప్ర. అయితే మేమున్నచోట బ్రకాశించక మేములేని చోట బ్రకాశించుటకు గారణమేమని ప్రతికక్షివారలడుగగా?

ఉ. వర్షాకాలపు మేఘములవలె మీరందరు జ్ఞానప్రకాశభాస్కరుడగు నేనను ఆత్మ నడ్డుపరచుచున్నారు, ఇదియుగాకసకలవిధ దుర్వాసనా యుక్తులగు మీరలుగా జుకుప్పెకు దట్టపుమలినమువలెనుండి యందుండు జ్యోతిని మరుగుపరుచునటుల, ఆత్మజ్యోతి నడ్డపరచిప్రకాశింప జేయకుంటున్నారు. అట్టినేననుఆత్మసాక్షాత్కార ప్రతికూలుల,ప్రకృతి తత్వవివేచనమను ఝంఝామారుతంబుచేబటాపంచలుచేసి, మబ్బువిడిచిన సూర్యునివలె ప్రజ్వరిల్లు జ్ఞానభాస్కరుడగు నేననునాత్మయందు ప్రకాశించ దర్శనంబు సేయవలయును. మరియుగాజుకుప్పెమీది మలినంబుబోజేసియందలిదీపంబును బ్రకాశింప జేయులాగున సద్గురూపదేశ సదాచారానుష్ఠానమను నుపకరణంబుచే

మలినవాసనా యుక్తులగుచిమ్ముల బారదోలి స్వయం జ్యోతియగు నేనను అత్మజ్యోతిని బ్రకాశింపజేయనగు.

ప్ర. ఆత్మద్వేషులగు వారివలన జెరుపేమి, ప్రబలరాక్షసులలో వారలెవరినిబోలుదురు, వారున్నచోట నేలయాత్మ ప్రకాశించదు?

ఉ. మీసంతతి వారిలో రాగమనువాడు రావణేశ్వరుడు, హిరణ్యాకశిపుడు, కామమనువాడు, నరకాసురుడు, మదమనువాడు. కార్తవీర్యుడు- మత్సరమనువాడు శిశుపాలుడు, ఈర్షయనువాడు, హిరణ్యాక్షుడు, అసూయయనువాడు. పౌండరీకవాసుదేవుడు, డంబమను వాడు అపూర్వరాజు, దర్పమనువాడు, దశముఖరావణుడు, అహంకారాదులు, మధుకైటభనరకాసుర మొదలైన ప్రముఖులు. వీరలనంతకోటి భుజబల పరాక్రమముగలయతి శూరులైన వారినిచంపి యుండురీతి యీముముక్షువైన నిరుపేదయగు వాడిని మీరందరున్ను గుంపుగూడి యుండగా జెడుపుటయొక యాశ్చర్యముగాదు, మరియు రజోతమోగుణవృత్తులైన మీస్త్రీలున్ను, వ్యభిచారులవలెనొక విషయమువిడచి మరియొక విషయములనవలంబించుటచేత పతివ్రతలైనవారు కుటిలాంగనలగుమియందు నేలాగుప్రకాశించరో యాలాగే చిత్తైనయాత్మ

జడమైన రాజసాది వృత్తులుగలిగిన చోట్లదుంప్రకాశించచ డు. చీకటియందు సర్వపదార్థములేలాగు ప్రకాశించవో యాలాగేయవిద్య మొదలైనసీతల్లులున్న చోట్లయందును ఆత్మ ప్రకాశించదనెను.

ప్ర. స్వభావమైయాత్మసుఖస్వరూపమై యున్నపక్షమం దు సకల ప్రదేశములయందతడేలప్రకాశించడు?

ఉ. పృథ్వికిని యుదకమునకును నింకాకొన్ని వస్తు వులకు శీతలం స్వభావమైయున్నను, మధ్యాహ్నకాల మందు యుదకము మొదలగువాటికి ముందుండిన చలవ తోచనిమేరకు రాగాదిప్రముఖులై మీరుండుచోట సహ వాస దోషంబుచే నాత్మకు సుఖంబుదోచదు. ఈజీవు డు తన యధిష్ఠానమైన యాత్మయందేల రమించడనిన యొకదాసిని రప్పించి యొకయోగ్యుని రమించమని మ రియొకడు వేడుకొన్నను తనసొంతస్త్రీనే రమించని వాడుదాసిని జేరడుగదా! యాప్రకారముమీరు దుర్విష యములైనదాసీలదీసుకవచ్చి, యీజీవుని మోసపరచినం దున తానునిజస్వరూపమందు రమించలేదని జెప్పినవి కోర్టువారువిని నితనుజెప్పినవి యావత్తున్నుసరి యని యంగీకరించి వీడుముక్తికి ముఖ్యార్హుడని మెచ్చి బహు మానమొసగియటుపిమ్మట దమమను సాక్షిని బిలువ మని యాజ్ఞాపించెను.

## ౪, వ- సాక్షిదమమనువానివిచారణ.

దమమనువాఁడు హాజరైన తోడనే, ప్రతివాది వకీలుగా వచ్చినఘోరమూఢబుద్ధియనువాఁ డతనియన్న గారిని యడిగినమేరకు నన్నడిగితేజెప్పెదననెను, అదివిని ప్రతివాదివకీలు కోర్టువారినిజూచి మనవిసేయడమేమ నగా, ముందువచ్చినశమంబనుసాక్షి లోపలనున్నరాగా ది బిడ్డలను యేలాగుజంపెనోయాలాగే, దమంబనువాఁ డు బాహ్యమందుండు జ్ఞానేంద్రియకర్మేంద్రియములగు బిడ్డలను జంపినకులపాతకుడు, కావునయటులజంపుటకు గారణమేమో యవి కోర్టువారు విచారించవలయు ననగా.

ప్ర. దమంబనువానిజూచి కోర్టువారు యిప్పుడు నీ యెదట ప్రతివాదివకీలుజెప్పినవాటికేమి సమాధానము జెప్పగలవనగా?

ఉ. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధంబులనుజ్ఞానేంద్రి య శత్రువులుమిగులబలపరాక్రమముగల వారలై ఆ స్తం బబ్రహ్మ పర్యంతము జీవకోట్లనుబలువిధయిడుములకులో బడజేసి నాశముజెందించ సామర్థ్యముగలవి, వానిలో నొకొ్కకజ్ఞానేంద్రియ పగవాడుచేయఁజాలుదుర్మార్గ మిచ్చటకొద్దిగాదెలుపబడును.

## శ్రోత్రేంద్రియ ఆపదలు.

శ్లో॥ గ్రామ్యగీతంనశ్రుణు యాద్యతిర్వనచరః క్వచిత్, శిక్షేతహరిణాద్బద్ధాన్మృగయోర్గీతమోహితాత్॥ భాగవతము,

తా॥ వేశ్యామణుల అతిమధురగీతాగానంబుల విను వారలు అవశ్యమువారలపాశ బంధములం దగులుదురు; జింకలు, వెలుగుచుండు దివిటీలనుజూచియు, వేటవాడు చేయు గంటానాదంబును విన్నతోడ నేభ్రమసిమెయిమర చి నిశ్చేష్టతతో నిలువగా వాటినియాబోయవాడుబహు సులభముగా వలవేసిపట్టువాడు.

మఱియు ఋష్యశృంగమహర్షి పుట్టినదిమొదలు స్త్రీలజూడని వాడయ్యును, రోమపాదునిచే బంపబడ్డ హారవనితాజనమధురగానలోలుడై యాస్త్రీజనంబులకు వశ్యుడై వారలవెంబడించి వనంబువదలి పురంబునకువెళ్లి శాంతబిడ్డను బెండ్లాడెను.

శ్లో॥ పశుర్వేత్తి శిశుర్వేత్తి వేత్తిగానరసంఫణిః॥ అనురీతిగాగానరసంబనునది, పశువులను, శిశువులను, పాములను, ఆహ్లాదింపజేయుచున్నది, ఇవిమెయిమరచినవై యితరులకు వశ్యులై ఆపదలకుబాలగుచున్నవి, గానయీ శ్రోత్రముకంటెపరమ శత్రువొవడుండును.

## త్వగేంద్రియమువలని యిడుములు.

స్త్రీయాలింగనసంభోగాదిచేష్టలుస్పర్శాసుఖమనబడును.

శ్లో॥ తథాపి యువతీంభిక్షుర్నస్పృశేద్దారవీమపి, స్పృశన్ కరీనబధ్యేతకరిణ్యాఅంగసంగతః॥ భాగవతం॥

తా॥ మావటీలచేదేబడ్డయాడయేనుగయొక్క యంగస్పర్శసుఖలేశమునపేక్షించి మొగయేనుగ గట్టబడుతున్నది, ఆవలనామావటీలవలన సకల బాధలుజెందుతున్నవి,గాననంగనాయంగస్పర్శ సకలానర్థంబులకుమూలంబనియెరిగి, స్వధర్మనిష్ఠులైన సన్యాసులు స్త్రీలజూచిన మాత్రమున దూరముగా బరుగులిడవలెను, వారలదర్శనమే గూడదన్నప్పుడు వారలస్పర్శ స్వప్నమందున్ను గూడదుగదా.

మఱియుస్త్రీస్పర్శేచ్ఛవలన బడరానిపాట్లు పడినవారలునున్నుమడిసినవారలనున్నుగొద్దిగానుడువ బడును.

పూర్వము ఇంద్రుండు అహల్యాసంభోగంబుచే గౌతమమహర్షిశాపంబునొంది దేహమంతయు యోనులుగలవాడై భ్రష్టుండాయె, మరియుమహాబలప్రరాక్రములగు సుందోపసుందరులను రాక్షసులు అన్యోన్యమైత్రిగలవారలైయుండియు తిలోత్తమయనుస్త్రీ సంభోగమును నాయిరువరులుగోరి ప్రబల యుద్ధంబుసేసి యమపురికేగిరి. రావణునివంటి సకలవేద పారంగతుడునుస్త్రీయంగస్పర్శ

గోరి శ్రీరామునిచే బుత్రమిత్రాదులతో హతుండయ్యె, యింకనిటులనేకు లుందురు, మొత్తములో కులాంగనల సంభోగములవల్లనున్ను పురుషుడు నానాటికి బలహీనుడై బుద్ధిమాంద్యముం జెంది వ్యాధిగ్రస్థుడై అపమృత్యువు పాలగుచున్నాడు, ఈత్వగేంద్రియవ్యాపార దోషంబుకంటె భయంకరమైనదేమున్నది?

## చక్షురేంద్రియము చేగలుగుఅనర్థములు.

శ్లో॥ దృష్ట్వాస్త్రియం దేవమాయాంతద్భావైరజితేంద్రియః। ప్రలోభితః పతత్యంధేతమస్యగ్నౌ పతంగవత్॥ భాగవతః॥

తా॥ పతంగమను యెగిరెడు పురువుప్రజ్వరిల్లుచుండు దీపశిఖనుగనుంగొని అదియేదోయొక సుఖపదార్థమని భ్రమసిదా నిగ్రహించంజనియందు బడిచచ్చినటుల మాయాకార్యమగు యువతీజన యంగవిలాసములు మనుజుండు గనుంగొని వారలసంభోగాదులను నంగస్పర్శలవలన పరమసుఖమున్నదని భ్రమసి పరుగులిడి తుట్టతుదకు వారలభోగాలేశ కార్యఫలమగు చిరకాల కారాగృహంబునబడి ఆపదజెందుదురు కాన పదార్థములమీదిరూపము జూచినమాత్రమునభ్రమించందగదు, ముష్టిపండు

చూపునకెంతో బాగైయుండును, మనుజుడు తినినమాత్ర మునచావక మానడు, అటుల స్త్రీవిలాసములు చూపునకెంతో రమ్యముగానుండును' కడకుసకలవిధయాపదలు దెచ్చును. అందుచేతనే చక్షురేంద్రియ నిగ్రహామవశ్యము కర్తవ్యము.



రసనేంద్రియమువలని బాధలు.



శ్లో॥ జిహ్వాయాంతి ప్రమాధిన్యా జనోరస విమోహితః। మృత్యుమృచ్ఛత్య సద్బుద్ధిర్మీనస్తు బడిశైర్యథా॥ భారతం॥

తా॥ రుచిగల భక్ష్యముల యందాశయుంచుట మరణమునకుమూలంబగును. ఎవనికి రసనేంద్రియ చాపల్యముకలదో యాతండనర్థదుఃఖంబుల ననుభవించువాడౌను. మీనము రసమాధుర్యవినోదముచేగాల మందుజిక్కి చచ్చుచున్నది, మధురమైన పదార్థములు చూపునకుత్తమముగగానంబడును, అయితేవానిలో వ్యాధులనేడుగాలపుముండ్లుగుప్తముగానుండునవి, జిహ్వాచాపల్యము గలవాడు భవరోగపంకంబునబొరలుచుండువాడు, అట్టివాడు బుద్ధియుక్తుడెట్లుగాగలడు, మనుష్యులకుచేటు దెచ్చునట్టి ఇంద్రియములకు బలిమినిచ్చునవి రసనాధారము గానుండును. నాలుకద్వారామధుర పదార్థములరసము

లనులోగొనునవుడు ఇంద్రియగ్రామమునకు ఉన్మత్తత్వ ముగలుగుచున్నది, ఈరసనేంద్రియ జయముగాని యెడలభవరోగముతొలగుటకష్టము-

ఇంతియగాక, రసనేంద్రియమగు నాలుక, షడ్రసరుచులకుచాపల్యత నొందించి సకలవిధరోగంబుల గలుగజేసి యాయుఃక్షీణంబునొందించి, అకాలమరణంబునకు కారణంబగునదిలోకానుభవము. మనుజుండీవిధంబుగా నాశంబు నొందుటయేగాక యీనాలుకసకలవిధమాటల కాధారమయినది. కాలదేశవర్తమానంబులంబట్టి సమయోచిత యుక్తియుక్తమంచి మాటలచే, సౌఖ్యశ్రేయస్కరములుకలుగుచున్నవి. తద్వ్య తిరిక్తపరుసవాక్కుల చే, లోకాపవాదము, పగ, తిరస్కారము, ప్రాణహానియువిమొదలగునవి సంప్రాప్తమగుచున్నవి, ఇందుకు నిదర్శనముగా బద్యములుకొన్నిగలవు, ఉ॥ మాటలచేత దేవతలు మన్ననజేసి వరంబులిత్తురుర్, మాటలచేత భూపతులు మన్ననజేసి ధనంబు లిత్తురుర్, మాటల చేతకామినులు మన్ననజేసి సుఖంబులిత్తురుర్, మాటలు నేరకున్న యవమానము నూనముప్రాణహానియుర్॥ మరియు, కం॥ కాకేమి తన్నుదిట్టెనె, కోకిలదనకేమిధనము గోకొమ్మనెనే, లోకముపగలగు బరుసని, వాక్కునజూట్టవాగుమధురవాక్యమువలనర్, ॥శ్లో॥సత్యంబ్రూయాత్ ప్రి

యంబ్రూయాత్, నబ్రూయాత్ సత్యమప్రియమ్॥ అను ప్రమాణము రీతిగా, సత్యముపలుకవలెను, ప్రియముగాను బలుకవలెను, సత్యమైనప్పటికిన్ని లోకులకప్రియమైనవి వచింపదగదు, పండితులు తెలివిపరులు నెంతో జాగ రూకులై పలుకనారంభించి నప్పటికిని, నాలుకతనస్వా భావిక గుణము చేమాటలు పొరబాట్లువడుచున్నవి. యె దటివారల కతృప్తిగలుగుచున్నది, యీకారణముబట్టి పెద్దలు వాఙ్మౌనం, మనోమౌనం, కాష్ఠమౌనం మొదల గువాటిని నవలంబించెదరు. మనోజయంబునకుయీవిధ రసనేంద్రియ నిగ్రహంబుగారణంబుగా నుంటున్నది, కా ననౌనమాశ్రయించమని శ్రుతులున్ను బలుకుచున్నవి. శ్రుతి॥ సత్యచిద్ఘనమఖండమద్వయం సర్వదృశ్యరహితం నిరామయం, యత్పదంవిమల మద్వయంశివం, తత్సదాహ మితి మౌనమాశ్రయ॥ జన్మమృత్యుసుఖదుఃఖవర్జితం, జా తినీతికుల గోత్రదూరకం, చిద్వివర్తజగతోస్యకారణం, తత్సదాహమితిమౌనమాశ్రయ॥ పూర్ణమద్వయమఖండ చేతనం విశ్వభేదకలనాదివర్జితం। అద్వితీయపరసచ్చిదగ్ శకం, తత్సదాహమితిమౌన మాశ్రయ॥ అనివరాహోపని షత్తురీతిగా, బహుశ్రుతులు వలుకుచున్నవి, కాబట్టి రస నేంద్రియం బగునాలుక నణచి పట్టిమాటలుడుగ బ్రయ త్నించుట పరమశ్రేయోపాయంబు.

## ఘ్రాణేంద్రియమువలనిడుములు.



ప్రపంచమందు సుగంధ దుర్గంధంబులను రెండువిధంబులుగలవు. మనుష్యాదికొన్ని జీవరాసులు తమకలవాటగు కొన్నివాసనలను సుగంధముగానపేక్షించుచున్నవి. కొన్నిజంతువులు వానినేదుర్వాసనయని పరిత్యజించు చున్నవి. సాధారణముగా జీవకోట్లు తమకు యింపగువస్తువులు వానివాసనలవల్ల దెలుసుకొని అచ్చోటికేగి పేరాసతోడనాపదార్థమునుతినజొచ్చినందుబడి ప్రాణములవిడుచుచున్నవి. అదెటులనగాగీటకములుకొన్ని వాసనావశంబై పుష్పములమకరందములనుగ్రోలుమేరకుచంపకపుష్పమందు వ్రాలిజచ్చును.కొన్ని ఈగలువాసనావశంబయి,కల్లుకుండలుకుడితికుండలవద్దముసరుకొని అందుపడిచచ్చుచున్నవి. చీమలుతేనే, నేతి, పాత్రములవద్దకిపోయివేలకొలది వానిపానముజేసి అందుబడి ప్రాణముల విడుచుచున్నవి, మూషకాదులు మాంసమత్స్యాదుల భక్ష్యాదులుకోరి వీనివాసనలచే నాతురపడి వానియుంచియుండు బోనులోకిజొచ్చిఅందుదగులుకొని ప్రాణములవిడుచుచున్నవి. ఈవిధముగానే మనుజుడును, వాసన యుక్తంబయ్యునపథ్యంబయ్యునుండు పదార్థంబుల దిననిచ్ఛగొని వానినియధికముగాసాపడి పలువిధ రోగములకులో బడుచుందురు? కానసన్మార్గుడు గంధేంద్రియవిషయ వ్యాపారము

లకుజోటివ్వక సకలయింద్రియ జయముగలవాడై ఆ
త్మారాముడై సుఖంబుండును, వీనికి ప్రమాణములుగా
వేమన్నశివయోగీంద్రులు, జ్ఞానేంద్రియ వ్యాపారముల
ను పరమశత్రువులని నిరసించుచున్నారు, సీ॥ చెవులు
గోరునుమంచి సంగీతసాహిత్య భాషాదులైనట్టిపలుకుబ
ళ్లు, చర్మంబుగోరును సరవితోడుతశైత్య మృదుష్ణకా
ఠిన్యములను నెపుడు, గన్నులుగోరును గరమూలవర్ణం
బులైనట్టిరూపము లనవరతము, నాలుకగోరును నయ
ముతోడుతతీపుపగరు కారమ్ముచేదుప్పుపులుసు, ॥గీ॥
ముక్కుగోరును సుగంధముల్ ముదముతోడ, జెవులు
చర్మంబు గన్నులు జిహ్వముక్కు,యిన్నిగల్గిన యటువం
టి యిల్లురోసి, తన్నుగనుగొని సుఖియింప దగును వేమ॥
అనిజెప్పియుండునదియునుంగాక, ప్రపంచమందు ఋణశే
షమునశత్రుశేషమునుంచ గూడదని పెద్దలుచెప్పుదురుగా
న, ఈజ్ఞానేంద్రియములను కులపాతకశత్రువులనునిర్మూ
లము చేయకలోకులుక్షేమపడరు, కానవారలచంపుటవ
లన బుణ్యంబేగానిపాపంబులేదు, ఇటులదమంబను వాడు
వాదించగోర్టువారుపరమార్థవాదంబుతోడనాలకించి అత
నికిఇంద్రియ నిగ్రహాశూరుండని బిరుదుపేరిచ్చి తక్కిన
సాక్షులబిలువమనెను.

## ౫- వ- సాక్షి, ఉపరతి విచారణ,

కోర్టువారి సన్నిధానమందుపరతి యనుస్త్రీనిబిలిపించి ప్రమాణముజేయించి, నీవుసకలకర్మములనుజెడిపిన మహాపాతకియుగాదాయని యడిగినందుకు, ఆబిడఘోరమూఢబుద్ధియను ప్రతివాది వకీలునుజూచి యోరిపాతకా సకలమైన వారికిన్ని కర్మముచేతదుఃఖమున్ను కర్మత్యాగముచే సుఖమున్ను గలుగుచున్నవి, కర్మారంభమధ్యాంతములందున్ను దుఃఖమేగలిగియుండునది సర్వత్రయనుభవముగా నున్నప్పుడు॥ శ్రుతి॥ అనేకచిత్తవిభ్రాంతా మోహజాలసమావృతాః। ప్రసక్తాః కామభోగేషు పతంతి నరకేఽశుచౌ॥ అనునటుల చిత్తభ్రాంతి గలిగి సకామ్య కర్మానుష్ఠానములచే గాలము గడుపువారు నరకమును బొందుదురనియుభగవద్వాక్యమున్ను అనేక శ్రుతులున్ను ఘోషించుచున్నవి గనుకసర్వ కర్మములవిడిచి యూరకేమౌనమైకదలమెదలకయున్న నన్నుజూచిమహాపాతకీయను నదెట్లున్నదనగా, కులపాతకాదులు జేయువాడు, నెమ్మదిగానున్న మరియొకనిజూచియోపాపీ యని బిలిచిన ప్రకారముగానున్నదేగాని మరేమియు గాదు, అనివాదముచాలించజూచి యీవచనముల నాలకించిన కోర్టువారిస్త్రీజెప్పినవి యూవత్తున్ను శ్రుతి

యుక్తముగా నున్నందుచేత సరియని నంగీకరించినది గాక యీమెయాత్మయొక్క యసంగత్వముననుసరించిన పట్టమహిషియను కిపాయితుపేరిచ్చి ఘోరమూఢబుద్ధియనుప్రతి వాదివకీలునుజూచి శీఘ్రము యితరసాక్షులవిచారణగానిమ్మనెను, యీలాగెతదనంతరముతక్కినసాక్షులను బిలువనాజ్ఞాపించెను.

## ౬-వ- సాక్షిశ్రద్ధయొక్క విచారణ.

ఘోరమూఢబుద్ధి యనుప్రతివాది వకీలు కోర్టువారి ముందుగసాక్షిగావచ్చిన శ్రద్ధయనునామెను బిలిచిప్రమాణముచేయించి.

ప్ర. నీవుసకలశాస్త్రాభిప్రాయముల దెలిసిన పెద్దలను విడిచి, సకలబంధు జనవాత్సల్యతయును, సకలశాస్త్రాభిమానములున్ను, యమనియమాసనాదులను సర్వకర్మోపాసనాదులును విడచి చోరనాయకుని దైవమనినమ్మి జెతిడివిగాదాయని యడిగినందుకు శ్రద్ధయిటులజెప్పౌట.

ఉ. వినువోరినీ మూర్ఖపట్టు సాధించనెంచుఘోరమూఢబుద్ధీ, యోగ్యతలేని చిత్తవృత్తిగల నరాధముడనీవేగదా? యిప్పుడునీవేమన్నావు! వోరిమూర్ఖా, నేను ఆత్మానుభవ శాస్త్రములైన వేదాంతమున్ను, ఆత్మనాథుడైనసద్గురునినమ్మిన నేనోజెడ్డది, బళా మహాబాగున్నది.

యుక్తముగా నున్నందుచేత సరియని సంగీకరించినది గాక యీమెయాత్మయొక్క యసంగత్వము ననుసరించిన పట్టమహిషియను కిపాయితుపేరిచ్చి ఘోరమూఢబుద్ధియనుప్రతి వాదిపకీలునుజూచి శీఘ్రము యితరసాక్షులవిచారణగానిమ్మనెను, యాలాగెతదనంతరముతక్కనసాక్షులను బిలువనా జ్ఞాపించెను.

## ౬- వ- సాక్షిశ్రద్ధయొక్క విచారణ.

ఘోరమూఢబుద్ధి యనుప్రతివాది వకీలు కోర్టువారి ముందుగసాక్షిగావచ్చిన శ్రద్ధయనునామెను బిలిచిప్రమాణముచేయించి.

ప్ర. నీవుసకలశాస్త్రాభిప్రాయముల దెలిసిన పెద్దలను విడిచి, సకలబంధు జనవాత్సల్యతయును, సకలశాస్త్రాభిమానములున్ను, యమనియమాసనాదులను సర్వకర్మోపాసనాదులును విడచి చోరనాయకుని దైవమనినమ్మి జెతిడివిగాదాయని యడిగినందుకు శ్రద్ధయిటుల జెప్పాట.

ఉ. వినుమోరినీ మూర్ఖపట్టు సాధించనెంచుఘోరమూఢబుద్ధీ, యోగ్యతలేని చిత్తవృత్తిగల నరాధముడునీవేగదా? యిప్పుడునీవేమన్నావు! వోరిమూర్ఖా, నేను ఆత్మానుభవ శాస్త్రములైన వేదాంతమున్ను, ఆత్మనాథుడైనసద్గురునినమ్మిన నేనోజెడ్డది, బళ్ళామహాబాగున్నది.

స్తవరాజమున్ను తక్కిన శ్రుతిస్మృతులను గొంచమైన గవనించక మూఢులగుమీరు,అనాత్మస్వరూప శాస్త్రము లను ననాత్మశాస్త్రజ్ఞులను బట్టుకొని కుటిలాంగనవలే, గెడియకొకనాయకుని కాసుకాశించిబట్టురీతిగా మీరున్ను మాయాపరవశులై, గడియకొక శాస్త్రమున్ను గడియ కొకగురుని బట్టుకొని నవస్థజెంది గురుకాశీకెమొదలైనవా టినిమిత్తమై,గురుశిష్యులకుమన స్తాపముగలిగిఉల్లాడియా కులుమేయుమేకలవలెదిక్కుపట్టితిరుగులాడెదుమీరలీ ప్రశ్న నడిగినదేవిధమనగా,దొబ్బదిరుగులాడు శునకముదాజేయు హీనకార్యమును మదినెన్నక, సింహాసనమందు చక్రవర్తి తొడమీదు గూర్చుండు రాజస్త్రీని పరిహాసముసేయుమే రకున్నదని పరిహసించు, గోర్టువారిసంవాదమును జక్క గావిని, లేక, నాలకించి బ్రహ్మసాక్షాత్కారకరణసామర్థ్య ముఖ్యసాధకశిరోమణియని యాయువతీలలామణికి బిరుదు నామంబొసంగి, తదుపరి మిగిలిన సాక్షులబిలువమనెను.

---

## ౭– వసాక్షి,సమాధానునివిచారణ॥

---

కోర్టువారుకొలువ మరియుండు సముఖమందు సాక్షి గావచ్చిన సమాధానుని బిలిచి ఘోరమూఢబుద్ధియను ప్రతివాది వకీలు ప్రమాణము చేయించి యడిగెడు.

ప్ర. సదాశివ్రుస్త్రీపురుషులకు గలిగెడు కోపావేశముల ను మధ్యవర్తులు రాజీ జేయుమేరకుచిదాకాశమైన చిత్త వృత్తిన్ని జీవుడనువానిన్ని నేకమౌనటులసమాధానము జే యుకుంటిరని గాడుగదాయనెను.

ఉ. అవును, అదితప్పుగాదెట్లనగా, మీతల్లులను మీ కోడండ్రను, మీచెల్లెలగువారిని మీభార్యలగు వారిని కన్న వారికి సదామీరు కూర్చిపెట్టడమీకోరట్టువారి ముందుగ విశదమగునటుల జెప్పబడడమగును, వినుమిప్పుడు మీ తల్లులైన యవిద్యాయావరణములను సుషుప్తియందుండు ప్రాజ్ఞునివద్దతత్సుఖార్థమైగూర్చి పెట్టడమున్ను, జాగ్రతయం దు మీభార్యలైన రాగాదులనున్ను మీకొమార్తెలైన యింద్రియాదులనున్ను, శబ్దాది విషయములవద్దతత్సుఖా ర్థమై గూర్చిపెట్టడముగాక, స్వప్నమందు వాసనాపురు షులవద్ద మీసహోదరులైన మనోవృత్తులనున్ను మీరు గూర్చి పెట్టడమేగాక, నింకాయనేక విధములై మీరు జే యు తుంటతనములు తెలియక స్త్రీరూపమైయుండు చిత్త వృత్తిని, పెండ్లికుమారుడైన జీవునితోజేర్చి స్వరూపాను భవమైన రతిసుఖమను భవించునటుల సమాధానము జే యునది తుంటతనమా? సర్వశక్తిగల యీకోరట్టువారె సర్వము యోచించి సరియైన తీర్పుజెప్పగలరనెను, నావచ నములనువిని కోర్టువారు సరిసరియనినొప్పుకొన్నవారై

వీనికి సాధుశ్రేష్ఠుడని బిరుదునామమిచ్చి తక్కినసాక్షుల ను బిలువమనెను.

## ౮- వసాక్షివిశ్వాసునివిచారణ,

ఘోరమూఢబుద్ధియను ప్రతివాది వకీలు కోర్టువారి ముందుగ విశ్వాసుని బిలిచి ప్రమాణము చేయించినపెడు.

ప్ర. నీవు ప్రపంచంబున నెల్లరనుభవము ననుండు బీజజాగ్రము, జాగ్రము, మహాజాగ్రము, జాగ్రత్స్వప్నము, సుషుప్తి, యనుసప్తభూమికలవదలి, యోగులను, జోగులను, సాములను, యీలాటివెఱ్ఱివారల అనుష్ఠేయములగు, శుభేచ్ఛ, విచారణ, తనుమానసి, సత్వాపత్తి, అసంసక్తి, పదార్థభావన, తురీయమను అవాంతరసప్తభూమికలయమృతమువదలి అంబలి తిన్నటుల అధముడుగానేల, ఇదినీకు తెలివితక్కువనేగదా?

ఉ. పేడదినెడుపురుగు బెల్లమే మెరుగును, అన్నట్లు, సచ్ఛాస్త్రపఠనయును, సజ్జనసాంగత్యము లేని దోసముచే మూఢుండై అధికహేయంబైయ్యును, దుఃఖంబైయును నరకతుల్యంబైనుండుయజ్ఞాన భూమికలమిక్కిలి శ్లాఘించి చెప్పినాడవు, అధోగతినొందించువానిస్వరూపంబులవివరించెద, సావధానచిత్తుడై వినుము.

శ్రుతి॥ బీజజాగ్రత్తథా జాగ్రన్మహా జాగ్రతథైవచ, జాగ్రత్స్వప్న స్తథాస్వప్నః స్వప్నజాగ్రత్సుషుప్తికం । ఇతి సప్తవిధోమోహాఃపునరేష పరస్పరం॥ అనెడిమహోపనిషత్తుమేరకు.

౧. బీజజాగ్రము॥ క్రిందేడులోకములలో అతలలోకము ఉనికిపాత్తి కడుపు, తెలుపువర్ణము, అఖండసచ్చిదానందపరబ్రహ్మంబునందలి త్రిగుణాత్మకప్రకృతియనెడుయెరుకబీజరూపంబుగా నుండుట చేనిదిబీజ జాగ్రతయనంబడు.ఇదిజ్ఞప్తికి నూతనావస్థ

౨. జాగ్రము = వితలలోకము,యునికిపిఱుదులు, నలుపువర్ణము, పైబీజరూపయెరుక,ప్రపంచాభిముఖంబై సంకల్పయుక్తంబై యుండుట.

౩. మహాజాగ్రము – సుతలలోకము,చోటు తొడలు, పచ్చవర్ణము, పైతెలివిలోక వాసనయై, ప్రవర్థమానంబై పలువిషయములందువిపరీత భావనల చేనిర్ధారణలుచేయుట.

౪. జాగ్రత్స్వప్నము – తలాతలలోకము, యునికిమోకాళ్ళు, ఇచ్చట గులకరాళ్ళుండునవి, దానవులు నివసింతురు, సంకల్పించివ్యర్థ మనోరాజ్యమేలుట.

౫. స్వప్నము = మహాతలలోకము, యుండుటపిక్కలు, పర్వతమయము,జాగ్రతయు నెరుకయులేనిదై,

కల్పనాస్వరూపములందు సత్యబుద్ధికలుగుట. ఈ స్వప్నమందువస్తువిచారణశూన్యము.

౬. స్వప్నజాగ్రము= రసాతలలోకము-జలమండలము లుండుచోటు- బహుకాలము చూడబడకుండుటచే స్థూలదేహపు స్ఫురణతప్పి జాగ్రద్దశవలెచిరకాలానువృత్తంబగుస్వప్న మెస్వప్నజాగ్రమనంబడు. ఇదిజాగ్రద్దశయందుగల్గును.

౭. సుషుప్తి = పాతాళలోకము, అతికాళ్ళయునికి, పైయారుయవస్థలులేని ఆత్మ ప్రతిబింబస్వరూపమగు ప్రపంచములోని విషయసుఖములందు, మునుగుటయే సుషుప్తి, ఇదియెజడంబై యొప్పు జీవునిస్థితి-ఆసమయంబుననీజీవుండుగాఢాంధ కారంబున మునిగియుండును.

పైనిన్నుదహరించినవి అధోగతి నొందించందగిన, ఏడు అజ్ఞానభూమికలు, అవ్యుత్పన్నులగు బద్ధమనుజులు అధమంబులగు యీభూముల యందంధులై సంచరించువారు. మరియునేనిక నుడువంబోవు పరమశ్రేయంబును సజ్జనానుష్టేయమునగు జ్ఞానభూమిక లేడింటిని మిక్కలిజాగ్రతతో నాలకింపుము.

శ్రుతి॥ ముక్తిస్తుజ్ఞేయమిత్యుక్తా భూమికాసప్తకాత్పరం । జ్ఞానభూమిస్సుభేచ్ఛాఖ్యా ప్రథమాసముదాహృతా।

విచారణా ద్వితీయాతు తృతీయాతనుమానసీ। సత్వాపత్తి శ్చతుర్థీ స్యా త్తతోఽసంసక్తినామికా। పదార్థభావనా షష్టీ సప్తమీతుర్యగాస్మృతా । ఆసామంతస్థితాముక్తిర స్యాం భూయోనశోచతి॥ అనెడిమహోపనిషత్తుజెప్పురీతిగా॥

౧. సుభేచ్ఛ = బొడ్డు, యునికి భూలోకము, మనుష్య నివాసము ఇందు ప్రజ్ఞాహంకారములు లేవు.

౨. విచారణ = కడుపు, చోటుభువర్లోకము, ఇచ్చట యక్షరాక్షస గంధర్వకిన్నర, కింపురుష, సిద్ధము నులు వసింతురు, మఱియు దత్వవేత్తలచే వేదాంత శ్రవణంబుచేయుచు, శ్రవణమనన నిదిధ్యాసాదులవలన వృత్తిరాహిత్యమునకయి ప్రయత్న పడుచుండుట.

3. తనుమానసి = రొమ్ము, స్థలముసువర్లోకము, ఇందు దేవతలు,వసువులు,రుద్రులు, ఆదిత్యులు వాసముసేయుదురు, మఱియునిచట చంద్రలోకము బితృలోకములుగలవు, పైరెండుభూమికల అభ్యాసము చేయుటయెగాక జ్ఞానాభిముఖముగనుండుస్థితి.

పైమూడు భూమికలు జాగ్రదావస్థలంద్రు. ఇచ్చటవు నర్జన్మములుగలవు. కడమనాల్గు భూమికలందు జన్మములులేవు

౪, సత్వాపత్తి= మెడ, యునికిమహర్లోకము, ఇచట భృగువుమొదలగువారలుందురు. పైమూడుభూమికల యభ్యాసముచే మనంబు సంకల్పరహితమై జ్ఞానకర్మేంద్రియవిషయరాహిత్యంబయి పరబ్రహ్మ నిష్ఠయందుండట. అనగానీభూమికయందు మనస్సుబ్రహ్మంబును సాక్షాత్తుగాజూడకపోయిన నులదితానగును. ఇచటజగంబు స్వప్నంబువలెగానంబడును, కాననిది స్వప్నావస్థయండ్రు. ఈయనుభవముగలవాని బ్రహ్మవిదుడండ్రు.

౫. అసంసక్తి = ముఖము,యునికిజనర్లోకము-ఇచట సనకాదులుందురు, పైనాలుగు భూమికల అభ్యాసమువలన, విషయసంకల్ప, త్రిగుణరహితంబై శుద్ధసత్వ ప్రధానమునుగాక, బ్రహ్మనిష్ఠయందలి స్థిరముగానుండుట. ఇదిసుషుప్త్యవస్థయందురు - ఈయనుభవి బ్రహ్మవిద్వర్యుడు.

౬. పదార్థభావన = భ్రూమధ్యము, యునికి తపోలోకము, ఇందువైరాగ్యులుందురు - వీరెబ్రహ్మమానసమందు ద్భవించినవారలు పైఅయిదుభూమికల అభ్యాసముచే అంతర్బహిమధ్య దృశ్యములులేక సకలవాసనాక్షయంబై, తనకన్యంబులేక అన్నియు దానేయని, బ్రహ్మస్వరూపంబగు

టయేజీవన్ముక్తి. ఇదియేతుర్యావస్థ, ఇట్టిఅనుభవవేద్యుడు బ్రహ్మవిద్వరీయుడు.

౭. తురీయము = కపాలము, చోటు సత్యలోకము, ఇచట యన్నిలోకములుంటున్నవి, పైయారుభూమికల అభ్యాసముచే అన్నితనస్వరూపమగును. అనగా అఖండ సచ్చిదానంద పరబ్రహ్మంబు తానెయగును, ఇదితుర్యా తీతము, ఇదియేవిదేహముక్తి, ఈయనుభవవేత్త బ్రహ్మవిద్వరిష్ఠుడు.

కం॥ ఏమహనీయులు సప్తమ భూమికనింపొందువా
రు పుణ్యులునాత్మా, రాములు వారలెవినుమా,
రామమహాత్మ పదమందు రంజిలుమరొగిన్.,'

॥మ॥ ఎవడీసప్తమ భూమిగన్గొనినవాడీశాచ్యుతబ్రహ్మవా, నవదేవర్షిశుకాదులన్నిగిలి సత్సంవిత్సుఖప్రాప్తుడై, వ్యవహారంబుల దృశ్యదృష్టిచెడగావర్తించువాడంచుము, న్వివరింపన్బడె వానిపాదరజమేవే మాఱుదాల్తున్దలన్॥ అనియు. పైజ్ఞాన భూమికలకు గ్రంథాంతర మందు పాఠాంతర అర్థాంతరములుగలవు, వానిగొద్దిగావివరించెదనోపికతోజదువకర్తలు,

శుభేచ్ఛయన, కాకతాళియ న్యాయంబుగ జ్ఞానసజ్జలనాడై యీయపార సంసార దుఃఖమునకు భీతిలులేవు పెద్దలనాశ్రయించి వారియపారకరుణాకటాక్షు

వీక్షణ్యంబువలన వారలయుప దేశంబు జెంది ఇహపరలోక భోగవిరక్తిగలిగిపరతత్వమునువిచారించుట.

విచారణయన = అద్వైతశాస్త్ర పరిచయంబును సజ్జన సాంగత్యంబును, వైరాగ్యంబుగలిగి బ్రహ్మవిచారణ సేయుట.

తనుమానసియన = పైరెండుభూమికల పూర్ణసాధన యుక్తుండై, సకలానర్థమూలంబగు ఇంద్రియవ్యాపార సుఖ్యయందు దగులుపడక, మనోనాశంబుగావించుట. దీనికేఅసంగమనినామాంతరముగలదు. అదియును కొన్ని భేదములచేనొప్పియుండు.

సత్వాపత్తియన = పైమూడుభూమికల అభ్యాసయుక్తుడై, ఇంద్రియనిగ్రహుండై, శుద్ధాంతరంగుండై, అన్యసంకల్పములులేక బ్రహ్మనిష్ఠుండై యుండుట.

సంసక్తినామిక, లేక అసంసక్తియన, యీనాల్గుభూమికల యభ్యాసముచే, విషయసంగ గుణత్రయసంగంబులు మానిబ్రహ్మనిష్ఠయంమూర్జితుడై యుండుట.

పదార్థభావనయన = పైయైదు భూమికలయభ్యాస బలీయముచే, అంతర్బహిర్మధ్య దృశ్యములులేకస్వాత్మారాముడై అహంబ్రహ్మాస్మి యనుట.

తురీయమునగా = పైయారు భూమికల మార్గంబులెఱింగి యభేదబుద్ధియుక్తుండై పరబ్రహ్మమాత్రుడై యుండుట.

పై నినుదహరించిన జ్ఞాన భూమిక లేదు నొకటికొకటి ఘోరసంసార దుఃఖార్ణవమగ్న జనంబులపైకి లేవదీసిరక్షించుసామర్థ్యముగలిగిన వగును. అట్టి యూర్ధ్వగతి నొందించునట్టి జ్ఞాన భూమికలెక్కడ, ఘోరవిషాదసంసృతి పంకజలధిమగ్నత నొందించి యధోగతికి దెచ్చునట్టి దుశ్చేష్టస్వభావంబుగల అజ్ఞానభూమికలెక్కడ, ఇందలితారతమ్యంబులిచ్చటికికోర్టుకువచ్చియుండుప్రాజ్ఞులెరుగనోపుదురు, ఇటులుండి నిరక్షరకుక్షియగు ప్రతికక్షి వక్కీలు ఆవంత సిగ్గైనలేక అజ్ఞానభూమికలను శ్లాఘించి వదిరెను - నానకోర్టువారలు మాయిరువరుల వాదంబుల దీర్ఘాలోచనకు దెచ్చుకొని న్యాయంబు గృపసేయ కర్తలని మానంబవలంబింప, సర్వజ్ఞులైన సద్గురుప్రభుండగు జడ్జిగారు ఇరుతరపు వాదంబుల జక్కనాలకించి విశ్వాసుని శాస్త్రానుభవయుక్తంబులగు సద్యుక్తివాదంబులకుహర్షించి యీతండుముక్తి రాజ్యాభిషిక్తంబు నకర్హుండని యోగ్యతానామంబొసంగి ఎల్లరకు ప్రసిద్ధపరచి - ఇకసాక్షివిచారణ యనావశ్యంబనియుఇంతవరకేవాస్తవంబెరింగిత్రప్తిజెందదమయినదనియు,మీరుహీయదింగు చేయుటకర్తవ్యమనియు సెలవొసంగవారలట్లుచేయ నుద్యుక్తులయిరి.

## ఘోరమూఢబుద్ధియను

## ప్రతివాదివకీలుసేయు హియరింగి.

తనమూర్ఖపట్టుసాధించే ఘోరమూఢబుద్ధియను ప్రతివాదివకీలులేచి, అచలపరబ్రహ్మ స్వరూపులగుకోర్టువారిముందుగనిలచి యేలినవారిని నమస్కరించినాసాక్షులచేతనున్ను, నాసాక్షులనువాదివకీలుచేశిన క్రాసులవల్లనున్ను, వాదిజేయబడినదావా రద్దుపరచి ఉపనిషత్తు మొదలగు దస్తావేజులనువానిభేదములున్ను వాదిసాక్ష్యములభేదములనుగురించి మనవిసేయడమేమనగా?

వాదితరపు శాసనములగుశ్రుతులు మొదట నిష్కామకర్మానుష్ఠానముచే నీశ్వరుని కృపగలుననియు, దానివల్లజిత్తశుద్ధిగలుగుననియు. జిత్తశుద్ధిచేనిత్యానిత్యవస్తువివేకము లభించుననియు, దానిపైఇహపరలోక విరక్తికలుగుననియు, దానిచేమనో నిగ్రహమును, నింద్రియనిగ్రహమును, శాంత శమదమాది షడ్గుణములు గలుగుననియును, యటుమీదట ముముక్షుత్వమున్ను, దానిపై సద్గురుకటాక్షంబును, జతుర్విధ శుశ్రూషలున్ను, శ్రవణమననని దిధ్యాసములుమొదలగు సాధనల సంపాద్యమొందవలయుననియు, యివివినాసాధనాంతరములేవిలేవనియు,

ఆత్మ యేకమనియు, మరొకచోట బంధమోక్షములు కద్దనియు, మరియొకచోటబంధమోక్షములు లేవనియు నిట్లనేకవిధములై పిచ్చివానివలె వదరుచున్నవి, యిదియునుంగాక బంధమోక్షములకు ఆత్మవ్యతిరిక్తమైతే, బంధనివర్తియైన మోక్షమునుగురించిపైజెప్పినప్రయాసములేవియు నక్కరలేదన్నాను. ఆత్మకుబంధముకద్దన్నాను, కాకికినలుపువలె నొకకాలమున్ను పోవలసినదిలేదు, ఇట్లనంతవిరోధములైయున్నందుచేత వాదియొక్క పిర్యాదునుతోసివేసియెప్పటివలె నొకకాలమున్ను మాఱులేకమాయనుభవప్రకారము పామరుడు కర్మి, భక్తుడనుమాకు,క్రిందికోర్టువారుతీర్పుజేసిన దేసరియని నీకోర్టువారున్ను తీర్పుజేయడము సంలభమైయున్నందుచేత, యీలాగె తీర్పుదయజేయగోరెదము, అనినిలచిన మాత్రమున వాదివక్కీలులేచి నిలువబడినవాడై జేయుహీయరింగి.

---

వాదివక్కీలు సేయుహీయరింగి.

---

పరమార్థన్యాయతీర్పుకోర్టువారైన అచలపరబ్రహ్మస్వరూపాపరోక్ష సాక్షాత్కారసద్గురుప్రభు చక్రవర్తియై వెలుంగు జడ్జిగారి సన్నిధియందు ప్రతివాదుల రికార్డులున్ను, ప్రతివాదులసాక్ష్యములున్ను, ప్రతివాదివక్కీలుచేసిన

తర్కప్రశ్నలగు క్రాసులున్ను, నబద్ధమై పోయినదియు నుంగాక, మాతరపుసాక్షులవల్ల రుజువై యున్న విషయములు కోర్టువారికే పూర్ణమై దెలిసియుండగ, నింకను, భయములేక వాదులాడడముజూడ, లేతదూడభయ మెరుగక గంతులువేయురీతివీరు ధైర్యముగా మాట్లాడునట్టియవివేకతనుగురించి మిక్కిలి యాశ్చర్యమొందెదను, ధర్మదేవతాస్వరూపులైన కోర్టువారుమీదలయందు దయయుంచి, నాహియరింగి వచనములనాలకించి తీర్పుజెప్పువరకు యీప్రతివాదులు, సుషుప్తి మూర్ఛలనుయడవులందున్ను, గుహాలయందున్ను, పాతిపోకుండేలాగు పద్మాసనము మొదలగు కాలికట్టుసంకెళ్ళున్ను, చిన్ముద్రయను చేతిసంకెళ్ళున్ను, వేయించినా సాగ్రదృష్టియను కావలిబందోబస్తున నుంచేలాగుదయ సేయవలయునని ప్రార్థించ. నాప్రకారము త్తరవైన పిదప వాదివకీలు సూక్ష్మగ్రాహ్యసాత్వికాంశబుద్ధియనువాడు కోర్టువారిని జూచి నమస్కరించి జెప్పుటలేవఁగా.

పరమార్థమానట్టి కేవలపరమాత్మస్వరూపమైన, తనయందు లేకతనవద్ద యజ్ఞానమైనదియున్ను, విక్షేపావరణమనునదియున్ను. మరిజెప్పబడు యేవిధమైన సంకల్పములుపరమార్థమగునట్టుకాలత్రయమందున్ను రానులేదు పోనూలేదు, అయిననువ్యవహారమందుస్వప్న భ్రాంతివత్తె

నసత్యముగా నొక జగత్తున్నదనియు, వాటిలో ననేక జీవులున్నారనియును, నీశ్వరుడు మరియొకడున్నాడని యును జెప్పునట్టిభ్రమను బోగొట్టు నిమిత్తమై, శ్రుతులు జెప్పుచేమనగా, మొదటనిష్కామ కర్మానుష్ఠానములచేత, నీశ్వరకృపగలుగుననియు దానివల్లచిత్తశుద్ధియు, దానిపైనిత్యానిత్యవస్తు వివేకాదిసాధనచతుష్టయ సంపత్తికల్గుననియు, నట్లుసాధనచతుష్టయముగలిగినయధికారి తాపత్రయదుఃఖముచేదపించువాడునై సద్గురువద్దికిబోయి, సంసారతాపమునుగురించిమనవిజేసుకొనవలయుననియు, గురునికృపచేత నిన్నునీవెరిగితేనీకుజననమరణాది సంసారంబులులేవనియు, దన్నుమరచి నందుచేతజననమరణాదులువచ్చుననియు, నవియేయధ్యారోపమనియు, వాటిని నివృత్తిజేయు యుక్తికి నపవాదమనియు, యీయపవాద యుక్తిచేముక్తిపొందవలననియు, దన్నుమరచినందుచేత గలిగినయజ్ఞానముమూడుగుణములై యున్నవనియు, వాని లోసత్వమునందు జేరినబ్రహ్మంబునీశ్వరుండనియు, రజోగుణసహితంబైనబ్రహ్మంబు జీవుండనియు, తమోగుణ సహితబ్రహ్మంబునావరణవిక్షేపమనియు, నిందుచేతయాత్మానాత్మభేదంబు దెలియక మరుగుపరచునది యావరణ మనియు, విక్షేపము మూడుగుణములచేత పంచభూతములనుత్పత్తి జేసెననియు, యీసూక్ష్మభూతములందుండి

సత్వగుణ సమష్టి, వియష్టిచేత జ్ఞానేంద్రియములున్ను,
నంతరేంద్రియములగునంతఃకరణములున్ను గలిగెననియు,
రజోగుణసమష్టి వియష్టులచేత, కర్మేంద్రియములున్ను,
ప్రాణవాయువులున్ను గలిగెననియు, తమోగుణమునం
దు పంచీకరణమైన స్థూలభూతములు గలిగెననియు, దా
నివల్లవివేకమాయచేత నవివేకమాయెను, పాదములం
దంటిన యడుసును శుద్ధజలముచేత గడిగిపోగొట్టురీతిగా
బోగొట్టవలయుననియు, యీశుద్ధాశుద్ధమాయచేతనే,
జీవులకు యేడవస్థలు గలిగియున్నవనియు, దశముని దృ
ష్టాంతముచేత తనవద్దనే యేడవస్థలుగలిగినశించుననియు,
యీదశముడనువాడు, తానెయనియెరిగినట్టుగా త్వంపద
విచారమువల్ల పంచకోశములను నేతినేతియనువాక్యము
చేత నిరసించినసచ్చిదానంద వెలుగై ప్రకాశించు సర్వసా
క్షియేనీవు, నీవేసర్వసాక్షియనియు, నెరుగునెరుకనుయె
రుగమరియొక యెరుకలేదనియు, విధిముఖముగ మహావా
క్యార్థమంత్రోప దేశముజేసియు, వాక్యకల్పనలయందు
భేదమేగాని లక్ష్యమునందేవిధ భేదములేదనియు జెప్పి
నప్రకారము శిష్యుడైనవాడున్ను కూటస్థబ్రహ్మముల
నునైక్య పరచియనుభవించినాడనియు, మరలయజ్ఞాన
సంశయ విపరీతములైనప్రతిబంధములచేత, జ్ఞానముస్థిర
పడదనియు, శ్రవణ, మనన, నిదిధ్యాసములచేతనాప్రతి

బంధములు నివర్తియై ప్రజ్ఞానంబు స్థిరపడుననియు, స్థిరపడినబ్రహ్మజ్ఞానులు, బ్రహ్మవిదుడనియు, బ్రహ్మవిద్వరుడనియు, బ్రహ్మవిద్వర్యుడనియు, బ్రహ్మవిద్వరిష్టుడనియు, జెప్పబడు, యీనలుగురిలో బ్రహ్మవిదుడు యజ్ఞానులవలె వ్యవహరించినను, యేసంబంధములేనినాకాశమువలె, నుండుననియు, సంచితకర్మములు జలజపత్రమునందు నీరంటని చందంబున యకర్తబుద్ధిచేత వారినినంటదనియు, ప్రారబ్ధకర్మములు దినాలపేరట, కష్టపరుచుచున్న పుండ్లారి వచ్చేలాగు జీవుడనుభవించవలననియు, ప్రారబ్ధానుభవముచేత గలిగెడు పాపపుణ్యములను దూషణ భూషణ జేయువారలపహరించు కొంటురనియు, తత్వజ్ఞానమువచ్చినంతనే ప్రకాశముగన్న చీకటివలెకారణశరీరము నష్టమైపోవుననియు, స్థూలశరీరము ప్రారబ్ధనాశమందు విరగబడిన ఘటము భంగిస్థూల భూతములందు లయమగుననియు, ఘటాకాశమనునది ఘటము విరగబడినంత మహాకాశమయినట్లుగా, విదేహ ముక్తినిపొందుదు రనియు, జెప్పిన శ్రుతిస్మృతి వచనములన్నియు నాకాశము దెలియనివానికి, రూపముత్రవ్వియాకాశమును జూపించినట్లేగాని వేరుకానేరదు, వాస్తవమునసీ ప్రతికక్షులునీ నామరూపదేహేంద్రియాంతఃకరణ దృశ్యప్రపంచంబును యెండమావులు, శుక్తికారజితము, త్రాటిభుజంగము, వంధ్యాపుత్రుడు,

స్థాణువునచోరుడు, యనునవియన్నియు కాలత్రయము లందునుమిాపాదములానగా మిథ్యనేగానినిజముగా నేరదు, బ్రహ్మస్వరూపమగు, ఆత్మార్థమునువినహ మరియేదియు న్నుజూడలేనందున ॥శ్రుతి ॥ సర్వంఖల్విదంబ్రహ్మ,, ,,పరమార్థతోనకశ్చిదస్తి,," ప్రజ్ఞానంబ్రహ్మాహం,,"తస్మాథ్బ్రహ్మవ్యతిరిక్తం సర్వంబాధితమేవపరబ్రహ్మ,, అనురీతిగా నేనను ప్రజ్ఞాన స్వరూపమైన ఆత్మసేసత్యమని ప్రమాణముజేసి నిలువగా, వాదివకీ్కలునుజూచి నీవరకువిన్న వాటిలో నివిమిక్కిలిసంతోషకరమనియుమదినెంచి ప్రతివాదులను బిలిచి మీరిప్పుడు నేనను ఆత్మసాత్తునుయథా ప్రకారము మీకేసంబథములేక యసంగసంబంథమై విడిచి పెట్టి మీరున్ను మీతోజేరిన వారున్ను, పోయినజాగ తెలియక రాజీగాపోతున్నారా? లేనియెడమీవద్దనున్న నేనను ఆత్మార్థమును మీవద్దనుండి వేరుపరచిమిాపుత్రమిత్ర కళత్రాదులనుప్రాణముతో మాండవ్య మహార్షిని ఉకు్కసూదిన యెక్కించిన ప్రాకారముగా నాజ్ఞవిధించబడును, కాబట్టియీా రెంటిలో మీకేదిసమ్మతమని నడిగినందుకుప్రతి వాదులు కోరట్టువారినిజూచి మేమురాజీగాపోలేము, పరమార్థసాత్తును, మాప్రాణము దీశిమేముజచ్చినానివ్వజాలమనియు, ముందుకోరత నెక్కించి జచ్చినశమణులవలె జెప్పినవిని కోరట్టువాదుజూచి వీరుమిక్కిలియన్యా

యస్థులని యెరిగి బ్రహ్మేంద్రాదులైన క్రిందికోర్టువారు క ర్మోపాసన యోగములను లంచముగాయపేక్షించి వా దియొక్క న్యాయమగు వ్యాజ్యమును మోసముజేసి యు న్నారని దెలుసుకొని నిదిపరమార్థన్యాయతీర్పు కోర్టుదీని కిపై యపీల్ కోర్టు లేనందున సకలమైన వారికిన్ని దెలియు నట్టుల సర్వన్యాయములను గనిపట్టి సర్వసిద్ధాంత వేదాం తసమరససుభావరహస్యమైన తీర్పు జేయబడుతున్నది.

జడ్జిమెంటుఆరంభము.

అనంతకల్యాణ గుణగణసహితోన్నత, వేదాంత సి ద్ధాంతసమరస సన్మార్గసంపూర్ణ స్వతంత్ర చిన్మయస్వ భావ స్వవిచారపరమార్థన్యాయతీర్పుకోర్టు నందచల పర బ్రహ్మస్వరూపాపరోక్షసాక్షాత్కారసద్గురుప్రభుచక్రవర్తి యై వెలుగు జడ్జిగారి సముఖమున తాపత్రయదుఃఖమొం దిన జీవుడనునాదికిగాను, సత్వగుణ సహితోన్నతవివేకు డను వక్కీలుచేత, నేననునాత్మార్థము ప్రతికక్షివారలకు వ్యాసంగసమ్మతమై యుండజేయ వలయునని పిర్యాదివ్వబ డెను.

ప్రతివాదులైన అజ్ఞానియు వానిపుత్రులగు నిహలోక కాముకులందుప్రామరుడు, పరలోక కాముకులందుగర్మియు,

దేవతాంతర మూఢభక్తుడును, వీరునలుగురున్ను ఘోర మూఢబుద్ధియను వక్కీలుచేత ఆన్సరివ్వబడిప్రతివాదులసాక్షుల మొదటనుంచి కడవరకు, విచారణసేసినందుచే వారున్ను వారిదస్తావేజులున్ను వారిసాక్షులున్ను శుద్ధపొర్లింపులై యున్నవని తెల్లంబైనందుచేతను వాదితరపుసాక్షుల యోగ్యతయున్ను, వారిచ్చినవాక్కులాదులున్ను, శ్రుతియుక్తియనుభవములకు జేరినవై వారుజెప్పిన ఉపనిషత్ గీతా వాసిష్ఠాదులలోని ప్రమాణములచేతను, పూర్వాచార్యులైన శుకవామదేవ వసిష్ఠవాల్మీకాదిభగవత్స్వరూపులవరకు, మరిన్ని సన్నిష్ఠాశిష్టులగు బ్రహ్మనిష్ఠులైన పెద్దలయనుభవమునకు సంబంధించిన విశేషమునుగురించి తగినదృష్టాంతములకు జెప్పబడిన వాక్యకతలసమ్మంధమున్ను, వాక్చాతుర్యమరియాదలున్ను, యాత్మనుగురించి జెప్పిననిందాస్తుతులున్ను' యనాత్మనుగురించిజెప్పిన నిందాస్తుతులున్ను విన్నసంతోషముగాక హేయరింగునందు వాదివక్కీలువచించిన యొక్కొక్క యతిశయానందానుభవసత్యసంగతులున్నువినివాది పక్షముతీర్పు జెప్పబడెను.

౧- టిపైంటుఇష్యూకుసమాధానము.

ప్రస్తుతదావా సొత్తగునాత్మార్థము యెవరికిన్ని యేవిధమైనప్రత్యేకబాధ్యత లేకను సమత్వమైయసంగసంబంధమై

యున్నదా, లేక యేకదేశముగానుమరొకరి బాధ్యతకులో బడియున్నదాయను మొదటిపైంటు ఇష్యూకుసమాధాన మేమనగా.

నేనను ఆత్మ ఎరుకయనుజ్ఞానస్వరూపమైయుండుటచేత నున్ను, యతనికి యన్యమైన యజ్ఞానము మొదలుగా దేహా ది దృశ్యప్రపంచపర్యంతము గలిగిన సకలవస్తువులున్ను యనాత్మస్వరూపమై జడముగానుండుటచేత, నొకపురుషు నివల్లఘటపటాదులను విషయములనేల బడునేగాని, నాప దార్థములచేత నాపురుషుడేలబడలేడు. అటువలె, దోసరికా యను సక్కభుజింపనేరనియట్లు, స్వప్నమందుదోచబడిన సకలవిషయములను దానై యెరుగుటవల్ల నావిషయము లుతన్నెరుగ నేరదనియు, నెప్పుడున్నేనను యాత్మ యొకరివే లికకులోబడిన బాధ్యతలేకను, యెవరికిన్ని సంబంధపడక యుండుటచేత నితండుయసంగుడనితీర్మానించనాయెను,

౨– వ పైంటుఇష్యూకు సమాధానము.

పైవాది పిర్యాదు తెచ్చుటకర్హుడనుటకు సంశయ ములేదు. అదెట్లనిన, క్షత్రియ, వైశ్య, శూద్ర, చండాలా ది జనములు పౌరుషేయబ్రాహ్మణత్వమునుగురించి, వ్యా జ్యముచేయకూడనప్పటికిన్ని, అట్టిబ్రాహ్మణుడుబ్రాహ్మ

త్వమునుగురించివ్యాజ్యముచేయనహుఁడై యున్నట్లు, నేనను తెలివియైన జీవుడున్ను దేహాదిపంచకోశములను, నేనని జెప్పడమునకు, న్యాయము లేకపోయినను, వానివలెజడము గాక చిత్తైయుండుటచేతవాదియైనవాడుయీదావా తెచ్చుట కహుఁడై యున్నాడనికోర్టువారభిప్రాయపడియున్నారు.

---

### 3- వపైంటుఇష్యూకుసమాధానము.

---

ఈపిర్యాదుకాలనిర్ణయ చట్టమునకు భాధింపబడునా, లెదా? యనుమూడవపైంటు ఇష్యూకుసమాధానమగున దెట్లనగా, రాజాంగ చట్టమందు కాలనిర్ణయ మునుగురించి కొన్నివస్తువులకేజెప్పబడియుండుటవలనను, దైవసాత్తులకు కాలదోషములనుగల్పించియుండనందున, వాస్తవముగారుజువున యిచ్చినయట్టి సాత్తులకుమాత్రము, కాలనిర్ణయమేగాకబహుతరములుగాబాధ్యతగల సాత్తులనుదొంగలిడిన, అట్టిసాత్తు నుకనిపట్టిదావాతెచ్చి నపుడుదానికికాలదోషంబుగలుగనేరదు, దొంగలించినసాత్తునేనివ్వజాలనననిన దొంగకు ఆజ్ఞలు విధించిదండించిన్యాయాధిపతులుఅసాత్తులనే విధమునదీసియివ్వగలవోనాలాగునిచ్చు టనేననుప్రజ్ఞానస్వరూపమగుదైవీకసాత్తును, అజ్ఞానాదులెరుగకచోరీసేసినందుచేతనునీ ప్రతివాదులవద్ధనుండిప్పుడునేననుఆత్మసాత్తును

దీసియివ్వడమునకుకాల దోషమడ్డుపరచనేరదనికోర్టువారి అభిప్రాయము.

౪- వపాయింటుఇష్యూకుసమాధానము.

ఈకోర్టువారికి వివాదసొత్తు ప్రతివాదులవద్దనుండితీసివాదికివ్వవచ్చునా యివ్వగూడదాయను నాలవపాయింటిష్యూకు సమాధానమేమనగా, ఈకోర్టువారికినీసొత్తునుతీసివ్వడమునకు యధికారమున్నదిగాని మరియెవరికినాయధికారములేదు, అదెట్లనినగవర్నర్ కలెక్టర్ మొదలైనరివిని యూతరపువారికీ యొకరి స్వాధీనములోనుండు సొత్తులను మరొకరికి దీసియివ్వడమునకునధికారములేనట్టుగా కర్మాచరణులు,భక్తులు, యోగులు మొదలైనవారిచే నుపాసింపబడిన మాయాకల్పిత మగునీశ్వరాదులకు నేనను ఆత్మసొత్తునుదీసి యివ్వడమునకు అధికారము లేదనుటకు ప్రమాణమే మనినశ్రుతిస్మృతి పురాణేతి హాసములందు ప్రతిబాధ్యులైయున్న యనేకజీవులును, శివుడుమొదలగు దేవతలును, ఉత్కృష్టకర్మోపాసనములచేత సాన్నిధ్య మయ్యేలాగుజేసి వారిమాయకులోబడిన తమతమలోక పదవియు, అష్టమాసిద్ధులు మొదలగు భోగభాగ్యములనిచ్చి యున్నట్టుగా జెప్పబడిలేదుగాని, అజ్ఞానమున్ను దానికార్యములైన జగజీవాది

భేదములున్ను దానిచే గలిగినసంచిత కర్మాదులున్ను, దానివల్ల సంభవించిన జననమరణాది సంసారదుఃఖము లున్ను, కాలాతీతముగా లేక నే, యనాదిగా యనుస రించివచ్చియుండుటయు మార్చిదానికివ్యతిరిక్తమై వెలుం గు అపరోక్ష సాక్షాత్కారమైయుండు బ్రహ్మజ్ఞానముని వ్వలేదుగనుక, ఎవరైనను ఆబ్రహ్మజ్ఞానము నపేక్షించు వారు సద్గురుప్రభు చక్రవర్తిగారి చరణకమలంబుల పొంది వారిచేనుపదేశించుకొమ్మనియు, మరిన్ని ముఖ్యా ధికారులైన సనకాదిమునివరులు నీశ్వరుని బ్రహ్మజ్ఞానో పదేశము జేయుమనిప్రార్థించ ఆతండా ఈశ్వరరూపము మరుగుపరచి దక్షిణామూర్తమగు సద్గురుస్వరూపము దా ల్చినవారై యాముసులకు పదేశించినట్లు శ్రుత్యాదులలో జెప్పబడియున్నది గనుక, గవర్నర్ మొదలగు యుద్యో గస్థులకు సమానులైన హరిహర బ్రహ్మేంద్రాదులగు నీశ్వరాదులకు బ్రహ్మ స్వరూపమైన నాత్మార్థమును యెట్లుమార్చవచ్చు, గవర్నర్ మొదలైన యుద్యో గస్థులకొకరిస్వతంత్రసొత్తులను మరొకరికి తీసిచ్చుటకు నధికారములేనప్పటికిన్ని హైకోర్టువారికి సర్వాధికార మెట్లు గలిగియున్నవో యాలాగె సత్యజ్ఞానానందస్వరూ పులై వెలుగు సద్గురుప్రభు చక్రవర్తులవారగు జడ్జిగారికి మాత్రము నేనను నాత్మసొత్తును ప్రతివాదుల వద్దనుండి తీసి వాదికివ్వడమునకు నధికారమున్నదనిరి.

## ౫౮-వ- పాయింటు ఇష్యూకు సమాధానము.

ప్రతివాదుల క్రమముగా వ్యవహరించియున్న యెడల వారల దండించ న్యాయచట్టము యెడమిచ్చునా యివ్వదా? యనునైదవ పాయింటు ఇష్యూకు సమాధానమేమనగా, సంసారబంధమునకు గారణముగానుండు యజ్ఞానమైనచీకటికిజ్ఞానమైనది ప్రచండమార్తాండుడని శ్రుతులు జెప్పియుండడముచేతను, సద్గురుని చేగలిగినజ్ఞాన, సూర్యుడు, చీకటికిసమానులైన అజ్ఞానాది విపక్షులను దండించడమునకు చట్టవిరోధము లేదని నెన్నబడినది. ఇత్యాది విషయములను దీర్ఘాలోచనకుదెచ్చి వ్రాయబడు తీర్పు యేమనగా.

## న్యాయతీర్పగు జడ్జిమెంటు.

శా॥ పూర్ణుండై జగమంత నాత్మమయమైపోల్పార నిత్యాత్మయై,వర్ణావర్ణము లెంచిచూడ విలసద్వర్ణాత్ముడై విశ్వసం, కీర్ణానందుడునై యఖండమయుడై కీర్త్యాత్ముడై వెఘసం, పూర్ణుండానుగ గన్న సద్గురుపదస్ఫూర్తిణ విలోకించుమా॥

అనుగురుగీతాసారము రీతిగా, ఇట్టి ప్రజ్ఞాన ఘనగుణగణ శీలుండగు శ్రీసద్గురుమూర్తి ప్రభుచక్రవర్తి న్యాయస్థానసింహాసనం బలంకరించి యుభయ కక్షులవారి

వాదంబుల సావధానహృదయుండై యాలకించి యిాక్రిం దుదహరింపబడు క్రమంబున న్యాయతీర్పొసంగ నుద్యుక్తులగుచున్నారు.

సకలజంతుజాలంబుల అవస్థాత్రయంబులందు, అహమహమని మాటిమాటికి స్ఫురింపుచుండునది ఆత్మయేయనియెల్లవేదోపనిషద్వాక్యంబులుద్ఘోషింపుచుండ దద్వ్యతిరిక్తంబుగగానంబడు నామరూప జగత్తు లసత్తనుటకు, సత్తనియు, జడమనుటకు, చిత్తనియు. అనిత్యమనుటకు, నిత్యమనియు, దుఃఖమనుటకానందమనియు, ఖండమనుట కఖండమనియు. అనేకములనుట కేకమనియు. శుద్ధబద్ధవ్యవహారమనుటకు, పరమార్థమనియు, అవస్థాత్రయమనుటకు, తురీయమనియు, నీవిధంబున జెప్పంబడిన గుణములు. వ్యావహారికదశలోనివి. దేహాదిప్రపంచంబు లజ్ఞానదశయందు చనకన్యంబునై,సుఖప్రదంబును, సత్యంబునుగా గానంబడుచున్నది. ఇట్టిదియే విజ్ఞానదశయందు"సర్వంఖల్విదంబ్రహ్మ,,"విశ్వమేవేదంపురుషం,," సర్వంవిష్ణుమయంజగత్,," వాసుదేవస్సర్వమితి,, సదసత్తహామజానా" అనుశ్రుతిపురాణవాక్యంబులమేరకు అనృతజడదుఃఖంబగు నామరూపదృశ్య ప్రపంచంబు తనకన్యంబై దృగ్దృశ్య వ్యవహారంబుగలదై దేహాదిప్రపంచంబుగా బరిణమించిన మాత్రంబున వస్తుతత్వ పరిశీలనాకాల

మపుడదియే మిథ్యయనంబడుచున్నది, మిథ్యయనగా,వంధ్యాపుత్ర, రజ్జుసర్ప,ఎండమావులు, స్వప్నప్రపంచము మొదలగు దృష్టాంతంబులు అరువదినాలుగువిధములుగా జెప్పినట్టి శ్రుతివచనములలో పైనజెప్పబడు, గొడ్రాలికిబిడ్డ కాలత్రయమందునలేనేలేదు. అట్లునీజగత్తు బొత్తిగాలేకపోవునదికాదు. చక్షురాదీంద్రియములకు నెండమావులవలె గోచరించుచున్నవి. అట్లుగోచరించుచున్నదేహాదిప్రపంచంబుసత్యంబుకానేరదు.,, దృశ్యంనశ్యతి',యని శ్రుతిపలుకుటచేత గొట్టవడిపోయెను, గనుకదృగ్స్వరూపమగు పరమార్థమేసత్యంబనబడెను.

రజ్జుసర్పదృష్టాంతము చేతనీజగత్సత్యంబన దగునా? అనినత్రాటిని వినాహాసర్పము త్రికాలమందును లేనేలేదు. అట్లునీదృశ్యమాన ప్రపంచము మాటమాత్రముగా తోంచినదై విచారాంతమున మిథ్యయగుచున్నది. బ్రహ్మాకారమే శేషించినిలువనాయెను.

యెండమావులు దృష్టాంతముచేతనే జగత్తు సత్యంబగునా? యనినఎండమావులు చూపునకొకవస్తువుగాదోంచియు, ఎవరికిన్ని ప్రయోజనమునకురాకపోతున్నవి. ఆరీతిగాప్రపంచముప్రయోజనమునకువచ్చినట్లుతోంచి కడకన్యథాబరిణ మించుచున్నది ఇట్లుపరిణమించునది పరమార్థమగుసత్తనబడును.

స్వప్నప్రపంచ దృష్టాంతమునసీజగత్తుసత్యంబగుననిన స్వప్నప్రపంచము, మాటలున్ను, దేశకాలవస్తువులున్ను, అనుభవముగా జూచియుండియు స్వప్నముమారిజాగ్రత కువచ్చినతోడ అవియన్నియు అబద్ధమగునటుల, నీప్రపంచమున్ను, ప్రపంచవ్యవహారాదిలక్షణములున్ను, జాగ్రతలోని జాగ్రతయగుతన నిజస్వరూపము నెరుగునంతటనే నీనామరూపదృశ్య ప్రపంచంబసత్యంబై తనకన్యంబేదియులేకతామాత్రమై శేషించియుండునదే పరమార్థమని జెప్పంబడును.

ఈనాలుగు దృష్టాంతముల చేతనీజగత్తునామరూపంబులుగానుండునట్లు గానంబడి విమర్శనామాత్రంబుననాత్మేతరజగద్రూపవస్తువుగా, గానంబడక మిథ్యయై,మఱి యుండునది స్వప్నప్రపంచమురీతిగా సర్వమునశించితామాత్రముసత్తామాత్రంబుగా శేషించుచున్నది. 'సదేవసోమ్యా ఇదమగ్రమాసీత్' అనునట్లు ఆదినిసత్తేయుండియున్నట్లు శ్రుతియుక్తియనుభవములవలన నిశ్చయింప బడుటచే అర్థవాదము, ఉపాసనాపరవాదము, స్తుతిపరవాదము, ఉపచారవాదము, గుణసాదృశ్యవాదము,జాతివ్యక్తివాదము,కారణకార్యవాదము, గుణగుణివాదము, వికారవాదము, హంసాంసికవాదము, బింబప్రతిబింబవాదములచే వ్యభిచారత్వమునొందకవివర్తవాదము చేతనీజగత్తు

సత్తామాత్రముగానుంటున్నది. యెట్లనగా “ చిద్వివ_ర్తజగతోస్యకారణం” అను శ్రుతిరీతిగా, వివ_ర్తవాదరూపము బ్రహ్మంబునందు నీజగత్తువ_ర్తించు. ననగానిదిఆరంభము, పరిణామము,వివ_ర్తమనియు త్రివిధంబై యున్నది. అందారంభమువిచారించిన.

1- ఆరంభవాదంబనగా, ఉపాదానకారణమైననూలు వస్త్రమగుటచే, నూలుయొక్క స్వరూపమందు, వ్యత్యాసము లేక, పూర్వస్వరూపములోనేయుండుచు వస్త్రముగానే యుంటున్నది, కాననిది ఆరంభవాదంబనబడును.

2- పరిణామవాదమనగా, పెరుగునకు కారణముపాలు ఆకారణమైన క్షీరంబు తనస్వరూపంబుమారి పెరుగైనది కానయిదిపరిణామవాదంబనబడును.

3- వివ_ర్తవాదమనగా' రజ్జువందు సర్పంబనుతోపి కగలిగినది, అయితెవా_స్తవమందు రజ్జుసర్పంబుగాలేదు. రజ్జువందు సర్పంబు నుండలేదు. లేకనేపుట్టిన తోపిక తప్పుగానుండినను, భ్రమయుండుపర్యంతంబు వాస్థవముగాపామని యేనమ్మబడుచున్నది. ఇట్లుపుట్టినభ్రమకుఆధారముత్రాడేను కాననిదివివ_ర్తవాదమనంబడును.

బ్రహ్మంబు జగత్తునకు వివర్తోపాదానమేను, ఆరంపాదానమాయనేని ఘటంబునకు, మృత్తుకులాల, దండ్రకాదులను కారణాంతరంబులున్నట్లు, కారణరహిత

ఏకోబ్రహ్మంబునకు గారణంబుగావలసియుండును. అది అసంగతమును శ్రుతివిరుద్ధమగుటచే ఆరంభవాదంబ నంగీకారంబు.

జగత్తునకు బ్రహ్మంబు పరిణామోపాదానమాయనేని పాలుపెరుగైనట్లు స్వస్వరూపముమారి రూపాంతరము జెందవలసియుండును. ఇచ్చటబ్రహ్మంబు నిర్వికారియగుటచేవేరురూపంబునొందుటయెన్నడులేదు. కానబ్రహ్మంబునకు పరిణామవాదంబుబొసగనేరదు.

పైరెండు వాదంబులు బ్రహ్మనిశ్చయమున కనానుకూల్యంబులగుటచే వివర్తవాదంబొకటియే జక్కగబొసగునదైయుండు.

వివర్తవాదంబుపైని నుదహరించియుండునట్లు త్రాటియందుభ్రమవలన సర్పంబు దోచినట్లు, పరిశుద్ధబ్రహ్మమందు జూచువాని యజ్ఞానతిమిర భ్రాంతి బలీయముచే జగదాకారముగా దోచబడుతున్నదిగాని, వాస్తవములో నుండునది నిర్వికార, నిస్సంగ, నిర్ద్వంద, ఏకోబ్రహ్మంబేను. ఇదియే వివర్తవాదమనబడుతున్నది. కానఏదైనను (అహం) నేననుఆత్మవస్తు విశేషమున కన్యంబుగాక స్వస్వరూపమగుటచే నందుకన్యంబుగా భావించుట లశాస్త్రీయము. మఱియుయనుభవ విరోధము గనుక పారమార్థికోక్తులిటులగు. తానగుఆత్మకన్యంబుగా నొకబదార్థంబు

లేదను శ్రుత్యాదులు "నద్వితీయమస్తి,, ఆత్మకు రెండవది లేదు." నాస్తిద్వైతం,, ద్వైతము లేదు. "కుతోవిదితే వేద్యంనాస్తి,, బ్రహ్మస్వరూపము దెలియబడుచుండగా దేనినుండియు దెలుసుకొనదగినదిలేదు. "ఏకమేవాద్వితీయం,, రెండవదిలేనివస్తువొకటే. "ఏకమేవ సన్నేహనానాస్తికించన" ఒకటియేయున్నది కొంచమైనను అనేకమగుటలేదు, "ఏకధైవానుద్రష్టవ్యం" ఒకవిధముగానే చూడదగినది యగును. "వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత్యం" మృత్తువలనబుట్టినఘటశరావాదులున్ను, స్వర్ణంబువలన బుట్టినకటకమకుటాదులున్ను, అయస్సు వలన బుట్టినఖడ్గాదులున్ను, కారణంబుకంటే భిన్నంబుగాదోచినప్పటికిన్ని యీకార్యాదులకు ఉచ్చారణంబువినాగా అర్థంబులేదుగనుక కారణవ్యతిరిక్తంబుగాను కార్యంబు లేదనబడును.యీ జగత్తును బ్రత్యగాత్మకంటేఅభిన్నత్వంబు బ్రతిపాదింపుచునుండి బ్రత్యగాత్మకు అద్వితీయంబును సూచింపుచున్నది. మరియు, శ్లో॥ పురుషః పరమాత్మాతు యదతోన్యదసచ్చతత్ । ఏవంబుధ్వా జగద్రూపంవిష్ణోర్మాయామయంమృషా,, అనుబ్రహ్మపురాణమురీతిగా, పూర్ణమనబడు పురుషుడేపరమాత్మా, దానికన్యంబనబడునంతయు లేనిది, యీప్రకారము తెలిసికొనగా విష్ణుమాయా రూప

మగు జగత్తంతయు మిథ్యయగుచున్నది. ॥శ్లో॥ విజ్ఞానపర మార్థోసౌద్వైతినోతథ్యదర్శినః। నిదాఘోపదేశేనతేనా ద్వైతపరోభవత్ సర్వభేదాన్యభేదేన సదదర్శతదాత్మ నః। తదాబ్రహ్మతతోముక్తి మవాపపరమాద్విజ॥ అనె డు శ్రీవిష్ణుపురాణమురీతిగా యీఆత్మయదార్థ తత్వమును జూచునట్టి అద్వైతికి విజ్ఞానముచేత సత్యస్వరూపముగా నున్నది. ఓయివిద్వాంసుడా, ఈసమస్తజగత్తునీప్రకారము భేదరహితమగు ఏకవస్తువుగానున్నది. నిదాఘుండను మ హార్షికివాసుదేవుండను పేరుగల పరమాత్మయొక్కస్వరూ పమును, ఉపదేశించుటచే, అద్వైతముందా సక్తిగలవా డాయెను, ఆనిధాఘుడు సమస్తభేదములును,దనకభేదము గాజూచెను. అందుచేనప్పుడు బ్రహ్మస్వరూపియాయెను. అందువలన శ్రేష్టమైన ముక్తిని బొందెననియు॥శ్లో॥ఏకస్స మస్తంయదిహాస్తికించిత్తదచ్యుతో నాస్తిపరంతతోన్య త్। సోహంసచత్వంసచసర్వ మేతదాత్మస్వరూపంత్యజభే దమోహం॥ అనెడివిష్ణుపురాణరీతిగా ఇచ్చటగనుబడునది యంతయు నేకస్వరూపుడగు భగవంతుడే అతనికంటెవే రైనదియును,శ్రేష్టమైనదియును లేదు. ఆభగవంతుడు నేనే నుయాభగవంతుడేనీవును ఆభగవంతుడేయీసమస్తముగ నుకభేదముండునటుల మోహాపెట్టెడి(అన్యే తరంబునువిడిచి పెట్టుము.॥శ్లో॥అర్థస్వరూపనజ్ఞానాఃపశ్యంత్యేకుదృష్టయః।

కూటస్థోనిర్గుణోవ్యాపి చైతన్యాత్మస్వభావతః॥ అనుపరాశ రస్మృతిరీతిగాకుత్సితరూపుగలఅన్యులగుఅజ్ఞానులుప్రపంచము నొకపదార్థముగాజూచుచున్నారు. అయితేయది, కూటస్థస్వరూపుడగు ఆత్మయు, స్వభావముగా నిర్గుణుడును, సర్వవ్యాపియును, చైతన్యస్వరూపు డుగానున్నాడు.॥శ్లో॥ఆకాశో వైనామరూపయోర్నిర్వహితా తేయద న్తరాత ద్బ్రహ్మ సర్వాను భూరిత్యేతదను శాసనమితి॥ అనిగ్రంథాంతరమేరకు ఆకసమే నామరూపములను వహింపనిది, ఆనామరూపములు ఏదిఅంతరముగాగలవో అదే బ్రహ్మంబుఆ బ్రహ్మంబు ముందు లేనిది, వెనుక లేనిది.లోపల లేనిది, వెలుపల లేనిది. ఇదియాత్మస్వరూపము. ఈయాత్మ యే నేనను బ్రహ్మస్వరూపము. ఈబ్రహ్మంబందరకును అహర్నిశం అహంబను, అనుభవరూపమైనది.యనియును, ॥శ్లో॥యత్రాత్మవ్యతిరేకేనద్వితీయం యోనుపశ్యతి, బ్రహ్మభూతః సఏవేగవేదశాస్త్రవు దాహృదః,, అనుగ్రంథాంతరరీతిగా ఇచ్చట తానగు ఆత్మకంటే వేరుగా రెండవవస్తువును ఎవడుచూడడో వాడిప్పుడే (ఈజన్మమందే) పరబ్రహ్మస్వరూపుండగుచున్నా డని వేద శాస్త్రములందు జెప్పబడియున్నది, గనుక ఇట్లు సత్తామాత్రంబైన తానను అహంపదార్థంబు కంటేనన్యంబేదియువస్తుతా యుండబోదని శ్రుత్యుక్త్యనుభవములు స్థిరంబుగానుండుటచేత,,, నసాఖ్యంన శైవంన తత్పాంచరాత్రం, నజైనం

సమీమాంస కాతేర్మతంవా, విశిష్టాను భూత్యావిశుద్ధా త్మకత్వాత్, తదేకోవశిష్టఃశివః కేవలోహం,, అనునట్లుజగ త్కారణమైనది, సాంఖ్యశైవపాంచరాత్రజైన్యమీమాం సమతసిద్ధాంత ములుగాదుగను కనేనద్వితీయుడై సర్వ ద్వైతములకుపాదములుండిసను. నేపాదము లేనివాడనై, నిర్ధర్మకుడై, పరమానందబోధస్వరూపుడై యున్నానునుగ క ॥శ్లో॥నయోగేననసాంఖ్యేనకర్మణానోనవిద్యయా,బ్రహ్మా త్మైకత్వబోధేన మోక్షస్సిధ్యతినాన్యథా,, = బ్రహ్మాత్మైక త్వజ్ఞానంబుచేముక్తిగలదనియుయితరంబులగుసాంఖ్యయో గాది శాస్త్రవిచారంబువలన ముక్తి లేదనియు-శ్రీ శంకర భగవత్పాదా చార్యులున్ను జెప్పియుండుటవల్లను, ప్రతి వాదులగు అజ్ఞాని,పామరుడు, కర్మభక్తులనుప్రతికక్షివార లాడెడుదుర్వ్యాజ్యమునురద్దుపరచి, అఖండపరిపూర్ణస త్యజ్ఞానానంతానంద పరబ్రహ్మస్వరూపమగు (అహంపదా ర్థమును) ఆత్మను ముముక్షువగువాడి, తనఇష్టప్రకారము తానసంగుడై, నిరాక్షేపణాగా నిరంతరము, ఆద్యంతరహి త పరంపరగాతానున్నతనతోపాటియెల్ల మానవులున్ను, అనుభవించేలాగు తీర్పుజేయబడెను. ఇకను నేనను వస్తు వును, కర్తృత్వాదివ్యవహార కల్పనలుజేర్చి ఎవరైనను, బేరాసతోడ యనుభవించ నుద్యుక్తులగువారలు, అజ్ఞా నతిమిరసంసారదుఃఖపంకకూపమగ్నులగుచు జననమరణం

బులనొందుచుండునటుల దీర్మానించినాముగనుక, మఱొ కకాలమందు యీవిరోధులగు షడూర్ములు, లేక నేగ ల్గిముందువలె ఘోరసంసారదుఃఖంబులు గలుగజేయు కుండునటుల సువిచారాంతమందు ప్రజ్వలించు జ్ఞానాగ్ని చేత వారినిగాల్చి భస్మంబుగావించి స్వరూపనాశంబు చే యుటకై అందరికి నిదెల్లంబుగాదెలియునటుల వ్యక్తీపరింప నాయెను.

కాబట్టియీపారమార్థికన్యాయతీర్పు యాద్యంత ము గురుముఖమైపరమసాధుశిరోమణులగు గురుకులవా సంబుజేసి, పూర్వాపరవిరోధములేక, చక్కగావిమర్శిం చి నెవరైనను భక్తిశ్రద్ధలుగలిగిజూచువిధంబున జూచిన వారికి, పారమార్థికసత్తగునేనను ఆత్మను కర్తృత్వాది మొదలగు యేవిషయములనుజేరక, నేనే, శరీరత్రయ విల క్షుణుడు,అవస్థాత్రయసాక్షిని,పంచకోశవ్యతిరిక్తుడు,సచ్చి దానందస్వయంప్రకాశ బ్రహ్మంబనియు. దనకుదోచబడిన దేహాదిసకలప్రపంచంబులున్ను, అసత్యంబనియు. ॥శ్రు॥ మాయాకార్యాదికంనాస్తి మాయానాస్తి భయంనహి, ఇదంప్రపంచం నాస్త్యేవ నోత్పన్నంనోస్థితం క్వచిత్,,అ నుతేజోబిందోపనిషత్తురీతిగానున్ను, ,,నత్వంనా హంనచా న్యం సర్వంబ్రహ్మైవకేవలం।నదేహోనచకర్మాణి సర్వంబ్ర హ్మైవకేవలం,, అనియు- ,,సర్వంఖల్విదంబ్రహ్మ,,” ఏక

మేవాద్వితీయంబ్రహ్మ,,", తత్వమసి,," నేహనానాస్తికించ
న,, అనుశ్రుత్యాదివచనములరీతిగా మాయయుమిథ్యయే
మాయాకార్యములగు నీజగజీవాదులైనసర్వములసత్యమ
నియు. కాలత్రయములయందు వస్త్వంతరములేనేలేదని
యు, నీవు, నేను. వాడు,వీడు, అదియిది, తదేతరములువ
స్తుతాలేనేలేదు. యుండునటులదోచు సర్వమునుతానగు
యాత్మయే యగుమహావాక్యార్థములచే వెలిగెడు యాకే
వలపరబ్రహ్మము నేనేయనెడి నిశ్చయానుభవము చేదే
జరిల్లు నిర్వికల్పసహజామనస్కశివరాజయోగ సమాధిజెం
దిన, శుకబ్రహ్మఋషిమేరకు సద్యోజాతముక్తినిదే శరీర
ముతో నిప్పుడే జీవన్ముక్తుడై, పిదపవిదేహముక్తినిజెందు
దురనియు, తక్కినవారు వామదేవర్షి యనుసరించిన పిపీలి
కామార్గమునసంకల్ప వికల్పములననేకజన్మముల నెత్తి
క్రమముక్తినిజెందుదురనియు, శ్రీసద్గురుచక్రవర్తిగారగుఉ
త్తమన్యాయాధిపతులు పరమార్థ నిర్దేశమనున్యాయతీ
ర్పు, ముముక్షుజనపక్షమున కరుణారసహృదయులైదయ
సేయువారలైరి.

పైగ్రంధమునకు నుపయుక్తముగ ,వాది వకీల్ జేసిన
హియరింగి వచనములకున్ను, శ్రీసద్గురు చక్రవర్తులొసం
గిననీపరమార్థనిర్దేశమను, న్యాయతీర్పునకున్ను, పూర్వా
చార్యుల ప్రస్థానత్రయ భాష్యములనుసరించిన తాత్పర్య
సహితం కొన్నివిషయములకు వ్రాయబడు,

•

# ప్రమాణములు.

## సద్గురునాథుని కన్యంబు దేవుడు లేడనుట.

శ్రుతి॥ గురుర్బ్రహ్మా గురుర్విష్ణు ర్గేగురువ స్సదాచ్యుతః। నగురోరధికః కశ్చిత్త్రిషులోకేషువిద్యతే॥ అనెడియోగ శిఖోపనిషత్తు, రీతిగా, బ్రహ్మవిష్ణురుద్రేంద్రాది సకలదేవతలును దానై వెలుగు సద్గురు నకధికము త్రిలోకమున లేదనియు. మరిన్ని, శ్రుతి॥ గురుసాక్షాదాది నారాయణః పురుషః॥ మహానారాయణోపనిషత్తు॥ పురుషోత్తముడైన, ఆదినారాయణుడే సద్గురు నాథుడనియు, మరిన్ని, శ్రుతి॥ సర్వశరీర స్థచైతన్య బ్రహ్మప్రాపకోగురు రుపాస్యః॥అనియు నిరాలంబోపని షత్తురీతిగా, పిపీలికాది బ్రహ్మపర్యంతము గల సర్వజీవుల హృదయగుహాలో పలనివాసమై వెలిగెడు బ్రహ్మచైతన్యమే సద్గురునాథుడనియు, సద్గురూపాసనము ముఖ్యంబనియు, మరియు" శుకరహస్యోపనిషత్తు॥ శ్రుతి॥నిత్యానందం పరమ సుఖదం కేవలం జ్ఞానమూర్తిం, విశ్వాతీతం గగనసదృశంతత్వమస్యాదిలక్ష్యం, ఏకంనిత్యం విమలమచలం సర్వధీసాక్షిభూతం, భావాతీతం త్రిగుణరహితం సద్గురుంతన్నమామి॥ అనిమరియు" శ్లోకం,, గురుశ్శివో గురుర్దేవోగురుర్బంధుఃశరీరిణాం, గురురాత్మా గురుర్జీవోగురోరన్యంనవిద్యతే॥" నగురోరధికం, నగురోరధికం, నగురో

గ్రోరధికం, నగురోరధికః, శ్శివశాసనత శ్శివశాసనతశ్శివ శాసనత శ్శివశాసనతః॥ ఇదమేవశివం ఇదమేవశివం ఇద మేవశివం ఇదమేవశివం, మమశాసనతో మమశాసనతో మమశాసనతోమమశాసనతః॥ విదితం విదితం విదితం విది తం, విజనం విజనం విజనం విజనం, హరిశాసనతోహరిశాస నతోహరిశాసనతో హరిశాసనతః॥ యనిగురు గీతా మొద లగు శ్రుతిస్మృతులచేత సద్గురుడే ఈశ్వరాది బ్రహ్మావిష్ణు రుద్రేంద్రసకలదేవతలనియు, గురుడే తత్వమ స్యాదిమ హావాక్యార్థ లక్ష్యమనియు, గురుడే ఆత్మయనియు,గురుడే జీవుడనియు, గురుడెబంధువనియు, గురుడేపిపీలికాదిబ్రహ్మప ర్యంతమైన జీవుల హృదయసాక్షియనియు, గురునికంటెకిం చిత్తైననన్యము లేదనియు, గురునికంటెను శ్రేష్టమేదియు లేదనియు, గురుస్వరూపము కేవలజ్ఞాన స్వరూపమై తేజరిల్లు సర్వసాక్షిగావున, జననమరణాదులు లేనిదై, నిత్యనిర్మ లమై, నిర్వికార స్వయంప్రకాశమై, వెలుగుటచేత యుత ని కధికమేమియులేదని హరిహరాదులు ప్రమాణముసేసి నారనియు. మరియును, “క౦॥ సద్గురుకృపజ్ఞానంబున, సద్గ తిదీపింపుచున్న చాలాచమువుల్, సద్గతి గలుగగ జేయు ను, సద్గురువే దైవమనుచు జాటరవేమా॥ “గురుడనగా బరమాత్ముడు, పరగంగా శిష్యుడనగ బఱుజవుడగుఁ, గురుశిష్య జీవసంపద,గురుతరముగ గూర్చునతడు, గురు

వగు వేమా॥ "నగురోరధికః కశ్చి త్త్రిషులోకేషువిద్య తే, దివ్యజ్ఞానోపదేష్టారం దేశికం పరమేశ్వరమ్, పూజయేత్ప రయాభక్త్యాతస్యజ్ఞాన ఫలంభవేత్, యథాగురు స్తథై వే శోయథై వేశ స్తథాగురుః॥ అనుయోగశిఖోపనిషత్తువలను గలుగు శ్రుతిస్మృతి పద్యప్రమాణములచేత శ్రీసద్గురు ప్రభు చక్రవర్తియే, సర్వోత్కృష్టుడనియు స్థాపించనాయెను.

## శ్రీసద్గురుం డేలాగధికుండనుట.

శ్రీపరవస్తు వనంబడు పరమాత్మ సకలచరాచర రూపంబై చిద్రూపంబై వెలుగుచుండియు నది. శ్రుతి॥ యతోవాచా నివర్తంతే అప్రాప్య మనసాసహః" అని మనోవాక్కులు ఆత్మస్వరూపమును దెలియ వెదుకుచుబోయి దాని దెలియవల్లబడక మరలి వచ్చినదగుటచేయని, తైత్తిరీయోపనిషత్తున్ను. "అచిన్త్యమవ్యక్త మనంతరూపం శివంప్రశాంతమమృతం బ్రహ్మయోనిం, తదాది మధ్యాంత విహీనమేకం విభుంచిదానంద మరూపమద్భుతం॥ అని కైవల్యోపనిషత్తునందును. "నవద్వారేపురే దేహీహంసోవేలాయతే బహిః, వశీసర్వస్య లోకస్య స్థావరస్య చరస్య చ,, యని శ్వేతాశ్వతరోపనిషత్తున్ను, "మనోవాచా మగోచరం బ్రహ్మ, అఖిల ప్రమాణా గోచరంబ్రహ్మ, అమితవేదాన్త వేద్యంబ్రహ్మ, దేశతఃకాలతో వస్తుతః పరిచ్ఛేద రహితంబ్రహ్మ, సర్వపరిపూర్ణంబ్రహ్మ, తురీయంనిరాకారమేకం

బ్రహ్మ, అద్వైతమనిర్వాచ్యంబ్రహ్మ, ప్రణవాత్మకంబ్రహ్మ, ప్రణవాత్మకత్వే నోక్తంబ్రహ్మ॥ అని మహానారాయణోపనిషత్। ఇంతియగాక, ‘‘శివంనజానామి కథంవదామి, శివంనజానామి కథంభజామి, అహంశివశ్చే త్పరమార్థతత్వం, సమస్వరూపం గగనోపమంచ॥ అనంతరూపం నహివస్తుకించి, త్తత్వస్వరూపంనహివస్తుకించిత్, ఆత్మైకరూపం పరమార్థతత్వ, నహింసకోవాపినచాప్యహింస॥ శ్వేతాదివర్ణరహితం శబ్దాది గుణవర్జితం, కథంయంతికథంతత్వమనోవా చామగోచరం’’ ‘‘ఇతరేణ సహజాత్మాపిహ్యభిన్న ప్రతిభాతిమే, వ్యోమాకారంతథైవైకం, ధ్యాతాధ్యానం కథంభవేత్’’ ‘‘నషండోన పుమాన్ నస్త్రీన భోధోనైవ కల్పనా. సానందోవా నిరానందమాత్మానం మన్యసేకథం’’ అను అవధూతగీతా॥ పైఉపనిషదాది గ్రంధార్థములమేరకుపకోబ్రహ్మంబగు పరమాత్మ స్వరూపంబు నిట్టిదనియున్నదున్నట్లు తెలియుటకును, వచించుటకును, పూజించుటకును, వల్లబడకయుండియు, నావస్తువిశేషంబువిశ్వాకారంబై, చరాచర వస్తువులుదానైయుండుటయేగాక, అదిజగత్తులోని స్థావరజంగమ పదార్థయుపాధి భేదంబులంబట్టిప్రకాశమానంబగుచుండునది. అదెటులనగా, పాషాణాదులందు ఇంద్రియగోచరంబే మాత్రంబుగాకనే, అతిగుప్తంబై యుండు. ఓషధులు, లత, తరువృక్షాదులందు వృద్ధిక్షయరూపంబున

శిలాద్యులకంటె కొంచము భాసమానమగుచుండు. యీ తరు వృక్షాదులకంటెను క్రిమికీటకాదులందు, చలనాహారాదులచే మరింత భాసమగుచున్నది. ఈయల్పజంతువులకంటెను, మృగపక్ష్యాదులందు ఆహార నిద్రభయ మైథునాధులచే నాత్మ ప్రకాశంబు కాస్త యధికంబుగా గానంబడుచున్నది. ఈమృగపక్షులకంటెను. మనుష్యసామాన్యులందు కుత్రయుక్తులు స్వకార్య ధురంధరత్వము, ఈర్ష్యడంబాదులచే నాత్మ మరికాస్త అతిశయించి గానంబడుచున్నది. ఈసామాన్యములకంటెను, వస్తుతాత్మేని, ఆవాంతరకల్పనా దేవతాంతర ధ్యానపూజలుగల్గి దానధర్మ పరోపకారములుగల్గి భూతదయ పశ్చాత్తాపములతోడ యధోచిత చిత్తశుద్ధిగల్గి వెలయువారలెడల నాత్మనింకను గొంతయధికముగా బ్రజ్వరిల్లుచుండును. పైయవాంతర దేవతాంతర భక్తియుక్తులకంటెను, హఠరాజ యోగాదులచే బ్రాణాయామ ప్రత్యాహార, ధ్యాన, ధారణా, సమాధులచే బ్రాణమనోజయముగల్గి వెలయుచుండు యోగీశ్వరులందు పరమాత్మమిక్కిలి జక్క ప్రజ్వరిలుచుండునది - మరియు, నీయోగీజనమహనీయ వందనీయులకంటె, ననవరతాఖండప్రజ్ఞానఘన అసదృశ చచ్చిదాద్వితీయ స్వయంప్రకాశస్వరూపులై వెలయు ఆత్మారాములై యవాఙ్మనసగమ్యపరవస్తువిశేషులై వెలయుచుండురు. అట్టివారలు శిష్యులబుద్ధియందు

వికల్పించునట్టిజీవేశ్వరభేదము, జీవులపరస్పరభేదము, జీవజడభేదము, ఈశ్వరజడభేదము, జడజడభేదమను ఐదువిధభేదములున్న, నానావిధయుక్తులచేతనివర్తించిఆత్మజ్ఞానము. స్థిరపరుచువారె సద్గురువులనందగు, వారష్టవిధతారతమ్యముగలవార లగుదురదియెట్లనిన, „ గీ॥ సూచకనిషిద్ధబోధకవాచకులును, గణగికామ్యకర్మసమయ కారణులును, ననగనెనమండ్రు దేశికులందులోన, సద్గురుండగుకారణాచార్యవరడు. „ గీ॥ అట్టికారణగురురాయుడైనవాడు, రామభగవానులెకానిసీమలోన, నితరజనులు తమ్మెరుగంగనెంతవారు నరుడుగురుడని పల్కుటన్యాయమధిప. „ అనెడు శ్రీరామస్తవ రాజమురీతిగా, సాధకులైనశిష్యులకు పదేశించునధికారభేదములబట్టి, గురువులు, బోధగురుడు, వేదగురుడు, కామ్యకర్మగురుడు, సూచకగురుడు, వాచకగురుడు, కారకగురుడు, విహితగురుండనియు యెనమండ్రుగలరువారిలో - 1- శాస్త్రములలోని అర్థములనెత్తి, తెల్లంబుగ దెలియునటుల బోధించువాడుబోధకుడనియు, 2 - పృథివ్యాదితత్వముల నిషేధించిపరతత్వమును దెలిపించువాడు, వేదకగురుండనియు, 3- స్థంబనాదిఅష్టకర్మములచేతనిహలోకసుఖమును, పరలోకదుఃఖమును కలుగజేయువాడు విహితగురుడనియు. 4- సత్కృత్యములబోధించిపరలోక సుఖముల బొందునటుల చేయువాడు

కామ్యకర్మగురుడనియు. 5-వివేకసంబంధశుభశమదమా
ది గుణములు గలుగజేయునతడు సూచకగురుడనియు.6-
నామరూపదేహేంద్రియప్రపంచవిషయములనుమిథ్యాస్వ
రూపముగాచూపించి ఆత్మయందు ప్రియముగలుగజేయు
నతండు వాచకగురుండనియు. 7- జీవబ్రహ్మైక్యజ్ఞానంబు
ను బోధించువాడుకారకగురుడనియు, 8- జీవబ్రహ్మైక్య
జ్ఞానమందుగలిగెడు సంశయాదులనివర్తించిసర్వదుఃఖాభా
వమున్ను, నిత్యతృప్తియు,పరమానందప్రాప్తియు,కృతకృ
త్యత్వము,ప్రాప్యప్రాపకత్వము,కైవల్యముక్తియునుగలుగ
యుపదేశించువారు,విహితగురుడనంబడు కారణాచార్యుడ
నియు పెద్దలచేనుడువబడెను.అధికారులభేదముల కేబరమా
చార్యుడొక్కడే పలుపేర్లువహించడముకద్దు. పరమజ్ఞాని
యగుసూతపౌరాణికులు తన్నాశ్రయించు శిష్యులకుబోధిం
చియుండడము పురాణములచే నెరుగవచ్చునట్టి పురుషో
త్తములకన్యంబుగా దైవంబొక్కండు గద్దెమీదెక్కి తిరుగు
వాడును, యెద్దుమీదెక్కి విహరించువాడును, కైలాస,
వైకుంఠాది ఖండప్రదేశంబులందుండు వారలున్నారని
పురాణకథలనమ్మి, వెదుకనారంభించిన జన్మశతంబులకైన
నాపరవస్తుగానంబడదు అట్లు ఆత్మకన్యంబుగా వెదుకబడు
వానిని వెదకువాడు సత్తామాత్రుండును, నేకుండును
నద్వితీయుండునుండ నావెదుకబడునట్టిది వుండుట యసంగ

తంబుగాన సద్గురుస్వరూపులైన పెద్దలె ప్రత్యక్ష దైవంబులు, యీమహానుభావులె వందనీయులు, పూజార్హులు, ధ్యానార్హులు, ఇట్టిమహనీయ్యు అపారకరుణాకటాక్ష వీక్షణ్యా లేశంబుచేతనె మనుజుండు కృతకృత్యుండైతరించుట కర్హుండగుచున్నాడు, ఈన్యాయంబులే ఉపనిషదాది సద్గ్రింథంబులు ఘోషించుచున్నవి.

"మాతృదేవోభవ' పితృదేవోభవ, ఆచార్యదేవోభవ అతిథిదేవోభవ" నింకననేకములుగా గురుధ్యానములయందు వర్ణింపబడియున్నవి. ఏవిధమునైన నెరుగనలవిగానిపెరుమాళ్లకంటె, అతిసులభముగా షోడశోపచారములచేమానసోత్సాహకారణ భూతులను పెద్దలగు సద్గురువుల దర్శనాదులే యధికశ్రేయస్కరంబు కర్తవ్యంబు. మరియాని చోట్లనింకొక ముఖ్యవిషయము చెప్పకనల్లలేకుంటున్నది "బాలోన్మత్త పిశాచవదనున్మత్తోప్యున్మత్తవదాచరణ్," అనుపెద్దలగు మహనీయులు సంగవర్జితాపేక్షకులై, బాలోన్మత్త పిశాచములవలెను, బధసంసారులవలెను, రోగివలెను,నటింతురు, వారలయనుగ్రహముపొందుటబహుకష్టసాధ్యము,ఎవ్వండేనినిష్కాపట్యుఁడై,పరిశుద్ధాంతరంగుండై పెద్దలయందు,భక్తి, శ్రద్ధయుతుండై, కష్టంబులకోర్చినవాడైతోడునీడవలె వారలవెంబడించి తిరుగకకానివారలమహిమాతిశయములు తెలియంజాలవు. వీనియందును వార

లకు దయపుట్టదు. ఆపెద్దల కాపట్యాహేయవృత్తులను జూచిన మాత్రంబున సామాన్యుండు దోషబుద్ధితోడ దోషారోపణంబు సేయనారంభించెనేని ఆట్టివాడు దారికిరాలేడు. పెద్దల బరిక్షించబోవువాడు శుద్ధవ్యర్థుడు. మనోహారి శుద్ధ్యతగల సజ్జనులకే పెద్దలు వశ్యులగుదురుగాని కపటచిత్తవృత్తిగల వారలకు దూరముగనుందురు. కొందరు మానమవలంబింతురు. కొందరుకోపగించిదెగ్గర జేరనివ్వరు. కొందరు యితరులెంత కష్టపెట్టిన నోర్చి పనులుచేయుదురు, ఇటులనంత విధముల జగత్తునందు నటించుపెద్దలను వారల బాహ్యా అసహ్యావేషములకు మనంబున విసుకుజెందక వీరలెప్రత్యక్ష పరవస్తుస్వరూపులనియు, వీరికంటే దేవతాంతరములుండుట త్రికాలములయందును లేదనియు, వారలనుగ్రహము నొందుట కర్తవ్యమనియు, త్రికరణశుద్ధిగ నమ్మి, లోకవాంఛలనారియుమ్మి, దారాపుత్రాదుల సంరక్షణార్థము వ్యర్థప్రయాసబుచ్చికొనిగాసినొందక దానిల్లోశత్రాంశంబైన ప్రత్యక్షదైవంబై వెలుగుపెద్దల అనుగ్రహము జెంద బాటుపడుట అత్యుత్తమపురుషార్థము- ఇదిముమ్మాటికి సత్యము.

## తానగుఆత్మవస్తువునకన్యంభేదిలేదనుట.

శ్రుతి॥ పరమార్థతోనకశ్చిదస్తి, పరమార్థముగుఆత్మస్వరూపమున కన్యముగా కించిత్తుమరొకటియున్నదను

టకు లేదని మహానారాయణోపనిషత్తును. శ్రుతి॥ చిదేవా హం చిదేవత్వం సర్వమేతచ్చిదేవహి చిదేవసర్వం పర మాత్మరూపం,, అనురీతిని కేవలజ్ఞాన స్వరూపమగు ఆత్మ యే సర్వముతానై వెలుగునని, మహావాక్యదర్పణమున్ను; శ్రుతి॥ ఉపాదానం ప్రపంచస్య బ్రహ్మణోన్యన్న విద్యతే, తస్మాత్సర్వప్రపంచోయం బ్రహ్మైవాస్తిన చేతరత్,, అను నటుల, ప్రపంచమునకు పాదాన కారణము బ్రహ్మమగు ఆత్మకంటెనన్యంబేది లేదుగాన నీసర్వప్రపంచములున్ను బ్రహ్మస్వరూపముగానేయున్నవి తదితరమేదియు లేదని యోగశిఖోపనిషత్తున్ను. మరియు౹౹ భూతభౌతిక భావేషు స్వకార్యేషు సదాత్మనా, వ్యాపిద్రుష్టస్తతోహ్యాత్మా దేశాన్నాన్యపరిచ్ఛిత్తిః,, పంచమహాభూతములును, వాని కార్యములతో గూడినసమస్తజగంబులందును, ఆత్మకను వృత్తికలిగియున్నందునను, వ్యాపకత్వముకలిగియున్నందు నను, దేశము చేతపరిచ్ఛిన్నత్వము లేదు.౹౹అదేహిత్వాదన్నా దిత్వాదబాధ్యత్వాన్న విద్యతే, వర్తమానగ తాగామికా లేభ్యోన్న పరిచ్ఛిత్తిః॥= ఆత్మయనాదిగనుక భూతకాలముచే తను, నిత్యుడుగనుక భవిష్యత్కాలము చేతను, దేహావ్య తిరిక్తుడుగాన వర్తమానకాలముచేతను,పరిచ్ఛిన్నత్వము లేదు. ౹౹ సర్వభిన్న స్వరూపేణసర్వాత్మత్వాత్సదాత్మనః, స ర్వేభ్యోవస్తుజాతేభ్యః పరిచ్ఛిత్తిర్నవిద్యతే౹ ఆత్మసర్వా

త్మకుడై యుండుటవలనను, ఆసద్రూపుడైనఆత్మ ఆకాశాదులు కానివానివలెకనబడినను, ఆయాకాశాదులు, అనగా, పంచీకృత అపంచీకృత భూతములు, వాటివలనగలిగిన చతుర్విధభూతగ్రామాదులు, స్థావరములు, మొదలగునవి పరమాత్మ స్వరూపమైనసత్తును, ఉపజీవించుకొనియున్నవిగాన, మృత్తికయందుదోచెడి ఘటాదులు, స్వర్ణంబుయందుదోచెడి కటకమకుటాదులు, ఆమృత్తిక స్వర్ణములకంటె, నేప్రకారము పరిచ్ఛిన్నములుగావో, ఆరీతిని పరబ్రహ్మస్వరూపమైన సత్తుకంటే. అన్యముగా నేదియు లేదు, గావున, పరమాత్మకు వస్తువువలన పరిచ్ఛిన్నత్వము లేదు. ‹‹ నేహనానాస్తికించన, ›› = ఈపరబ్రహ్మాత్మక స్వరూపమందు గొంచమైనను భేదములేదు. ‹‹పురుషాన్నపరం కించిత్ ›› పరిపూర్ణమైన పరమాత్మకంటే వేరుగ కొంచమైనను లేదు. అనుకఠోపనిషత్తును., ‹‹పురుషఏవేదగ్ సర్వంయద్భూతం యచ్చభవ్యమ్. ›› భూతభవిష్యత్ప్రపంచము, ఈసమస్తజగత్తు పరిపూర్ణుడగు పరమాత్మస్వరూపమే. ‹‹తదేవాగ్నిస్తదాదిత్యస్తద్వాయుస్తదు చంద్రమాః తదేవశుక్రం తద్బ్రహ్మతదాప స్తత్ప్రజాపతిః॥ అగ్నిసూర్యుడువాయువు, చంద్రుడు జలము పరిశుద్ధమును బ్రహ్మమును, ఆపరమాత్మయే. ‹‹అయమాత్మాహి బ్రహ్మైవ, సర్వాత్మక తయాస్థితం›› = ఈఆత్మస్వరూపమైన పరబ్రహ్మ

మే, సమస్తప్రపంచము, బ్రహ్మేతరములేదు. ‘‘నతుతద్ద్వితీయమస్తి, తతోన్యద్విభక్తం’’=ఆపరమాత్మకంటెరెండవ వస్తువలేదు, దానికంటే అన్యముగ విభక్తమైనవస్తువలేదనియు, ‘‘ఆత్మనోన్యస్తుపన్నాస్తి సర్వమాత్మమయంజగత్’’ =ఆత్మకంటెవేరుగా పొట్టంతమాత్రములేదు, సమస్తజగత్తు ఆత్మమయమైనదియని సర్వశ్రుతిస్మృతివాక్యములచేత ఆత్మార్థమునకన్యము లేదనబడెను.

## సర్వంబ్రహ్మమయమనుట.

శ్రుతి॥ కింబ్రహ్మేతిహోవాచ॥ మహదహంకారపృథివ్యప్తేజోవాయు, రాకాశాత్మకత్వేన, బృహద్రూపేణాండకోశేన కర్మజ్ఞానార్థరూపతయాభాసమాన, మద్వితీయమఖిలోపాధివినిర్ముక్తం, తత్సకలశక్త్యుపబృంహితమనాద్యనంతం, శుద్ధంశివం శాంతంనిర్గుణమిత్యాదివాచ్యమనిర్వాచ్యంచైతన్యంబ్రహ్మ॥ = అనెడినిరాలంబోపనిషత్తుమేరకు, బ్రహ్మమనగానేమి, మహదహంకారమను మహామాయచే గలిగిన పృథివ్యాది పంచభూతములందుఅంతర్యామిగాను, అట్టిపంచభూతములను అతిక్రమించినదిగాను, నిష్కామకర్మముచేతను, జ్ఞానముచేతను, బొందదగినదిగాను, దనకు రెండవదిలేక సర్వముతానైనదై, సకలప్రపంచోపాధులున్ను వాటిశక్తులతోడ దనయందు లయింపదగినదిగాను, ఆద్యంతములేనిదిగాను, పరిశుద్ధమైనదిగాను, శాంతమైన

దిగాను, మంగళకరమైనదిగాను, గుణరహితమైనదిగాను, అవాఙ్మానసగోచరమైనదిగా నుండునట్టివస్తువే, శుద్ధచైతన్యమాత్రస్వరూపమైనబ్రహ్మమనబడుననియు "శ్రుతి॥ ఏకోవశీ సర్వభూతాంతరాత్మా, ఏకంబీజం బహుధాయఃకరోతి" అను శ్రోపనిషత్తురీతిని, అతిసూక్ష్మమైనవటబీజముగనందుండియనేకఆకులు, రెమ్మలు, పూవులు, పిందెలు, కాయలు, పండ్లుమొదలైనవిగూడి, గొప్పవృక్షమని పేరెత్తుకొన్న నావిత్తులోనిసత్తు వృక్షమంతయువ్యాపించిన ప్రకారము, సర్వచరాచరప్రపంచములై, ఆత్మస్వరూపుడైన పరబ్రహ్మమే, సర్వవ్యాపకమైయున్నదనియు, 'బ్రహ్మమాత్ర మిదంసర్వం, బ్రహ్మణోన్యన్నకించన,, యీసమస్తము పరబ్రహ్మస్వరూపము, ఆపరబ్రహ్మముకంటె కొంచమైన నువేరులేదు. "బ్రహ్మణోన్యేతరంనాస్తి బ్రహ్మణోన్యజ్జగన్నచ,, బ్రహ్మముకంటెఅన్యతరములేదు. బ్రహ్మముకంటె వేరుగ జగత్తులేదు. "బ్రహ్మణోన్యత్తృణన్నాస్తిబ్రహ్మణోన్యత్పదంనహి,, బ్రహ్మము కంటె అన్యముగతృణములేదు, బ్రహ్మముకంటె నర్థవంతమగు శబ్దములేదు. "సర్వంబ్రహ్మైవసతతమ్ సర్వం బ్రహ్మైవ కేవలం,, ఈసమస్తము యెల్లప్పుడు పరబ్రహ్మస్వరూపము. "బ్రహ్మైవసర్వం చిన్మాత్రం బ్రహ్మమాత్రం జగత్రయం" సమస్తము చిన్మాత్రస్వరూపమైనపరబ్రహ్మము, జగత్రయము బ్రహ్మమే

సర్వం బ్రహ్మేతివిజ్ఞానాత్" దృశ్యాదృశ్యంబగు ఈసమస్తమున్ను బ్రహ్మమని తెలుసుకొనుము. (తేజోబిందోపనిషత్.) ఇత్యాదిశ్రుతిస్మృతులు సర్వంబ్రహ్మమయమనిస్థాపింపక నే స్థాపించుచున్నవి.

## భ్రాంతియె బహువిధములుగాదోచుననుట.

శ్రు॥ భ్రమః పంచవిధోభాతి తదేవేహ సముచ్యతే। జీవేశరా భిన్నరూపా విత్రప్రాథమికోభ్రమః॥ ఆత్మనిష్ఠం కర్తృగుణం వా స్తవంవాద్వితీయకః। శరీరత్రయసంయుక్త జీవస్సంగీత్రితీయః॥ జగత్కారణ రూపస్యవికారిత్వం చతుర్థకః। కారణాద్భిన్న జగతస్సత్యత్వం పంచమోభ్రమః॥అనెడిఅన్నపూర్ణోపనిషత్తురీతిగా,భ్రాంతియైనది,ఐదువిధములుగానున్నది, అవియిచ్చటజెప్పబడుచున్నవి.జీవేశ్వరులు వేఱువేఱురూపమనునది మొదటిభ్రాంతి, కర్తృత్వగుణమఖ్యునది వా స్తవముగా నాత్మయందున్నదనుట రెండవభ్రాంతి, శరీరముతోజేరియున్న జీవుడా శరీరముతోనంటుకొనియున్నాడనుట మూడవభ్రాంతి, జగత్కారణరూపునకు వికారత్వముజెప్పుటనాలుగవభ్రాంతి, కారణమునకైన జగత్తువేఱనియు, సత్యమనియు, నిత్యమనియుజెప్పుటలు పంచమభ్రాంతియనందగు, మఱియును.

శ్రు॥ మత్తైరావతోబద్ధస్సపి కోణకోటరే, మశకేనకృతంయుద్ధంసింహ్మాఘైరణుకోటరే, పద్మాక్షేస్థాపితో

మేరుర్నిగీర్ణో భృంగసూనునా, నిధాఘువిద్ధితాద్య కృత్వం జగదేతద్భ్రమాత్మకం॥ అనేడిమహావాదని పత్తురీతిగా, ఆ వగింజకొకమూలగల తూటునమత్తగజముగట్టబడెను. అ ణువునందొక బెజ్జమందొక దోమదూరైనది, సింహసమూ హములతో యుద్ధముసేయుచున్నవి. ఒకదామరబీజమం దునబెట్టియున్న మహామేరు పర్వతమును, భృంగసూను, తుమ్మెదపిల్లఒక బెమ్మంగివేసెను, ఓనిధాఘా! భ్రాంతిస్వ రూపమైనజగత్తును, వాటికి సమానమైతలంపుమా॥ మరి యు, శ్లో॥ భ్రమణాహం భ్రమత్వంచ భ్రమణోపాసకం మనః। భ్రమణేశ్వర భావత్వం భ్రమమూలం మిదంజగత్॥ అనెడు గురుగీతా ప్రకారము, నేననడము భ్రాంతి, నీవనడ మున్ను భ్రాంతి. ఉపాసన మొదలైన మనసున్ను భ్రాంతి, ఈశ్వరాదిభావనలున్ను భ్రాంతి, సర్వజగత్తున్ను భ్రాంతియే యగు. మరియు, శ్లో॥ ఆత్మాజ్ఞాన మహానిద్రా జృంభి తేతస్మిన్ జగత్త్రయే, దీర్ఘస్వప్న స్ఫురంత్యేవ స్వర్గమో క్షాది విభ్రమాః॥అనెడిఅద్వైతమకరందమురీతిని, నిర్వి కార పరబ్రహ్మమైనఆత్మయందు గలిగిన అజ్ఞానమగుమహా నిద్రలోని స్వప్నమందు నీసకలప్రపంచములున్ను దోచు చుండగామాయా భ్రాంతిచేత తానేచిదాభాస జీవుడు గా దోచుచు తనకు జననమరణ సుఖదుఃఖ బంధ మోక్షములు గలిగియుండునట్లు దుఃఖించుననియు,

స్వప్నకల్పితచోరవ్యాఘ్రాదులజూచిభయమొందినచిదా భాసుడుమేల్కొని నమాత్రము తననిజస్వరూపముజూచి నిర్భయుడై సంతసించినట్లు సద్గురుకటాక్షముచే అజ్ఞా ననిద్రా భంగమగు పూర్ణబోధామృతముచేత భ్రమని వ ర్తి గలుగుననిన్ని. కం॥ నానాదేహోపాధుల, నానాత్వ భ్రాంతినొంది, నానీదనుచుక్, నానాభిమానములచే, నా నారూపంబులాయె నారాయణుడే॥ యనిరామ స్తవరాజ మున్ను" శ్లో,, ద్వైతభ్రాంతి రవిద్యాఖ్యా॥ అనిబ్రహ్మ పురాణమురీతిని, నానావిధద్వైతబుద్ధిభేదభావనయేమా యాభ్రాంతి యనిన్నిమఱిన్ని అనేక శ్రుతిస్మృతులచేత భ్రాంతియే నానావిధములై తోచడమని స్థాపించనా యెను.

## మోక్షాగ్నులిట్టివారలనుట.

శ్రుతి॥ క్రియావంతశ్శ్రోత్రియా బ్రహ్మనిష్ఠాః। స్వయం జుహ్వతఏకర్షిం శ్రద్ధయంతః। తేషామేవైతాం బ్రహ్మ వి ద్యాంవదేత్,, = అధికప్రయాసముతోనాత్మతత్వ ప్ర భావములను యుపన్యాసము జేయువారివాక్యములనువిని వాటిలోస్వల్ప భాగములనుగాని యనుష్ఠించనెత్నిం చక యుండువారికిన్ని, ధ్యానము, నిష్ఠ, సమాధి, మొ దలగు దేవతారాధనములచేయ గోంచమైనను మన సు లేనివారికిన్ని, వేదవచనములందు నమ్మకము లేనివారి

కిన్ని, మరియొకరిప్రయత్నములేక, ఆత్మవిద్యయం దపేక్ష లేనివారికిన్ని, సంకల్పనాశము జేయవలయుననే ప్రయత్నములేనివారికిన్ని, ఆత్మవిద్యను బోధింపరాదని, ముండకోపనిషత్తును. "తపోభిఃక్షీణపాపానాం, శాంతానాం వీతరాగిణాం, ముముక్షూణామపేక్ష్యోయ, మాత్మబోధో విధీయతే,, = సర్వవిద్యలయందున్ను, మిక్కిలి యుత్తమమైన బ్రహ్మవిద్యయందపేక్షగలవారు, చాంద్రాయణాది తపస్సులచేత బాపరాహిత్యులకును, శాంతముగలిగిన వారికిన్ని, మోక్షేచ్ఛగలిగిన వారికిన్ని, ఆత్మోపదేశము సేయదగుననియు,ఆత్మబోధయు. "ఆత్మానాత్మావివేకేనపునస్సంసారనిహ్నతి, తద్వినాజన్మ కోట్యాపిబంధచ్ఛేదోనసిద్ధ్యతే,"ఆత్మానాత్మవివేకముసేసినవారికే చిత్తశుద్ధి చక్కగాగలిగి, తన్మనోమలినరాహిత్యద్వారా ఆత్మసాక్షాత్కారంబును, మోక్షసాంమ్రాజ్యంబు సంప్రాప్తంబగుటయెగాక తదన్యంబులగు కల్పితదేవతాంతరభక్తి యుపాసనలు, జపతపవ్రతదానాదులచే గలుగదనియు, ప్రబలశ్రుత్యాదులు జెప్పుటచేత, సాధనచతుష్టయముగలవారెతన్మోక్షంబునకు ముఖ్యాధికారులగుదురు. ఈసాధనచతుష్టయవిషయమై వేదాంతశాస్త్రంబుల బోధింపుదుం.

## సద్గురువులవెదకిశిష్యులుమనివి సేయవలయుననుట.

శ్రుతి॥ శిష్యోబ్రహ్మనిష్ఠం గురుమాసాద్య ప్రదక్షిణాపూర్వకందండవత్ప్రణమ్య ప్రాంజలిర్భూత్వా వినయేనోపసంగమ్య, భగవన్ గురో మే పరమతత్వరహస్యం వివిచ్యా వక్తవ్యమితి,' అను శ్రీపాద్విభూతిమహానారాయణోపనిషత్ రీతిగానున్న ॥శ్లో॥ తద్విజ్ఞానార్థంస్వ గురుసేవాభిగచ్ఛేత్, సమిత్పాణిం శ్రోత్రియంబ్రహ్మనిష్ఠం॥ తద్విద్ధిప్రణిపాతేన పరిప్రశ్నేనసేవయా। ఉపదేక్ష్యంతేజ్ఞానం జ్ఞానినస్తత్వదర్శినః॥ అనుభగవద్గీతప్రకారము లోకవిలక్షణమైన బ్రహ్మవిద్యనుపదేశించు మహాపురుషుడైన బ్రహ్మవేత్తవద్ద మిగులవినయముగలిగి భక్తితో బ్రహ్మవిద్యను గ్రహించి తరించుమార్గమును అవలంబింపవలయుననిన్ని, మరియు,, సీ॥ ఏవ్వాడనేజగం బెట్టిదిసంసార మెవ్వానికక్కట యెందుగళిగియెందున్నాడనో యేరూపవాడనో యేచందమేయంద మేదిత్రోవ। యొకనాటికిని నేనుయున్నదున్నట్టుగా కన్నవారలోనకలసిమెలసి, దలయెత్తగలుగునో దైవకటాక్షంబు లేరీతినున్నదో యెవడుగలడో యనుచు దేహాదికభ్రమలన్ని విడిచి, వేదవేదాంతవేత్తలవిభవమెరిగి, నేడుగడయును గురుడంచు నెంచువాడు, స్వస్వరూపోపదేశాహుజనుడుభూప॥'' ॥గీ॥ ఇన్ని చెప్పనేల దన్నుదానెరిగిన, ఘనునిజేరకున్న గమన మెట్లు పోవువ్యర్థమగును

బూడిదెలో హెూమమై, నరేంద్రచంద్రయథములకు న్న్రు, అదియునుంగాక ॥ గీ॥ ఇట్టిగురుని జేర కెన్నిపోకలు బోవ। చిత్తశుద్ధిలేదు చింతపోదు, మాయమాయలాడి మ టుమాయమంత్రాల,దొలగిపోదునాత్మ దెలియనీదు॥ అను శ్రీరామ స్తవరాజమునుజెప్పుమేరకు శ్రుతిస్మృతాదులచే నుడివినట్లుదేశికులనువెతకి మనవిసేయవలెనని స్థాపింపనా యెను.

## శిష్యులకు, త్రివిధదీక్షలచేస్వరూపోపదేశము సేయుదురనుట.

శ్రు॥, నాస్తికాయ కృతఘ్నాయదురాచారరతాయ నై ,మద్భక్తి విముఖాయాసచ్ఛాస్త్రగర్తేషుముహ్యతే, గురుభక్తివిహీనాయదాతవ్యంనకదాచన, సేవాపరాయశి ష్యాయ హితపుత్రాయ మారుతే॥ మద్భక్తాయ సుశీలా యకులీనాయసుమేధసే, సమ్యక్పరిక్ష్యదాతవ్యమేవమష్టో త్తరగ్ శతం॥ అనెడిముక్తికోపనిషత్తురీతిగాను॥ శ్లో॥ దు స్సంగంపరిత్యజ్య పాపకర్మపరిత్యజేత్, చిత్రచిహ్నమిదం యస్యతస్యదీక్షావిధీయతే॥ ఏతల్లక్షణయుక్తత్వంసర్వభూ తహితేరతం, నిర్మలంజీవితం యస్యతస్యదీక్షా విధీయతే॥ శ్లో॥ ఈక్షణధ్యానసంపర్శై ర్మత్స్యకూర్మ విహంగమాః! పోషయంతిస్వ కాక్ పుత్రాన్తద్వత్పండితవృత్తయః॥ అనె డిగురుగీతమేరకున్ను॥ మరియు॥ సీ॥ అనియిట్లుబోధించి

యానందమూ ర్తియై శ్రీరాఘవుడు నిజశ్రీపదార। విందం
బులకు భ క్తివందనంబులు సేయుహనుమంతు గనుగొని
యప్పుడతని। శిరమను పూర్వాద్రి శిఖరంబుపై స్వకరా
ర్కమండల ముదాయంగ జేర్చి । తనరుసీ హ స్తమ స్త
కయోగమిప్పుడే తెలివి యెఱుంగునా తెలివినీవు। తెలివినీవ
ని చెలుపగా దెలియునద్ది । యదియేనీవని వెలుగుచేననిల
సుతుని॥ ధీగతానాద్యవిద్యాంధతిమిరమెల్ల । బాపి కేవల
తత్వరూపంబుజూపె,,అనెడిసీతారామాంజ నేయసంవాద
ము న్ను॥ ''సీ''స్వ స్తికారోహణస్పర్శ వేదాదీక్షలీమూడుదీ
క్షలనెరుగవినుము, మొదలసిద్ధాసనముననుంచిమరిశిష్యు
నొసటివ్రాతదుడిచి భసిత రేఖయాగము క్తికదీర్చి యాద
లంజెయిజేర్చియంతట దెల్వినీవనుచదెల్పి, కడగిట్లు త్రివి
ధదీక్షాప్రకారంబున కారణగురు మూ ర్తికరుణసేయ। రా
జయోగ సమాధిసామ్రాజ్యసౌఖ్య। వార్ధినోలాడుచుండె
డువారలకును, నెన్నటికిహాని లేదయామున్నువీరి । సన్ను
తులువిన్నజాలదేజన్మఫలము,, అనెడిశ్రీరామ స్తవరాజ
ము, మొదలగుశ్రుతిస్మృతివచనములరీతిగాయోగ్యతగ
ల శిష్యునొకని, జేరదీసికూర్చుండనియమించి చేపలు,
కూర్మము, పక్షులమేరకుజూచి, తలంచి, స్పర్శముజేయు
నటులదీక్షాత్రయముచే, శిష్యునిజూచి కరుణారసముపెరి
గి వీనికి సర్వదుఃఖనాశనమున్ను ఆనంద ప్రాప్తియున్ను

గలుగునటుల వీడు బ్రహ్మస్వరూపుండౌను గాక యనిమనం
బునదలంచి ఆశీర్వదించి, హస్తమస్తక సంయోగము చేసి,
వానినిస్పర్శించి, పుత్రా నీవు దుఃఖింపకుము జననమరణసం
సారసాగరంబును దాటుటకొకయుపాయము గలదనియు
తని శిరమున హస్తములుంచియీహస్తమస్తకసంయో
గమువలన నేదెలివియెఱుంగుట, నాతెలివినీవు, తెలివి
నీవని తెలుపగా దెలియునదెద్దియో యది యేనీవనియుప
దేశించి అజ్ఞానతిమిరంబుబాపి, జ్ఞానభానోదయంబునకు
దెచ్చికృపసేయువాడు గురుడనబడునని యెఱుగవలయు.

## అజ్ఞానారోపముచే, తన్నుమరచి బద్ధుడగునుట.

శ్రుతి,, సదసత్ఫలమయైర్హి పాశైః పశురివబద్ధంబంధన
స్థస్యైవా, స్వాతంత్రియంయమవిషయస్థస్యైవ, బహుభ
యావస్థం మదిరోన్మత్త ఇవా, మోదమదిరోన్మత్తం పాప్మ
నాగ్రహీతఇవ, భ్రామ్యమాణం మహోరగదష్టఇవ, విష
దష్టంమహాంధకారఇవ, రాగాంధమింద్రజాలమివ। మా
యామయం స్వప్నఇవ, మిథ్యాదర్శనం కదళీగర్భ ఇవా
సారం, నటఇవక్షణవేషంచిత్రభిత్తిరివ. మిథ్యామనోరమ
మిత్యథోక్తం, శబ్దస్పర్శాదయోహ్యర్థా అనర్థా ఇవతేస్థి
తాః, యేషాంసక్తస్తుభూతాత్మానస్మరెచ్చపరంపదం॥ అనె
డిమైత్రాయణ్యుపనిషత్తుకీతిని, పాపపుణ్యఫలములనుత్రా
డ్ల చేత కట్టబడిన అంగహీనునివలెను, కారాగృహమున

నుంచిన చోరునివలె అస్వతంత్రమై యమదండనకులో బడి నిలుచువానివలె మిక్కిలిభీతిజెందినదై, లహరిపదార్థమును స్వీకరించినవాడు, మత్తుచేసాక్కియుండులాగున, విషయభోగములనుమత్తుతలకెక్కి, మెయిమరచి యుండునదై పాపగ్రహాదులు సోకినప్పుడు విభ్రాంతిజెంది తల్లడిల్లువానివలెను, పెద్దసర్పము చేగఅవబడినవానివలె, విషయమను సర్పముచేగఅవ బడినవాడై, మహాంధకారమువలె, నాశయనుచీకటిచేఅంధకత్వముగలిగిన అంధునివలెను. ఇంద్రజాలమువలే మాయాస్వరూపమై, స్వప్నమువలె, అయధార్థస్వరూపమై, అఅటిగుఱితువలెసారములేనిదై, వేషగానివలె, అనేకవేషములు ధరించునదై గోడమీాద వ్రాయబడియుండు చిత్తరువులవలె, అయధార్థ మనోరమ్యమైయుండు ఈజీవునకుస్వకర్మవలన నానావిధ సుఖదుఃఖ భోగములు సంభవించు చున్నవి. ఇందువలనజీవుడు, అనేకానర్థములకు విషయమగుచున్నాడు, ఇటువంటిఅనర్థములకెల్ల ముఖ్యకారణము అజ్ఞానమేకాని వేఱుగాదు. ఈయజ్ఞానముచేతపరమపదమును స్మరించడములేకపోయెను. దీనిచేతబహువిధములగు జననాదులు గలుగుతున్నవి, వీటిని అధ్యారోపమనియు జెప్పబడును॥ శ్రుతి॥ అధ్యారోపాప వాదతస్స్వరూపంనిశ్చయీకర్తుం శక్యతే, తస్మాత్సదా విచారయేజ్జగజీవ పరమాత్మనః,,

అనెడిపైంగలోపనిషత్తురీతిగా అధ్యారోపమనియు, అపవాదమనియు, రెండుయుక్తులుగలవు అధ్యారోపము బంధమును అపవాదము మోక్షమును బొందజేయును, ఈరెంటినివిచారించుటచేతనే తననిజస్వరూపం బెరింగి ముక్తుడగుచున్నాడుగాన, జగత్తు, జీవుడు, బ్రహ్మము వీనిలక్షణంబుల బోధించు ఈయుక్తులు రెంటినిసదా విచారించుచుండవలయుననిన్ని, మఱియు ॥ శ్లో॥ అనాదిమాయయాసుప్తో యధాజీవః ప్రబుధ్యతే, అజమద్వైత మస్వప్నమనిద్రంభుధ్యతేతధా॥ అనెడిరిభుగీతప్రకారము అనాదియగుమాయచేత(తన్నుమరచి) నిద్రజేయు జీవుడెప్పుడు, జాగ్రతపొందుతుడోలేకతన్ను నెరుగుతుడో యప్పుడు జననమరణములుమాని ద్వైతభ్రాంతిలేక స్వప్నకల్పితముని వర్తియై, మరుపైననిద్రలేచి తురియస్వరూపుడె తానని యెరుగుతుడనియు,, ॥శా॥ ఆరోపంబపవాదమీయుభయమందారోపమాబంధమా, ధారంబై దగుము క్తింజెందనప వాదంబంచు వేదాంతమా, యారోపంబున కాఖ్యదెలుపునధ్యాసంబసత్యంబునా, సారోదారకుమార కల్పనమనన్ సర్వజ్ఞులూహింపంగన్,, అనెడికైవల్యనవనీతమురీతిని. పైనినుడివియుండునటుల ఆరోపమపవాదమను రెండుయుక్తులలో నారోపమునకు అధ్యాసమని, కల్పనయని, అసత్యమనినామములుగలవని, తాత్పర్యముగావున, జననమరణాదులను సంసారములకజ్ఞానారోపము లెకారణములనాయెను.

## దుఃఖనివర్తి అపవాదయుక్తియనుట.

శ్లో॥ నాహంకర్తానైవభోక్తా ప్రకృతేస్సాక్షిరూపకః, మత్సాన్నిధ్యాత్ ప్రవర్తంతేదేహాద్యా అజడాఇవ, స్థాణుర్నిత్యసదానంద శుద్ధోహంనమాయామలః। ఆత్మాహంసర్వభూతానాం విభుస్సాక్షి నసంశయః॥ అనెడిసర్వసారోపనిషత్తున్ను॥ మరియు॥ శ్లో॥ నిషేధేకృతేనేతి నేతీతివాక్యైసయథాభాతిపూర్ణం। అవస్థాత్రయాతీత మద్వైతమేకం పరంబ్రహ్మనిత్యంతదేవాహమస్మి,, అనుప్రమాణములరీతిగా ఆత్మస్వరూపుడగు తానజ్ఞానావరణములోజిక్కి భ్రాంతిచేతతన్నుసుఖదుఃఖ జననమరణాది బంధవికారములుగల ఈవ్యావహారిక జీవునిగా దలచుచుతర్వాత మోక్షాపేక్ష గలిగి సద్గురువునాశ్రయించి, (నేతినేతి) అనగానేనిది కానునేనిదికానని అపవాదయుక్తిచే దత్వవిచారణచేసి, జ్ఞానస్వరూపుడగు నేనీదేహేంద్రియాదులకు సాక్షిగానుండుచు వీటినెరుగుచున్నానుగాన సర్వసాక్షిస్వరూపుడై యున్నాను. ఈవ్యావహారికజీవుడు అనబడునట్టిశూక్ష్మశరీరము దృశ్యముగానున్నది ఇదిజడపదార్థముగానుండినప్పటికిన్ని ఆత్మస్వరూపుడగు నాసన్నిధానమువలనఇదియును జ్ఞానవంతముగా దోచుచు జీవుడనంబడుచు. కర్తృత్వభోక్తృత్వములు గలిగి సకలకార్యములను జేయుచుతత్ఫలంబులగు సుఖదుఃఖంబు లనుభవించుచు జననమరణంబులం

బొందుచున్నది. ఆత్మస్వరూపమై సదాద్రుక్స్వరూప స
ర్వసాక్షిగానుండు నేకర్తనుగాను,భోక్తనుగాను, కేవలని
ర్వికార సాక్షిమాత్రముగానున్నానుగాన నేను జననమర
ణాది సంసారసుఖదుఃఖములు లేనివాడను. పరబ్రహ్మస్వ
రూపుడను, అనెడిపరబ్రహ్మాద్వైత జ్ఞానముగలిగినతోడ
నే తానుజీవుడనెడి భ్రాంతినశించి, బ్రహ్మస్వరూపమై ఆ
నందించుచుండును.అపవాదయుక్తిచే భ్రాంతినశించుటయే
మోక్షమనియు జెప్పుదురు. మరియు ॥ ఉ ॥ స్థాణువుగా
డుచోరుడిదిత్రా డహిగాదనుమాడ్కి-ధాత్రిని, ర్వాణగు
రూక్తినేత్రమునరాజిలు వేదశిరోర్క-కాంతివి, స్నాణము
బూని భూతభువనంబులుగావు పురంబుగాదుశ। ర్వాణిధ
వాంతరాత్మలన రంజిలునా యపవాదమెంతయుక॥ మరి
న్ని॥ పద్యం॥ తంతుసువర్ణమృత్తికలుధాత్రిదుకూల విభూ
షణోఖకా। సంతతులై తదన్యపటుసంజ్ఞలనొందితదాత్మకం
బులై । సంతతమున్నభాతిఁగనన్యజగంబపవాద యుక్తిసు,
స్వాంతపరాపరాత్మయగుసాధనసాధ్యము లెందువేఱగుక॥
అనెడికైవల్యనవనీతప్రకారము ఇదిఆకులు కొమ్మలులేని
క్రొఱడుగాని చోరుడుగాడు, ఇదిత్రాడుగాని సర్పముగా
దు, అనియాప్తులమాటలచే దెలుసుకొన్నట్లు వేదాంత శా
స్త్రమనెడు సూర్యదేజస్సహాయముగలగు రూపదేశమహా
వాక్యార్థమనెడి జ్ఞాననేత్రములచేతనీకనబడునవియన్నియు

సమష్టి స్వరూపుడైన యీశ్వరుడును, వ్యష్టిస్వరూపుడైనజీవుడును, నాకాశాది పంచమహాభూతములును, పదునాలుగులోకములును, నవద్వారములుగల దేహములునుగావని, చేలములునూలని, ఆభరణములు బంగారమని, కుండలుమన్నని, ఎరుగునప్పుడు కార్యములైనవస్త్రభూషణఘటములను కారణములైన తంతుసువర్ణ మృత్తికలును, వేరుగాక ఒక్కటేయైనట్లు తనయందుదోచిన జీవేశ్వరజగములు పరబ్రహ్మమైన తానెయని తెలియుటే అపవాదయుక్తియనియు తాత్పర్యము.

## ఆత్మానాత్మ స్వరూపంబులమరుగుపరచడము ఆవరణశక్తియనుట.

శ్లో॥ తథాసర్గబ్రహ్మణోశ్చ భేదమావృత్యతిష్ఠతి, యాశక్తిస్తద్వశాత్ బ్రహ్మవిక్రతత్వేనభాసతే॥ అనెడిప్రమాణమురీతిగా దృగ్దృశ్యములగుఆత్మను, దేహమును, అవరించుకొనియుండుఆవరణశక్తియే,బ్రహ్మమునుజగత్తుద్వారానావరించుకొనియున్నది, అట్లావరించుకొనియుండుఆవరణశక్తివలన, జేయబడిన అన్యోన్యాధ్యాసమువల్లనే, అనగాభ్రాంతిచేతనే,నామరూపక్రియాశూన్యమై,నిర్వికారముగానుండుసచ్చిదానందపరబ్రహ్మమున్ను,నామరూపక్రియలుగలదిగాను, షడ్వికారసహితమైనదిగా దోచుచున్నది,ఐతే, అక్కడయును యీావరణశక్తినశించినయెడల, శుక్తికా

రజితమురీతిగా బరబ్రహ్మమందారోపితంబులుగాదోచిననా మరూపక్రియలున్ను, షడ్భావవికారములున్ను, మిధ్య గా నశించిపోవు చున్నవనియు, మఱియును. ॥మ॥ తన కుండాన సమానమైన పరమాత్మకు స్వాత్మగాఁజూచున, ద్ధనవిజ్ఞానులఁదక్క రోదసిఘ నౌఘుంబంధముం జేయున,ట్ల నఘానాస్తిన ఖ్యాతియంచిలనవిద్యావాదులై యున్నదు, ర్జ నచ్ఛిద్భావముగప్పు నావరణమాజన్మద్రుమావాలమై॥ అ నెడికైవల్యనవనీతమురీతిగా, ఆవరణశక్తి, ఉపమానరహి తమైనపరమాత్మను, ప్రత్యగాత్మయగుతన్ను గా శ్రుతియు క్తియనుభవములచేత, దెలిసికొనినబ్రహ్మజ్ఞానులనుదప్ప, బ్రహ్మము లేనేలేదు, ఉండెనేని యేలగనుబడదనివాదించు బౌద్ధచార్వాక క్షపణలోకాయతిక శూన్యవాదులు మొ దలైన మూఢజనుల తెలివిని అపహరించిఆత్మవస్తువును మరుగుపరచి, వారిని. జననమరణాదిదుఃఖములకుగారణు లుగాజేసినదని జెప్పుటచేత, మరుగుపరచడమావరణము నబడెను.

వివేకముచేతనవివేకము మానుననుట.

శ్లో॥ అవచ్ఛిన్న ఇవాజ్ఞానాత్ తన్నాశేసతికేవలః। స్వ యంప్రకాశతే ఆత్మామేఘాపాయేంశుమానివ॥ అనెడిఆ త్మబోధప్రకారము, సూర్యుఁడు, మేఘములకుచాలాదూ రనుండియు, మేఘములకంటెయనంత భాగములు

పెద్దదైగానివల్లమరుగైనదైతలంచినట్లుఆత్మశరీరోపాధికారణచిరకాలమలిన వాసనాజన్యఅజ్ఞానముచేత మరుగైనట్టుతోచుచున్నది, మేఘములుతొలగినటుల అజ్ఞానము నివర్తికాగానే ఆదిత్యునివలెనాత్మా, నిత్యప్రకాశస్వరూపమునై, కేవలమునై, భాసిల్లునని యు॥శ్లో॥విద్యావిద్యాం నిహంత్యేవ తేజస్తిమిరసంఘవత్॥ అనిఆత్మబోధ॥ సూర్య ప్రకాశముచే మహాంధకారమేలాగు నశించునోనాలాగు ప్రజ్ఞానమువల్ల యజ్ఞానమునశించునని యు. ॥మఱియు॥చ॥ శరము శరంబునన్ ఫణివిషంబు విషంబున నుక్కునుక్కునన్, సిరగసటుందగంగనటు చేరవహీరమునన్ హరించున, ట్లరయన శుద్ధమాయదెగటార్తురుధీసులు శుద్ధమాయచే, నిరమదియేగుప్రేతమునుగాల్చిన కాష్టముభంగి దానితోన్॥ కైవల్యనవనీతమురీతిగా, ఆగ్నేయాస్త్రము మొదలైన అస్త్రములను ప్రత్యస్త్రములచేతను, బాణములబాణములచేతను, ఖడ్గములు మొదలగుశస్త్రముల నాలాటి యాయుధములచేతను, పాముకాటువిషమును విఱుయాడెగపాషాణములోనగు మూలికాద్రవ్యములచేతను, జలములుకంచుగాగివస్త్రములు మొదలగువానియందలిముఱికిని చిల్లగింజ విభూతి చింతపండు చవటిమన్ను సబ్బులోనగువానిచేతను,ఇనుముతోజేసినగడియలుగరిటెలుపెనములుగడ్డపారలుగొడ్డండ్లుమొదలగుగృహోపకరణ

ములను ఉక్కుతో జేసినసమ్మెటి ఉలిమొదలగుకోలము ట్లచేతను, వజ్రపుఱాళ్లను వజ్రపుసానలు పోగరలుమొద లగువానిచేతను, ఖండించినట్లు, పండితులు శుద్ధమాయ యైన విక్షేపశక్తిచేత అశుద్ధమాయయైన ఆవరణశక్తిని ఖండింతురు. పీనుగనుగాల్చుకట్టెశ్మశానమందలి పీనుగను గాల్చి వెనుకదానినిగూడకాల్చినతీరునవిక్షేపశక్తిఅవరణ శక్తితోడ నేనశించునని తాత్పర్యము.

జీవుని కేడవస్థలుగలవనుట.

మ॥ వినుమజ్ఞానము మాయనావరణముం విక్షేప
ముంభక్తివా। సనతోనొప్ప పరోక్షబుద్ధియపరో
క్షజ్ఞప్తిసీడానివృ। త్తినిజానందమనా నవస్థలివిప్రా
ప్తించుం సుతాయేడునీ। నినిదానాకృతి ధర్మక
ర్మగతులేనేర్పొప్పంగాందెల్పెదం.

మ॥ మఱునైయుండుటదాన విద్య పరమాత్మజ్ఞప్తిలే
డున్నవాం। డెఱుగన్రాడెయనంగ నావరణమన్యే
చ్ఛంబరునీడ్వే వే। మఱునేజీవుండనంచు నెంచిమెద
సన్మానింప విక్షేపమ। క్కఱతోడం గురువాక్య
పద్ధతిబరోక్షంబావిలోకింపంగాం.

మ॥ తగునేప్రొద్దపరోక్షమారయుటంద త్త్వంపదా
ర్థైక్యమా। సుగతిం దుఃఖనివృత్తి యాబరమస
చ్చిద్ధాత్మనేనంచుగ। ర్వగతేశాత్మల భేదము

ద్రోలఁగశర్మంబౌఁగద్యున్నన్యుఁడై। జగతిన్నిష్ఠనో
నర్పవీనినిఁక దృష్టాంతంబుచేఁదెల్పెదన్.॥

అని కైవల్య నవనీతమునుడువు మేరకు, మాయయం
దు అజ్ఞానము, ఆవరణము, విక్షేపము, పరోక్షజ్ఞానము, అప
రోక్షజ్ఞానము, దుఃఖనివర్తి, నిజానందావాప్తి, అనెడియేడ
వస్థలు, జీవులకుకలుగును, వానికారణములను, స్వరూపము
లను, స్వభావములను, కృత్యములను, వ్యాపకములను జెప్పె
చున్నాను వినుము. ప్రత్యగాత్మస్వరూపుడైన తానుతన తెలి
వికికనపడక యుండుటేఅజ్ఞానము. నా తెలివియందుపరబ్ర
హ్మము లేదు, ఉన్నపటిమునకనబడదాయనుటయేఆవరణ
ము. దేహేంద్రియాదులకువిలక్షణుడైనప్రత్యగాత్మయగు
తన్నుమరచిదేహేంద్రియాదులతోగూడిన జీవుడననిపలు
మారుననుకొనుచు సుఖదుఃఖము లనుభవించుచుండుటే
విక్షేపము; శ్రద్ధతోకార్యగురువులసమయమంత్రోపదేశప
ద్ధతిని వదలకనడుచుటేపరోక్షజ్ఞానము, తత్వమసియనెడు
మహావాక్యమందలితత్పదత్వంపదములకులక్ష్యార్థములైన
పరబ్రహ్మప్రత్యగాత్మలకుకెడ తెగనిపొందికకలుగుటయే
అపరోక్షమనెడు పంచమావస్థయగును, శరీరేంద్రియా
దులు తాననెడి అభిమానముతోగూడినే నీశ్వరుడను,
నేనుజీవుడననుకొనక అద్వితీయాఖండాపరోక్షస్వప్రకాశ
పరమాత్మయే నేననుకొనుటయే దుఃఖనివృత్తియనెడు

అకవయవస్థయగును. పిమ్మటకృతకృత్యుఁడై నిర్వికల్ప నిష్ఠయందునిల్చుటే ఆనందమనెడు సప్తమావస్థయగున నితాత్పర్యము.

దశమదృష్టాంతముచేత దన్నెరుగ యేడవస్థలున్ను నశించుననుట.

చ॥ పదవడియొక్కచిత్రకథ భాసిలునిందులకై వచిం
చెదన్। బదుగురు వేడ్కనీదినది బారమునంద
ములోనొకండుపోం।. పొదవగ ణెంచితన్నుడిగి యొ
క్కడు లెక్కకుదక్కువంచుదా। నెదదలపోసివి
భ్రమతనేడ్వదొడంగెదదర్థమెట్లనన్॥

మ॥ తనుదాగానని మోహమజ్ఞతతిరో ధానంబు లేదీ
యడం। గనవాడిట్లన బుత్రవానికయిదుః ఖంబా
త్మలోజెందదా। ఘనవిక్షేపము పొంధుఁడొక్కరు
డు దత్కార్యంబు వీక్షించిగ్రద్దనమున్నాడనవా
పరోక్షముప్రశస్తంబై వెలుంగుఁదగన్.॥

చ॥ అగునపరోక్షమా తెలుగు నంతయెఱింగి గణించి
వారిలో। దిగులెడబాపితన్నుగన దెల్పినబుణ్యపథ
స్థుఁడొక్కరుం। డొగికడుతన్నెఱింగిమది యొప్పిన
దుఃఖనివృత్తియంతదా। మిగుల గనందియంబుడి
గి మేలుగనుంగొనియుంటమోదమా.॥

అనెడు కైవల్యనవనీత ప్రకారమీమాయావస్థలను

పదింటివిదృష్టాంతముగ దెలియ జేయుటకు ఒక్క విచిత్రమైన చరిత్రముగలదదేమనగా, పదుగురు బాటసారులు, నిండిపారుచున్న ఒక్క యేటిని దాటిగట్టుచేరిరి. వారిలో నొక్కడు పదుగురును గట్టు చేరిరో లేక నీటిలో గొట్టుకొని పోయిరో యనెడి యనుమానము చేత దన్ను మాని తక్కిన వారిని, లెక్కపెట్టి తొక్కొని యొక్కడు లెక్కకుతక్కువని ప్రక్కలెగయ వెక్కి వెక్కి పొక్కసాగెను. పదియవ వాడైన, తన్నుదా నెరుగకపోవడమే అజ్ఞానము, ఇచ్చటచూడ పదియవవాడు లేడనుటే ఆవరణము. ఆపదియవాని కొరకై శోకించుటే విక్షేపము, ఒక్క బాటసారి ఆపదియ వానిచేష్టను చూచి పదియవవాడున్నాడని పలుకుటే పరోక్షజ్ఞానము, ఆబాటసారిఆపదుగురును వేఱువేఱుగా లెక్కబెట్టి నీవుపదియవవాడవని చెప్పి చూపగా దన్నుదా దెలియుటయే అపరోక్షజ్ఞానము, వెనుక తన్నుతా నెరిగి శోకముడుగుట యేదుఃఖనివృత్తి, పిమ్మట దృఢప్రజ్ఞచేత సందేహముడిగి యూరకుండుటయే ఆనందమగునని తాత్పర్యము.

సర్వసాక్షియేనీవు నీవేసర్వసాక్షియనుట.

శ్రు॥ జ్ఞాతృజ్ఞానజ్ఞేయానాదావావిర్భావతిరోభావజ్ఞాతా స్వయం। తదావిర్భావతి రోరహిత, స్వయంజ్యోతిశ్చేతన సాక్షి॥ అనెడిసర్వసారోపనిషత్తురీతిగాజ్ఞాతృజ్ఞానజ్ఞేయముల

నెడిత్రిపుటియొక కాలమందుదోచుచుమరియొక కాలమందు దోచకపోవును, అట్లులేక అవస్థాత్రయమందున్న స్వయం జ్యోతియైనాశరహితమై సర్వవిషయములను, యేజ్ఞానస్వ రూప మెరుగుచున్నదో ఆవస్తువే సాక్షియని చెప్పబడును. అట్టిసాక్షియే ఆత్మయనియు, నదేనీవనియుజెప్పబడును. మఱియు॥ శ్రుతి॥ నాహంకర్తానైవభోక్తాప్రకృతేస్సాక్షిరూ పతః। మత్సాన్నిధ్యాత్ప్రవర్తంతేదేహాద్యా అజడాఇవ। స్థాణున్నిత్యస్సదానందశ్శుద్ధో జ్ఞానమయోమలః। ఆత్మా హంసర్వభూతానాం విభుస్సాక్షీనసంశయః॥ అనెడిసర్వసా రోపనిషత్తురీతిగా, కర్తగాను, భోక్తగాను, ప్రకృతికంటె నువేరైనవాడను, దేహేంద్రియములు జడపదార్థములు గానుండినను, కేవలజ్ఞానస్వరూపుడగు నాసత్తామాత్రము చేత, నాసన్నిధానము నాశ్రయించి, దానిదానికార్యము లజేయుచుండును, నేనచలస్వరూపుడను, నిత్యుడను, సదానందుండను, మరలహితుడను, జ్ఞానస్వరూపుడను, నేనుసర్వభూతములకువిభుండును, సాక్షిమాత్రుడను,సంధి యము లేదు॥ శ్రుతి॥ సర్వసాక్షిణమాత్మానం వర్ణాశ్రమ వివర్జితం బ్రహ్మరూప తయాపశ్యన్ బ్రహ్మైవభవతి స్వ యం;, "త్రిధామసాక్షిణంసత్య జ్ఞానానందాది లక్షణం। త్వమహంశబ్ద లక్ష్యార్థమసక్తం సర్వదోషతః" = సర్వ సాక్షిగాను, వర్ణాశ్రమధర్మములు లేనిదిగానున్న ఆత్మను

బ్రహ్మస్వరూపముగా జూచువాడు బ్రహ్మమేయగును. అవస్థాత్రయములకుసాక్షియై, సత్యజ్ఞా నానందలక్షణము లుగలదై' నీవు నేననుపదములకు లక్ష్యార్థమైన సర్వదోష రహితమైయుండునదే బ్రహ్మము.వరాహోపనిషత్తు. ॥శ్లో॥ అంతఃకరణతద్వృత్తిసాక్షిచైతన్యవిగ్రహః। ఆనందరూప సత్యస్సన్ కిన్నాత్మానంప్రపద్యసే,, = అంతఃకరణములకు న్ను వాటికార్యములకున్ను సాక్షియై, చైతన్యమై, ఆనం దరూపమై, సత్యమై, సన్మాత్రమునై' ఆత్మ వెలుగుచున్న ది. అని శ్రీశంకరభగవద్పాదాచార్యులున్ను, మఱియు.

శా॥ ధీచేతో విషయాత్మకంబులగు జ్ఞాతృజ్ఞాన విజ్ఞే
యముల్। సూచించుండగదల్ల యోదయములన్
సుప్తిప్రభోదంబులే। నాచిత్రంబులవాని జేయనిజ
మాయన్ సాక్షినై చూచుచున్। రోచిష్ణుత్వముచే
వసింతువదస ద్రూపాతిరిక్తంబుగాన్. ॥సీతారా
మాంజనేయము.

గీ॥ అఖిలవ్యవహారుడతడెజీవాత్ముడంత। రాత్మసంసా
రమున నంటియంటకుండ। యలరుజీవాత్మపరమా
త్మ యంతరాత్మ।వ్యావహారికసాక్షియానతడెభూ
ప॥ శ్రీరామస్తవం॥

చ॥ తనువులు మూడుదద్దశలుదద్దశద్రష్టలుగాలకృత్య
ముల్। చనుబలుమాఱుదోచియిలసాగరమంచల

ట్లుహానినే। మనిరెుత్తిగింతు మున్నరుడు మఱ్ఱిస
మీపమునందు దక్షిణా। ననుడయి తెల్పు శాసనము
నమ్మివెలుంగుముసర్వసాక్షివై.॥

అనెడికైవల్య నవనీతముప్రకారము, సముద్రమునందు అలలు మొదలగునవి పుట్టి నశించుచున్నట్టుగానే, పరబ్రహ్మమందు వ్యష్టి సమష్టి స్వరూపులైన జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును, ఆయవస్థల యందుగల జీవులు విశ్వతైజస ప్రాజ్ఞనామములును, ఈశ్వరునివిరాట్టిరణ్యగర్భావ్యాకృతనామములును, భూతభవిష్యద్వర్తమాన కాలముల యందు గలిగెడుఉత్పత్తిస్థితిలయాదులనెడిసకలజగద్వ్యాపారములును, గలుగుచు మలుగుచునుండును. పూర్వము సనకసనందనాది మునీంద్రబృందములకు దక్షిణామూర్తిలీలను వహించినపరమశివుడు మఱ్ఱిచెట్టుక్రిందగూర్చుండి బ్రహ్మతత్త్వమును జెప్పక నేజెప్పుటయను మౌనముద్రను పూనిజీవభావముగల నీవే పరబ్రహ్మమనెడి అర్థమును బోధించు చిన్ముద్రను జూపియామాత్రముచేనా పరిపక్వులగు మునిశ్రేష్ఠులసందియంబులబాపి కృతకృత్యుల జేసెను॥ ఇందుకను గుణశ్లోకంబు. చిత్రంవటతరోర్మూలే వృద్ధాశ్శిష్యాగురోర్యువా, గురోస్తుమౌనం వ్యాఖ్యానం, శిష్యాస్తుఛిన్నసంశయాః॥ అనునటుల నేక శ్రుతిస్మృతులు గలవు.

## మహావాక్యలక్ష్యార్థమునం దేవిధ భేదము లేదనుట.

శ్రుతి॥ ప్రజ్ఞానంబ్రహ్మ,అహంబ్రహ్మాస్మి,తత్త్వమసి,అయమాత్మాంతర్యామ్యమృతః, అహంబ్రహ్మాస్మీతిమహావాక్యైః ప్రతిపాదితమర్థంతవ తేమంత్రాః ప్రతిపాదయంతి,,॥ అనెడిహయగ్రీవోపనిషత్ మేరకు,ప్రజ్ఞానమేబ్రహ్మం, నేను బ్రహ్మమైయున్నాను,అదినీవై యున్నావు, ఈఆత్మ అంత ర్యామిగానున్న, అమృతుడు గానున్నాడు, నేనే బ్రహ్మమైయున్నాను; అనుమహావాక్యములచేత బైలగు అర్థములను ఈమంత్రములు బైలుపరచుచున్నవి. శ్రుతి॥ ఏకమేవాద్వయంబ్రహ్మనేహనానాస్తికించన, స్వానుభూత్యా స్వయంజ్ఞాత్వాస్వమాత్మాన మఖండితం। ససిద్ధస్సుఖంతిష్ఠన్నిర్వికల్పాత్మనాత్మని॥ అనెడిఅధ్యాత్మోపనిషత్తుమేరకు,బ్రహ్మమొకటే, రెండవది లేదు. ఇచ్చటఅనేకమనునది లేదు. స్వానుభూతిచేతనఖండమైతనఆత్మను తానై యెరిగిన,ఆసిద్ధిబొందినవాడై,తనయందేవికల్పములేనిఆత్మగానె సుఖమైయున్నాడు.మఱియు॥శ్రుతి॥సూక్ష్మాత్సూక్ష్మతరం నిత్యం తత్త్వమేవత్వమేవతత్ ,, సూక్ష్మమందతి సూక్ష్మమై, నిత్యమైయున్న పరబ్రహ్మమెదియోఅదినీవు, నీవేయది యనికైవల్యోపనిషత్తున్ను. ॥శ్రుతి॥ సఏవహిపరంబ్రహ్మతద్బ్రహ్మాహంనసంశయః। జీవశ్శివశ్శివోజీవస్సజీవఃకేవలశ్శివః। తుషేణబద్ధో వ్రీహిస్స్యాత్తుషాభావేతుతండులః। ఏవంబద్ధస్తథాజీవః కర్మనాశేసదాశివః। సోహంభావేన

పూజయేత్ అభేదదర్శనంజ్ఞానం,, వాడేపరబ్రహ్మం, ఆబ్ర హ్మము నేనే, సంశయము లేదు, జీవుడే శివుడు; శివుడే జీవుడు; యాజీవుడె శివుడగును. పొట్టుచేగట్టుబడినప్పుడు వడ్లయియున్నది; పొట్టువిడినప్పుడు బియ్యముగానున్నది; అదేలాగు జీవుడు బంధము చేగట్టుబడియున్నాడు, బంధనాశమందు శివుడై యున్నాడు. ఆశివుని తానను భావనచేపూజింపవలయును; అభేదముగాజూచున దేజ్ఞానమనియు. స్కాందోపనిషత్తును. ‘‘ త్వంబ్రహ్మాస్మి, అహంబ్రహ్మాస్మి, ఆవయోరంతరం నవిద్యతే, త్వమేవాహం అహమేవత్వం, ఇత్యభిధాయెత్యుక్త్వాదినారాయణ స్తిరోదధే,, = నీవుబ్రహ్మముగానువ్నావు, నేనుబ్రహ్మముగానున్నాను; మనమిరువురకును భేదము లేదు. నీవేనేను; నేనే నీవు; ఈలాగు జెప్పియాదినారాయణు డుమరిగెనని, మహోనారాయణోపనిషత్తున్ను. ॥శ్లో॥ యథాజలం జలేక్షిప్తంక్షీరే క్షీరం ఘృతేఘృతం।అవిశేషోభవే త్తద్వజ్జీవాత్మాపరమాత్మనోః = జలమందు జలంబును, పాలునందు పాలును, నేయియందు నేయియును గలుపగానెటుల భేదము గనపడక యేకీభవించునో, యావిధంబున నే అవిద్యోపాధ్యుక్తుండగు జీవాత్మకును బరమాత్మకును భేదంబుగానంబడినను, నాజీవునికి యాయవిద్య సత్సంస్కారవిశేషంబుచేని వర్తియైనపుడు పరమాత్మతోడ నేకత్వము సిద్ధించుచున్నది. అని ఈ తరగీతయందును, మఱియును.

చ॥ మతితత్త్వంపదవాచ్యములద్దొరగనన్మానింపలక్ష్యా ర్థముల్, తరతల్లక్ష్యయుగంబునేకమనియాత్మన్భా సిలంజేసినం, తతమద్వైతముజూపుదానసిపధార్థం బెంతయుంగాననా, శ్రుతివాక్యార్థయథార్థము న్గనుమునీ శుద్ధాంతరంగంబునన్॥

చ॥ కలశఘనాంబు పూరముల ఖంబులసత్యములైతనర్చుద, త్కలశఘనాం బరంబులకు గల్గదు భేదముజీవుడీశ్వరుం, డలరుననత్యుడైయటుల నాత్మజస్వాత్మపరాత్మలేకమా, దలపశివోహ మంచచలధర్మముజెంది వెలుంగు మెంతయున్.॥

అనెడికైవల్యనవనీతమురీతిగా, సామవేదమహా వాక్యమగు తత్త్వమసి యందలితత్త్వం పదములకు వాచ్యార్థములై స్థూలశరీరాదులతోగూడిన ఈశ్వర జీవభేదములు తొలగునట్లు తత్త్వంపదములకు లక్ష్యార్థములగు పరమాత్మ ప్రత్యగాత్మలు ఉపాధిరహితులగుటవలన వారల విడువక జహదజహల్లక్షణముచేత బ్రహ్మమేకూటస్థుడు, కూటస్థుడే బ్రహ్మమనెడు అఖండైకరసమగు అద్వితీయ పరబ్రహ్మమును అసిపదార్థము చూపించును, గనుక ఆయథార్థమును నీపరిశుద్ధాంతః కరణమందు తెలిసుకొనుము. కడవలోని జలమందును మేఘములోని జలమందును ప్రతి బింబించిన ఆకాశములసత్యములగును. కుండ

కును మేఘమునకును వెలుపల లోపలనుండెడి ఆకాశ ములు రెండునుగల్పితములుగానందునఎల్లప్పుడునొక్కటే యగును. ఆతీరున నేలఅవిద్యయందునుమాయయందును, బ్రహ్మఛాయ చేత ప్రతిబింబింపబడిన జీవుడును ఈశ్వరుడును అసత్యమగుదురు. జీవసాక్షియైన ప్రత్యగాత్మయును ఈశ్వరసాక్షియైన పరమాత్మయును నిత్యులై (ఏకులై) ఐక్యమగుదురు కాబట్టి అట్టి ఐక్యభావమునుబొంది నేనే పరబ్రహ్మమని నిశ్చలుడవై యుండుమని తాత్పర్యము.

మఱియును-ఘటమువంటిది జీవస్థూల శరీరము, మేఘమువంటిది యీశ్వరస్థూల శరీరము, ఘటమందలి జలమువంటిది జీవాంతఃకరణము, మేఘమందలి జలమువంటిది యీశ్వరాంతఃకరణము-ఘటజలమందలి అడుసువంటిది జీవావిద్య. మేఘజలమందలి అడుసువంటిది యీశ్వరమాయ, ఘటజలమందు ప్రతిబింబించిన ఆకాశమువంటివాడు జీవుడు, మేఘజలమందు ప్రతిబింబించిన ఆకాశమువంటివాడుయీశ్వరుడు. ఘటమందలిజలముచలించునపుడుఆజలప్రతిబింబమును చలించునటుల, జీవాంతఃకరణముచలించునపుడుకించిత్ జ్ఞత్వాదిజీవగుణములును, మేఘమందలిజలమ్ముచలించునపుడుఆజలప్రతిబింబమగుఆకాశమునుచలించునట్లు, ఈశ్వరాంతఃకరణముచలించు నపుడుసర్వజ్ఞత్వాదియీశ్వరగుణములును గలుగును. ఎట్లావునకును

నల్లావునకును శరీరములును అవయవములును గుణములును భేదములై యుండుటచేత నైక్యము కలుగక ఎఱ్ఱావునల్లావుపాలువర్ణములును మాధుర్యములును సమముగ గలవియైనందున ఐక్యములు కలిగినట్లుగాను జీవేశ్వరులకు శరీరములును గుణములును మొదలగునవి భేదములై యుండుట చేత నైక్యము కలుగక జీవసాక్షియగు తత్పదలక్ష్యార్థమైన పరమాత్మకును, సచ్చిదానందనిత్య నిర్మలతమనెడు పంచలక్షణములు సమముగ గలిగియుండుట చేత నైక్యము కలిగెనని మహావాక్యార్థ ముఖ్యాభిప్రాయము నెరుగవలయును.

## చతుర్విధమహావాక్యార్థవివరణము.

పరబ్రహ్మమును దెలియజేయునవియై పరబ్రహ్మము వలన గలిగినవియై ప్రకాశించు నాలుగు వేదములలో ఋగ్వేదమందు,, ప్రజ్ఞానం బ్రహ్మ,, అనెడు సాక్షాత్కార మహావాక్యమును, యజుర్వేదమందు ‹‹అహం బ్రహ్మాస్మి›› యనుఅనుభవమహావాక్యమును, సామవేదమందు, ‹‹తత్త్వమసి›› యనుఉపదేశమహావాక్యమును, అధర్వణవేదమందు ‹‹అయమాత్మాబ్రహ్మ›› యనుసమాప్తి మహావాక్యమునుగా నాలుగు మహావాక్యములుగలవు, ఈనాలుగుమహావాక్యములే నాలుగువేదములు గనుక ఆవేదములను ఆధారము చేసుకొని యీవాక్యార్థములను విచారించెదు

ముముక్షువులకు చిత్తశుద్ధి గలుగుటకు కర్మకాండను, గురువులయందును జ్ఞానశాస్త్రములయందును, నమ్మకము కలుగుటకొరకు భక్తికాండను, బ్రహ్మసాక్షాత్కారజ్ఞానముకొరకు జ్ఞానకాండను, యిటుల మూడుకాండలొక్కొక్క వేదమునకు గలిగి నాలుగు వేదములు ప్రత్యేకములుగా విస్తరింపబడెను.

వేదములు నాలుగుగానుండక ఐదుఆఱు నూఱుగాగాని లేక ఒక్కటిగాగాని ఉండరాదా యనిననొకవాక్యమందే వేదపురుషుని యభిప్రాయమంతయును ముగియునందున దొలుత ఋగ్వేదమందు, ప్రజ్ఞానంబ్రహ్మ, యను సాక్షాత్కార వాక్యమును నిరూపించి దానిచేత ననుభవము కలుగనందునయజుర్వేదవాక్యమగు, అహంబ్రహ్మాస్మి, యనుమహావాక్యముచేత ననుభవమునుజూపెను, ఆయర్థము జక్కగా దెలియుటకు మూడవదియగు సామవేదమందలి, తత్వమసి, యను మహావాక్యముచేత నుపదేశక్రమమును దెలిపెను. అదేసంపూర్ణమని సమాప్తినిపొందుటకు అధర్వణవేదమందు, అయమాత్మాబ్రహ్మ, మను మహావాక్యము జనించెను గనుక వేదములు అనేకములుగాక నాలుగేఅయ్యెను,

## తత్త్వమసిమహావాక్యార్థము.

ఇటి నాలుగు మహావాక్యములలో ఉపదేశమహావాక్య

మైన, తత్త్వమసి, యనుదానియందు, తత్పదమని, త్వంపదమని, అసిపదమని, మూడుపదములుగలవు, వీని యందు అదియనెడి అర్థముగల తత్పదమునకు, వాచ్యార్థమని, లక్ష్యార్థమని, రెండుగలవు, వానిలో వాచ్యార్థమనగా మూలావిద్యా స్వరూపమగు మాయయందు బరబ్రహ్మచ్ఛాయ ప్రతిబింబితుడైనయీశ్వరుడును, వానిస్థూల సూక్ష్మ కారణశరీరములను, జాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలను, ఆయవస్థలయందుగల అన్నమయప్రాణమయ మనోమయ విజ్ఞానమయ ఆనందమయకోశములును, ఆకోశములయందు అభిమానములుగల విరాట్టు, హిరణ్యగర్భు, డవ్యాకృతుడు, అనెడునామములును, సర్వజ్ఞత్వాది గుణములును గూడితత్పదవాచ్యార్థము. వీనికన్నిటికినివిలక్షణమై సత్యజ్ఞానానంద నిత్యనిర్మలత్వములుగల పరమాత్మ, తత్పదలక్ష్యార్థము, నీవనెడుఅర్థము గలత్వంపదమునకు వాచ్యార్థమని లక్ష్యార్థమని రెండు గలవువానిలో వాచ్యార్థమనగాతూలావిద్యా స్వరూపమైన అవిద్యయందు ప్రతిబింబించిన బ్రహ్మచ్ఛాయా స్వరూపుడైన జీవుడును, వానిస్థూలసూక్ష్మకారణశరీరములు, ఆశరీరములయందుగలజాగ్రత్స్వప్నసుషుప్త్యవస్థలును ఆయవస్థలయందుగల అన్నమయ ప్రాణమయమనోమయ విజ్ఞానమయ ఆనందమయ కోశములయందభిమానములుగల విశ్వ

తైజసప్రాజ్ఞనామములును, కించిత్ జ్ఞత్వాదిగుణములును కూడితత్వంపదవాచ్యార్థము, వీనికన్నిటికిని విలక్షణుడైన ప్రత్యగాత్మ త్వంపదమునకు లక్ష్యార్థము. ఎఱ్ఱావునకును నల్లావునకును ఐక్యము కూడనట్లు ఉభయవాచ్యార్థముల కును ఐక్యముసంఘటింపదు. ఎఱ్ఱావుపాలకును నల్లావుపా లకును ఐక్యముకలుగునట్లు ఉభయ లక్ష్యార్థములకును ఐక్యముకలుగును.

## (జహల్లక్షణము.)

పండితులు జహల్లక్షణము, అజహల్లక్షణము, జహద జహల్లక్షణమనెడుమూడు లక్షణములను గ్రహించి శ్రుతి స్మృతుల యందలి శబ్దములకు అర్థములను నిర్ణయించు నపుడు ఎక్కడఏలక్షణముపయోగమో అక్కడ నాల క్షణమునుపయోగించి నిజమైన అర్థమును దెలిసికొం దురు. వాచ్యార్థమునునంగీకరించినచోట ప్రత్యక్షవిరో ధము తోచినపక్షమున అక్కడ లక్ష్యార్థమును నంగీకరిం పవలయును. ఎట్లనగా, గంగాయాంఘోషః ప్రతివసతి. అనెడు వాక్యమందు గంగాజలమందు గొల్లపల్లె ఉన్నద న్నయెడల ప్రత్యక్షవిరోధముగనుక, గంగాజల ప్రవాహ ములను విడిచి తీరమున గొల్లపల్లెయున్నదని యెంచవలె ను. ఇదే జహల్లక్షణము. అనగా విడిచినలక్షణము.

(అజహల్లక్షణము.)

మంచాః క్రోశంతి, కుంతాః ప్రవేశంతి, శోణోధావతి నీలోధావతి, అనువాక్యములయందు, మంచలు అఱచు చున్నవి, ఈటెలుపోవుచున్నవి, నల్లనియెఱ్ఱని టెక్కెములు పోవుచున్నవి, అనుటయందు మంచలఱవనేరవు, ఈ టెలుపోడువనేరవు, ఎఱ్ఱనినల్లని టెక్కెములు పోనేరవు, గనుక మంచలనువిడువకనే మంచలమీఁదనున్నవార అఱచుచున్నారు, ఈటెలను విడువకనే ఈటెలబట్టుకొ న్నవారు పోవుచున్నారు, ఎఱ్ఱనినల్లనిధ్వజములను విడు వకనే వానినిబట్టుకొన్నవారుపోవుచున్నారనుట, అజహ ల్లక్షణము. అనగా విడువనిలక్షణము.

(జహదజహల్లక్షణము.)

సోయందేవదత్తః, అనెడువాక్యమునకు ముందొక దే శమందొక కాలమున, నొకవయస్సున, నొకరూపమున, నొకవ్యాపారమున నున్నయొకపురుషుని మఱియొకడుచూ చివిమ్మట బహుకాలము జరిగినవెనుక నాపురుషునినే మరి యొకదేశమందు మఱియొక వ్యాపారమును జేయునపుడు చూచిమునుపుచూచిన జ్ఞప్తిచేత నాలోచించి వానితో మాటలాడి ఆదేశమును ఆకాలమును ఆవయస్సును ఆవే షమునుఆరూపమును ఆవ్యాపారమును, ఈదేశమును ఈ కాలమును ఈవయస్సును ఈవేషమును ఈరూపమును ఈ

వ్యాపారమును వదలి ఆపురుషునివదలక ఆపురుషుడే యీ పురుషుడని ప్రత్యక్షముగా దెలియుట జహదజహల్లక్షణము యనగా వదలీవదలని లక్షణమని యెరుగవలయు.

(లక్షణత్రయములకుద్రాష్టాంతములు)

జహల్లక్షణమునకు ద్రాష్టాంతమెట్లనగా, స్థూలసూక్ష్మకారణదేహములను, వానియందలి జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలును, వానియందలి అన్నమయాది పంచకోశములును, విశ్వతైజస ప్రాజ్ఞనామములును, అవిద్యాకల్పితములౌటవలన నశించునవి, ఆత్మనశింపనిది కనుక దేహేంద్రియాదులె యాత్మయనుట ప్రత్యక్షవిరోధముకాబట్టిఆదేహేంద్రియాదులను వదలివీనికి విలక్షణముగపరమాత్మయున్నాడనుట జహల్లక్షణము, ఈజహల్లక్షణము న నంగీకరించిన యెడల ఉపాసకుడును ముముక్షువును లేకపోవుచున్నారుగాన నందునిమిత్తము ఆజహల్లక్షణముసుగ్రహింపవలయును.

అజహల్లక్షణమనగా, ఈదేహేంద్రియాదులతోడ జీవుడైనతాను తనకుపాస్యుడైన యీశ్వరుని - మాయాకల్పితములైన స్థూలసూక్ష్మకారణదేహములను, జాగ్రత్స్వప్న సుషుప్త్యవస్థలను, జ్ఞానేంద్రియ కర్మేంద్రియఅంతరింద్రియములైన సూర్యాదిదేవతలను, అన్నమయాదికోశములను, విరాట్ హిరణ్యగర్భ అవ్యాకృత నామములను,

వానికిరీట మకర కుండలాది భూషణములను, వస్త్రములను పుష్పహార చందనాదులను, వానివిచిత్రచరిత్ర ములను, విడువక అపరోక్షజ్ఞానము కలిగెడువరకు, నవవిధములైన అంగములు గలత్రివిధ భక్తులచేత అరాధించుచు స్తుతించుచుండుటయేఅజహ ల్లక్షణము.

జహదజహల్లక్షణమనగా, ఏకమేవాద్వితీయంబ్రహ్మ, నేహనానాస్తికించన,బ్రహ్మమాత్రమసన్నహీతి, పురుషాన్నపరంకించిత్, పురుషయేవేదగ్ంసర్వం, సర్వంఖల్విదంబ్రహ్మ, సత్యంజ్ఞానమనంతంబ్రహ్మ, అను శ్రుతులనుపట్టి నిర్మలాంతఃకరణుడై పరోక్షజ్ఞానము నశింపగానేసాధన చతుష్టయ సంపన్నుడై సద్గురునివద్దజేరి తత్త్వమస్యాదిమహావాక్యశ్రవణ మనననిదిధ్యాసములచేత లభించిన పూర్ణాపరోక్షజ్ఞానముగలవాడగుచు అవిద్యాకల్పితములైనజీవశరీరాదులను, మాయాకల్పితములై యీశ్వరశరీరాదులనువిడిచి, జీవసాక్షియైన ప్రత్యగాత్మను, ఈశ్వరసాక్షియైన పరమాత్మను, విడువక [illegible] ప్రకాశమైన [illegible] ప్రత్యగాత్మయే తత్పదలక్ష్యార్థమైన పరమాత్మ, ఆపరమాత్మయే ప్రత్య[illegible] నియెఱింగి హాయిగానుండుటే జహదజహల్లక్షణము.

(ప్రజ్ఞానంబ్రహ్మ, అనుటకర్థము.)

ప్రజ్ఞానంబ్రహ్మ అనుపదముఋగ్వేదమందలి సాఖా

త్కారవాక్యము, ఈవాక్యమందు ప్రజ్ఞానం బ్రహ్మ, అని రెండుపదములుగలవు, వానిలో ప్రజ్ఞానశబ్దమున కర్థము.
శ్లో॥ ఏనేతక్షతేశృణోతీదంజిఘ్రతీవాకరోతిచ। స్వాద్వస్వాదువిజానాతి తత్ప్రజ్ఞానమితీర్యతే॥ తా॥ స్వాధిష్ఠానచిదాభాసుడైన జీవుడుకన్నులనుండి బయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడి అజ్ఞానమువలన నలుపుతెలుపు మొదలయిన వానిని ఎఱుగుచున్నాడో, చెవులనుండి బయలుదేఱిన అంతఃకరణవృత్తితోగూడి యేజ్ఞానమువలన సకల శబ్దములను వినుచున్నాడో, ఘ్రాణేంద్రియమునుండి బయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడి కొనియేజ్ఞానమువలనత్రివిధ గంధములనెఱుగుచున్నాడో, వాక్కునుండి బయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడి యేజ్ఞానమువలన మాటలాడుచున్నాడో, నాలుకనుండి బయిలుదేఱిన అంతఃకరణవృత్తితోగూడి యేజ్ఞానమువలనఉప్పుపులుసువగరుకారము మొదలగువాని నెఱుగుచున్నాడో, మఱియును నోరుచేయిమొదలైన సకలేంద్రియములనుండిబయలుదేరిన అంతఃకరణవృత్తితోగూడిబాహ్యాంతరసర్వవిషయములనెఱుగుచున్నాడో అజ్ఞానమే ప్రజ్ఞానమనుపదమున కర్థము.

బ్రహ్మపదమునకు అర్థమేమనగా, శ్లో॥ చతుర్ముఖేంద్రదేవేషుమనుజాశ్వగజాదిషుచైతన్య మేకంబ్రహ్మాత్మాప్రజ్ఞా

నంబ్రహ్మామేద్యపి॥ తా॥ చతుర్ముఖబ్రహ్మ మొదలయిన దేవ తలయందును కలసి యేచైతన్యమున్నదో ఆచైతన్యమే బ్రహ్మమను పదమునకు లక్ష్యార్థము. బ్రహ్మపదమునకుబ్ర హ్మ మొదలు తనశరీరపర్యంతమైన సకలశరీరములును వా చ్యార్థమును ద్రోయగామిగిలిన పరబ్రహ్మస్వరూపమే నా యందును నీయందును సర్వమందుండెడి ప్రజ్ఞానమనెడి చైతన్యము, అదియేబ్రహ్మస్వరూపము. చైతన్యమని,ప్రజ్ఞా నమని, బ్రహ్మమని, ఆత్మయని, పేళ్ళుమాత్రమే వేఱుగాని వస్తువొకటేకనుక నేనేబ్రహ్మమని నిశ్చయించుకోనుము. ఇదిప్రజ్ఞానము బ్రహ్మస్వరూపమని వాక్యార్థము.

(అహంబ్రహ్మాస్మి మహావాక్యార్థము.)

అహంబ్రహ్మాస్మిఅనెడి యజుర్వేదమందలి అనుభవ మహావాక్యమునకు అర్థమెట్లనగా, అహం, బ్రహ్మ, అస్మి, యనిమూడు పదములు వీనిలో, అహంపదమునకు॥ శ్లో॥ పరిపూర్ణపరాత్మాస్మిన్ దేహేవిద్యాధికారిణా। బుద్ధేస్సా క్షిత యాస్థిత్వాస్ఫురన్నహ మితీర్యతే॥ తా॥ సర్వత్ర పరిపూర్ణమైన పరమాత్మ బ్రహ్మవిద్యకు యోగ్యమైన యీశరీరమందు బుద్ధికిసాక్షిగానుండుచు స్ఫురించుచున్న అహమనెడి పదము లక్షణావృత్తిచేత జెప్పబడుననిన అహ మను నప్పుడు చైతన్యము నిర్వికారము గనుక అహమన నేరదు, అహంకారము జడము గనుక అహమనిలో వ

నేరదు, పరమాత్మ స్వరూపమైనచైతన్యమేఅహంకారము తోగూడి అహమని స్ఫురించుచున్నది. కాబట్టి జడమైన అహంకారమును వదలి చైతన్యమాత్రమె అహమనెడి పదమునకు అర్థమని యెఱుగుము.

బ్రహ్మ మనెడు పదమునకు అర్థమేమనగా ॥ శ్లో ॥ స్వతఃపూర్ణపరాత్మాత్ర బ్రహ్మశబ్దేవినిర్మితః । అస్మీత్యైక్య పరామృశ్య తేన బ్రహ్మతదామ్యహం ॥ తా ॥ తనకుతానే పరిపూర్ణమైన పరమాత్మ, యీమహావాక్యమందు బ్రహ్మ మనెడి పదమునకు లక్ష్యార్థము. ఏకారణమునుబట్టి సర్వత్ర పరిపూర్ణుడై యుండెడిఆత్మ పరబ్రహ్మమో యాకారణమువలననే బుద్ధికిసాక్షియై యుండెడి నేనే పరబ్రహ్మ మైతినని అస్మియనెడు పదముచేత ఐక్యమును ప్రతిపాదించుచున్నది గనుక నీవునట్లనే బుద్ధికి సాక్షివై యుండుటచేత నేనే పరబ్రహ్మమని నిశ్చయించుకొనుము.

(అయమాత్మా బ్రహ్మ, అనుమహావాక్యార్థము.)

అయమాత్మా బ్రహ్మ, అనెడి అధర్వణమందలి సంపూర్ణమహావాక్యమునకు అర్థమేమనగా, అయం, ఆత్మా, బ్రహ్మ యనుమూడు పదములుగలవు వానిలో అయంఅనెడి పదమునకు ॥శ్లో॥ స్వప్రకాశాపరోక్షత్వం అయమిత్యుక్తితోమతం। అహంకారాది దేహాంతాత్ ప్రత్యగాత్మేతి

గీయతే ॥ తా ॥ అయమనెడి పదముచేత స్వవశమై నిత్యాపరోక్షమైయుండునది యీయాత్మ యేయని చెప్పబడుచున్నది. అహంకారము మొదలు స్థూలదేహ పర్యంతమును నాయహంకారము నాదేహమని యెఱిగెడి చైతన్యమే ప్రత్యగాత్మరూపము. ఇందుకర్థము, చూడబడెడి సమస్తమును బ్రహ్మమనెడి శబ్దముచేతను చెప్పబడిన లక్ష్యార్థము. జగదధిష్ఠానమైన బ్రహ్మమే స్వప్రకాశమైన యాత్మ, ఆయాత్మ స్వరూపమే తాను. ఇట్లని యీనాలుగుమహావాక్యములయందునునీవే బ్రహ్మము, బ్రహ్మమేనీవు, అని ప్రతిపాదించుచున్నది గనుక నీవే సచ్చిదానందస్వరూపమై అద్వితీయుడయినఆత్మస్వరూపుడవు. బ్రహ్మక్షత్రియ వైశ్యశూద్రాది వర్ణములు నీకులేవు, నీవసంగుడవు, కాలత్రయమందును నీవుజీవుడవు కానేరవు, గనుకనీకు ఆగామిసంచితములులేవు, అఖండైకరసమైసుఖస్వరూపమైన ఆత్మవునీవు. ఇట్లనిగురుండు హస్తస్పర్శముచేసి శిరస్సుపైని శ్రీహస్తమునిచ్చి పూర్ణానుగ్రహముచేయ నాశిష్యుడుబాహ్యాంతర ప్రపంచమును మరచి కొంతసేపు నిర్వికల్ప నిష్ఠయందుండి వెనుక కన్నులు తెఱచి గురురాయనిజూచి దిగ్గునలేచి గురుస్వాములకనేకసాష్టాంగ నమస్కారములుచేసి విజ్ఞాపనము చేయుచున్నాడు, స్వామినేను కృతార్థుడనైతిని, నాకు మోహనివృత్తి యయ్యెను పరమానంద భరితుడయితిని.

ఈనాలుగుమహావాక్యములను చదివివినినను అర్థమును వివరించినను జక్కగ వ్రాసినను, అట్టినరులు కృతార్థులగుదురని ఈకైవల్యనవనీతము చెప్పడము గాక తక్కినశ్రుతిస్మృత్యాదులును దీనిసేపలు తెలియుగుల నొడువుచున్నవి.

## అనుభవానందము జెందినాడనుట.

శ్రుతి॥ త్రిషుధామసుయద్భోజ్యం భోక్తాభోగశ్చయద్భవేత్ । తేభ్యోవిలక్షణస్సాక్షీ చిన్మాత్రోహంసదాశివః॥ అనెడికైవల్యోపనిషత్తుమేరకు, స్థూలసూక్ష్మకారణములనెడు మూడుస్థానములయందును, భుజింపదగినవి, భుజించువాడు, భోగమనునది యేవికలవో వానికన్యముగాను సాక్షిగాను చిన్మాత్రుడైయున్న సదా శివుడునేనేయనియును ॥ శ్రుతి ॥ మయ్యేవ సకలంజాతం మయిసర్వం ప్రతిష్ఠితం । మయిసర్వం లయంయాతి తద్బ్రహ్మాద్వయమస్మ్యహం॥ అనుప్రమాణము రీతిగా, నాయందే సకలముద్భవించును, నాయందే సకలమువుండును, నాయందే సకలమున్ను లయమవుతున్నది, ఆయద్వయబ్రహ్మము నేనే-మఱియును. ॥ శ్లో ॥ బ్రహ్మైవాహం సర్వవేదాంతవేద్యం । నాహంవేద్యం వ్యోమవాతాదిరూపం। రూపంనాహం నామనాహంనకర్మ। బ్రహ్మైవాహం సచ్చిదానందరూపం॥ నాహందేహో జన్మమృత్యూకుతోమే। నాహంకారః క్షుత్పిపాసేకుతోమె । నాహంచేత శ్శోక

మోహశోకుతోమే । నాహంకర్తాబంధమోక్షౌకుతోమే ॥
అనెడుసర్వసారోపనిషత్తురీతిగా, సకలవేదాంతములచేత
యెరుగబడుబ్రహ్మము నేనేయెరుగబడు ఆకాశము వాయు
వుమొదలగురూపములునేగాను, నేను రూపముగాను నా
మముగాను. కర్మముగాను, సచ్చిదానందస్వరూపమైన
బ్రహ్మమునేనె, నేనుదేహముగానుగాబట్టి నాకే జననమర
ణాదులెక్కడివి, నేనునహంకరముగాను నాకాకలిదప్పి
కలేవి, నేను మనసుగాను నాకుదుఃఖమోహము లెక్కడి
వి. నేగర్తనుగాను, నాకుబంధమోక్షములులేవు. అని
మునులకు అదృశ్యవాణి జెప్పెనుమఱియును. ॥ శ్రుతి ॥
అజ్ఞానమేవనకుతో జగతఃప్రసంగః జీవేశదేశిక వికల్పక
థారిదూరే । ఏకాంతకే వలచిదేకరసస్వభావే బ్రహ్మైవ
కేవలమహం పరిపూర్ణమస్మి ॥ అనెడి వరాహోపనిషత్తు
మేరకు, జీవేశ్వరగురువులనెడి భ్రాంతికల్పనా కథనము
లేక పోవుచుండగ్గా, అజ్ఞానమే లేనపుడు జగద్వ్యవహారం
బెక్కడిది, గనుక నిరతిశయకేవల యద్వితీయ అమృత
స్వభావంబైన పరిపూర్ణముకు కేవలపరబ్రహ్మమేనేనైతినని
భావము ॥ మఱియును ॥ శ్లో ॥ బ్రహ్మైవసర్వం నాన్యో
స్మి తదహంతదహంతథా । తదేవాహంతదేవాహం బ్ర
హ్మైవాహంసనాతనం ॥ అనెడు శ్రీఋభుగీతాప్రకారం ।
సర్వము బ్రహ్మమేను—నేనన్యుండగాను. అదినేను, అదినేను

అదేనేను, అదేనేను, నేననాదిగనుండు బ్రహ్మమేను, మఱియును.

చ॥ నిరతిశయానుభూతిసుఖనీరధి బూర్ణముగా మునిం
గి ప్రా। క్కరణ తనూముఖాఖిల వికారములెల్ల
నడంగజిత్సుఖో। త్కరహృద ఖండమైనతను
గన్గొనదత్పరి పూర్ణదేశికుం। డురుతర బోధ
సుస్థిగనై నూర్జిత భావముతోడనిమ్ములన్॥

అనెడు కైవల్యనవనీతము మేరకు, నేతినేతియనెడు మహావాక్యములచేత ఇది బ్రహ్మముకాదు ఇది బ్రహ్మము కాదని: అన్నిటిని ద్రోయగా గడపటనిలిచిన బ్రహ్మాభిన్న ప్రత్యగాత్మానుభవరూపమైన నిరతిశయానంద సముద్రమందు లెస్సగా మునిగిమునుపు అజ్ఞాన దశయందు తన స్వరూపముగానే గనుబడుచున్న పదునాలు గింద్రియముల వికారములైన రాగద్వేషాదులను, స్థూలసూక్ష్మకారణదేహముల వికారములైన జననమరణాదులను, నశింపగాను విజ్ఞానమువలన గలిగిన విద్యానందముతోగూడిన అంతఃకరణము పరబ్రహ్మాకారమై పరిణమింపగాను, అఖండపరిపూర్ణుడైన తన్ను సచ్చిదానంద స్వరూపుడైన ఆచార్యుడు కుతూహలముతో జూడగాను, శిష్యుడు నిర్వికల్ప నిష్ఠయందుండెనని తాత్పర్యము.

విఘ్నత్రయములచే బ్రహ్మజ్ఞానము స్థిరపడదనుట.

శా॥ అంతేవాసినుతింప నిక్కరణినయ్యాచార్యుడీక్షించి వే। చెంతంజేరగజీరి శిష్యునిసుఖాసీనుందగం జేసివి। శ్రాంతింబాపుట కంతరాయములుపు త్రామూడుభాసిల్లును। స్వాంతంబొప్పహరింప బూనినదెసత్సర్వోపకారంబగున్॥

మ॥ జపనిష్ఠాక్రియ తెల్పుడెవ్వియనన జ్ఞానంబుసందేహముల్। విపరీతంబనము త్రైలింగులగునావిఘ్నం బులాత్మీయని। ష్కపటజ్ఞానము మాయుబా యునవి యాకాశాభ్రములోవలెన్। విపులల్ సం శ్రవణాదులల్ సలుపని ర్వీర్యంబులై త్రుంగెడున్.

మ॥ అపిధానం బొనరించి జ్ఞప్తిగడుద్ర శ్యశ్రేణిగా వించునా। కపటంబైన యవిద్య నమ్మకగురూ క్తంబైనయర్థంబుహృ। చ్చపలంబొందిన సం దియంబుదనువే సత్యంబులోకంబనన్। విపరీతం బని పల్కుచుందురుమహావేదాంతవేద్యుల్సతా॥

అనెడికైవల్యనవనీతమురీతిగా, ఈవిధంబున గురువును గొనియాడగానాచార్యుడు శిష్యునిసంతోషముతో జూచి దగ్గరకురమ్మని పిలిచి కూర్చుండమని, ఓయినమూర్థిని భంగముచేయుంజాలు మూడువిఘ్నములుగలవు, మనస్సు

నిర్మలమై వెలుగుటకు వానిని నశింపజేయుమని బోధించ, ఓయిఆచార్యుడా మునుపుతాముచెప్పిన విఘ్నములనామ ధేయములను, వానిస్వరూపస్వభావములను, నవి తొలగు విధములను, తెలుపుమని శిష్యుడడుగగాగురువులు ఓయి శిష్యుడా యావిఘ్నములు అజ్ఞానము, సందేహము,విపరీతములని మూడుగలవు. అవిఆకాశమున బుట్టిన మబ్బులో నాకసము నేకమ్మి ఆయాకాశమునందు పుట్టినగాలివల్లనే నామబ్బులువెగరగొట్టబడినతీరున నీకుస్వస్వరూప విస్మృతి కలిగినప్పుడు నీయందుపుట్టిన నావిఘ్నములు నిన్నావరించి నీయందే కలిగిన వృత్తిజ్ఞానము ప్రబలినప్పుడావిఘ్నములు నిన్నువిడుచుచున్నవి. గురువులవద్ద సచ్ఛాస్త్రములను వినుటచేతను ఆవిన్నశాస్త్రవిషయములను చింతన చేయుటచేతను, నాచింతనచేసిన విషయములకు లక్ష్యార్థమైన పరబ్రహ్మమునందు మనస్సును నిర్వికల్పముగ నిలుపుటచేతను ఆవిఘ్నములు ఏపుచెడి రూపుమాయును-ఓయిశిష్యుడా దృగ్రూపమైన తెలివిని మఱుగుపరచి దృశ్యసమూహములను జూపించునది అజ్ఞానము. ఆచార్యోపదేశవాక్యార్థములను నమ్మక మనసున చంచలముగలిగి యుండుటసందేహము, అనిత్యమగుప్రపంచమును నిత్యమనుటయు, దేహము తాననుటయును విపరీతమని తాత్పర్యము.

## అసంభావనలక్షణము.

అసంభావనయనగా కటికి చీకటియందు దారినడుచు వాడు పుట్టమిట్టగుట్టచెట్టు మొదలగువానిని దెలియక నడుచుచుండునటుల నజ్ఞానమనెడి యంధకారమునదగిలి నామరూప జగత్తును, నాజగద్విలక్షణమైన పరబ్రహ్మమును ఎరుగక మూఢుడై యుండుటఅసంభావనయగును.

## విపరీతభావనలక్షణము.

విపరీతభావనయనగా నాచీకటిలో నడుచువాడు చెట్టు మోడునుజూచి చోరుడని భ్రమసినట్లు జగద్విలక్షణమైన బ్రహ్మమును దెలియక జగత్తును దానియందు దోచెడు నామరూపములతోగూడిన దేవనరాసుర తిర్యగాదులను సత్యములుగా దలంచుట విపరీతభావనయగును.

## సంశయ భావనలక్షణము.

సంశయభావనయనగా, ఆప్రకారము చెట్టుమోడును చూచి చోరుడని భ్రమపడి నడచుచుండ మఱియొక బాటసారి యెదురుపడి వానిభ్రమనువిని ఓయిపూర్వమిట్లనే భ్రమపడి నేనొక్కనివలన మోడుచెట్టాటనువిని దాపునకుబోయి శోధించినంతట మోడుచెట్టయ్యెనని చెప్పగావిని యును సంశయముతీఱునట్లు, సద్గురూపదిష్టమైన ఉపనిషత్ప్రమాణములచేత జగత్తును సత్యముకాదనియుపప

రోక్షజ్ఞానముచేతనద్వితీయపరబ్రహ్మము తాననియును తెలిసియును ఆబ్రహ్మమునే నాదునోకానోయని సంశ యించుట సంశయభావనయగును.

## శ్రవణమననాదులచేత విభ్రాంతిత్రయములు చెడి యాత్మజ్ఞానము స్థిరబడుననుట.

శ్రుతి॥ శ్రవణమనననిధిధ్యాసనాని నైరంతర్యేణ కృత్వాప్రారబ్ధక్షయాత్ । దేహత్రయ భంగంప్రాప్యోపాధి వినిర్ముక్తఘటాకాశవత్పరిపూర్ణతామేతివిదేహముక్తిస్సైవకైవల్యముక్తిరితి॥ అనెడిముక్తికోపనిషత్తుమేరకు, శ్రవణమనననిధిధ్యాసముల నెప్పుడునుజేసి ప్రారబ్ధక్షయము చేశరీరత్రయముల నాశముపొంది ఉపాధిలేని ఘటాకాశమువలెబరిపూర్ణత్వమును బొందుదురు .అదేవిదేహముక్తి, అదేకైవల్యముక్తియనియు।

మ॥ తగుతల్లింగవిధింగనన్ శ్రుతులకర్థంబుల్లద్వైతార్థమున్ । జగతిన్ శ్రద్ధవివంగడున్, శ్రవణమాస్వప్రజ్ఞజింతింపగా । దగులన్ సన్మననంబుదాని సునిధి ధ్యాసంబు తన్నిష్ఠచే । నగునీమూటవిముక్తి యాత్మజవిదేహాత్మాఖ్యలన్ భిన్నమై ॥

చ॥ వెదనుదయించుద్రిత్రిపుట లెందను కందగ నంతదాకనిన్ ॥ పొదవనొనర్పగావలయు నూర్జితుడై శ్రవణాదులంతనె । మ్మదిగనజేయలేదొకటి వూ

యలజెందక నింగి భంగిసం । ముదమున నిల్వ
ముక్తుడగు బొల్చిసదాన విదేహముక్తుడా.॥

అనెడు కైవల్యనవనీతముమేరకు - సకలవేదవేదాంతములకును ఉపక్రమము ఉపసంహారము మొదలైన షడ్విధలింగములనుగొని పండితులభిప్రాయములను గ్రహింతురు. జహదజహ జ్జహదజహల్లక్షణములచేత నాయభిప్రాయములను బరబ్రహ్మమందు సమన్వయముచేయు సద్గురువుల సన్నిధానమందు జీవబ్రహ్మైక్యానుభవమును వినుటయే శ్రవణమును, ఆవినిన యర్థమును సర్వకాలమును దీనిమనస్సునందా లోచించుటయే మననమును, ఆమననమువలన గలిగిన బ్రహ్మసాక్షాత్కారమను నిష్ఠజేయుటయేనిధిధ్యాసము నగును. ఈమూడు స్వాధీనముగాగలవాడు జీవన్ముక్తినివిదేహముక్తిని బొందుననియు, మఱియును.

అంతరత్రిపుటులైన జ్ఞాతృమనోబుద్ధి చిత్తాహంకారములనెడు అంతరేంద్రియముల వృత్తులును, మధ్యత్రిపుటులైన శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణము లనెడు జ్ఞానేంద్రియముల వృత్తులును, బాహ్యత్రిపుటులైన వాక్పాణిపాదపాయు గుహ్యములనెడు కర్మేంద్రియముల వృత్తులును, సర్వేంద్రియకారణములైన మనస్సునందెంతపర్యంతము పుట్టుచుండునో యంతపర్యంతమును, వేదాంతశాస్త్ర

శ్రవణాదులుతప్ప మఱియొకసాధనములేదు. నాలుగుభూతముల వలన నంటియును నంటకయున్న మింటివలెను మాయావికారములైన రాగద్వేష కామక్రోధాది దుర్గుణములనంటకస్వానుభూతికలిగి ప్రారబ్ధనాశ పర్యంతమును కాలినగుడ్డవలె లోకవ్యవహారములకు ఉపయోగింపక మహానందమునందోలలాడుచు నుండెనేని జీవన్ముక్తినిబొందును. ఆజీవన్ముక్తిసుఖముకలిగి వెలుగుచు మహావాయువుచేత నాకాలినగుడ్డ యెగిరిపోయి స్వరూపము కనబడనియటుల ప్రారబ్ధము మొదలంటచెడి జననమరణ శూన్యమైన విదేహముక్తిగలవాడగునని తాత్పర్యము.

## (షడ్విధలింగములవివరము.)

షడ్విధలింగమనగా, ఉపక్రమము, ఉపసంహారము, అభ్యాసము, అపూర్వత, ఫలము, అర్థవాదము, ఉపపత్తి యని లింగము లాఱువిధములు, వీనిలో ఉపక్రమమును, ఉపసంహారమునుగూడి,ఒక్కలింగము,తక్కిననాలుగునొక్కటొక్కటి, యొక్కొక్కలింగమగును.

## (ఉపక్రమ లక్షణము.)

ఉపక్రమమనగా, శ్రుతి॥ సదేవసోమ్యేదమగ్రఆసీత్,, ఏకమేవాద్వితీయం,, అనుశ్రుతిరీతిగా, సృష్టికిపూర్వము యీజగత్తు నామరూపరహితమైన సత్తామాత్రమైయుండెననియు, జెప్పుట ఇదే ఉపక్రమమనబడును.

## (ఉపసంహారలక్షణము)

ఉపసంహారమనగా,శ్రు॥ ఐతదాత్మ్య మిదంసర్వంతత్స త్యంసఆత్మా ॥తా॥ యీలోచునట్టి సమస్త జగతున్నా, మొందుజెప్పబడిన ఆసత్తుయొక్క స్వరూపంబె, అదే బ్ర హ్మము, అదేసత్యము, అదే ఆత్మయని పలుకుటయే ఉప సంహారమనబడును-ఈయుపక్రమోప సంహారములు రెం డునద్వితీయ బ్రహ్మమునే బోధించుటవలన, యొక్కటే లింగము.

## (అభ్యాసలక్షణము.)

అభ్యాసమనగా,శ్రుతి॥ తత్త్వమసి ॥ శ్రుతివాక్యప్రకా రము, వాచ్యార్థవిలక్షణమగు ప్రత్యగాత్మయగునీవే, సజా తీయ, విజాతీయ స్వగతభేదశూన్యమైన పరబ్రహ్మంబని గురువులుపలుమారును బోధింప శిష్యుడును నేనేపరబ్ర హ్మమని, యెల్లప్పుడును వాడుకచేసికొనుట అభ్యాసమన బడును. ఇదియును ప్రత్యగాత్మనుగురించి ప్రత్యగాత్మన కే, అద్వితీయపరబ్రహ్మస్వరూపమును దెలియజేయుటవలన, రెండవలింగ్గము.

## (అపూర్వతా లక్షణము.)

అపూర్వతంబనగా ॥శ్రు॥ ఆత్రవానకిల సత్సోమ్యనని భాలస॥ అనుశ్రుతివాక్యప్రకారము–ఇతరప్రమాణములచే త, నెఱుగరాకుండుట. ప్రత్యక్షప్రమాణము, అనుమా

నప్రమాణము, ఉపమానప్రమాణము, ఆగమప్రమాణము, అర్ధాపత్తిప్రమాణము, అనుపలబ్ధిప్రమాణము, ఐతీహ్యప్రమాణము, సంభవప్రమాణము, అనెడి అష్టప్రమాణములలో ఉపనిషత్ప్రమాణమను పేరుగల ఆగమప్రమాణముచేతనే, అద్వితీయ పరబ్రహ్మము తెలియుపడుచున్నాడు గాని ఇతర ప్రమాణములచేత పరబ్రహ్మము తెలియబడడని పలుకుటయే అపూర్వతయగును. ఈఅష్టప్రమాణములలో నాస్తికులకు ప్రత్యక్షప్రమాణమును, తార్కికులకు, ప్రత్యక్షప్రమాణము మొదలు నాలుగు ప్రమాణములును, పౌరాణికులకు ఎనిమిది ప్రమాణములును, పూర్వోత్తరమీమాంసా శాస్త్రావలంబనులైన భాట్టీయ, ప్రాభాకరీయులకు ప్రత్యక్షము మొదలాఱుప్రమాణములును, గలవనియెఱుగవలయును. ఈయపూర్వతయును, అద్వితీయాత్మనే ప్రతిబాధించుచున్నది గనుక మూండవలింగము. అష్టప్రమాణములలో ఆగమప్రమాణమును తార్కిక వైయాకరణులు శాబ్దప్రమాణమని, శైవవైష్ణవశాక్తాదులు ఆగమప్రమాణమని, వేదాంతులు ఉపనిషత్ప్రమాణమని వాడుకొందురు.

(ఫలలక్షణము.)

ఫలంబనగా ॥ శ్రు॥ తస్యతావదేవ యావన్నవిమోక్ష్యేధసంపత్స్యే ॥ అను శ్రుతిప్రకారము, అద్వితీయాత్మ

స్వరూపుడైన బ్రహ్మజ్ఞానికి, ప్రారబ్ధకర్మము, నశింపక యుండువరకును, దేహేంద్రియాది సర్వప్రపంచము లు నసత్యమై తోచుచుండును. ప్రారబ్ధకర్మము నిశ్శేష ముగానశించెనేని, ప్రపంచము బొత్తిగాదోచక అద్వితీ యాత్మస్వరూపముగానేయుండుననుటయే ఫలమనబడును, ఇదియునద్వితీయ బ్రహ్మమునే ప్రతిపాదించుటచేత,నాలుగ వలింగమనబడును.

## (అర్థవాద లక్షణము.)

అర్థవాదంబనగా -॥శ్రు॥ అనేనజీవే నాత్మనానుప్రవి శ్య,, "యేనాశ్రుతం శ్రుతంభవత్యమతం మతమవి విజ్ఞా తంవిజ్ఞాతం" అనుశ్రుతివాక్యప్రకారము, ప్రత్యగాత్మయైన తనవిషయమును పరమప్రయోజనమని తెలుపక, బ్రహ్మవి ష్ణురుద్రాదిదేవతాంతర, మతాంతర, విషయములను ముఖ్యప్రయోజనములని తెలిపెడు సామాన్యప్రయోజన లక్షణములవిడిచి ఏవస్తువును వినుటచేత, వినబడనివస్తువు వినబడుచున్నదో, ఏవస్తువును మననముచేయుటచేత,మన నముచేయబడనివస్తువు మననము చేయబడుచున్నదో, ఏవస్తువునెరుగుటచేత నెఱుగబడనివస్తువు నెఱుగబ డుచున్నదో, అదేఅర్థవాదము. ఈఅర్థవాదమునకు స్వార్థ మందు తాత్పర్యములేక,అద్వితీయాత్మ స్వరూపమందే తా త్పర్యమగుచున్నది గనుక ఇది అయిదవ లింగము.

## (ఉపపత్తి లక్షణము.)

ఉపపత్తియనగా ॥శ్రు॥ వాచారంభణం వికారోనామధేయం మృత్తికేత్యేవసత్యం॥ అనుశ్రుతివాక్యప్రకారము స్వర్ణంబువలన పుట్టిన, కటకమకుటకేయూరాదులున్ను, అయస్సువలనబుట్టినఖడ్గాది ఆయుధములున్ను, కారణముకంటే భిన్నంబుగాదోచినప్పటికిన్ని యీకార్యాదులకు చ్చారణంబు వినాగా నర్థంబులేదు గనుక కారణవ్యతిరిక్తంబుగా గార్యంబులేదనెడి యుక్తి ఉపపత్తియని చెప్పబడును. ప్రసిద్ధంబుగాదోచునట్టి జగత్తున్ను, ప్రత్యగాత్మస్వరూపంబైన బ్రహ్మంబుగాన దృష్టాంత స్వరూపమైన యీజగత్తును ప్రత్యగాత్మకభిన్నత్వంబు ప్రతిపాదించుచుండి ప్రత్యగాత్మకు అద్వితీయంబును సూచింపుచున్నది గనుక యిదియారవలింగంబనిచెప్పంబడును. యీప్రకారంబుగా షడ్విధలింగంబులచేతను, శ్రుతులకు తాత్పర్యము యెవ్వడు నిర్ణయింపుచున్నాడో వానికి శ్రవణమాత్రముచేతనే అద్వితీయమైన బ్రహ్మజ్ఞానము కలుగును సందియము లేదు.

## బ్రహ్మవిదాదులు చతుర్విధములై యుందురనుట.

॥శ్రు॥ భూమిత్రయేషు విహరన్ముముక్షుర్భవతి, తురీయభూమ్యాంవిహారక బ్రహ్మవిద్భవతి, పంచమ భూమ్యాంవిహారక బ్రహ్మవిద్వరోభవతి, షష్ఠభూమ్యాంవిహారక

బ్రహ్మవిద్వరీయాన్ భవతి, సప్తమభూమ్యావిహారన్ బ్రహ్మ విద్వరిష్ఠో భవతి॥ జ్ఞానభూమిశ్శుభేచ్ఛాఖ్యా ప్రథమా స ముదీరితా । విచారణా ద్వితీయాతు తృతీయాతనుమానసీ। సత్వాపత్తిశ్చతుర్థీ స్యాత్తతో సంసక్తినామికా । పదార్థ భావనా షష్ఠీ సప్తమీ తుర్యగాస్మృతా॥ అనెడి వరాహో పనిషత్తు ప్రకారము. జ్ఞానభూములు మొదలు మూడుభూ ముల సంచరించువాడు ముముక్షుండు, నాలుగవభూమి యందు సంచరించువాడు బ్రహ్మ విత్తనువాడు, అయిదవ భూమియందు సంచరించువాడు బ్రహ్మవిద్వరుఁడగుదుడు, ఆఱవభూమియందు సంచరించువాడు బ్రహ్మవిద్వరీయుఁడ గును. ఏడవభూమియందు సంచరించువాడు బ్రహ్మవిద్వరి ష్ఠుఁడగును. శుభేచ్ఛ మొదటిజ్ఞాన భూమియని చెప్పబడి యున్నది. విచారణ రెండవభూమి, తనుమానసిమూఁడవది. సత్వాపత్తి నాలుగవది, అసంసక్తి అయిదవది, పదార్థ భావన ఆఱవది, తురీయ మేడవజ్ఞాన భూమియనబడున నియు.

మ॥ వినుమాపూర్ణ వివేకమాకసముదావేత్తై నరీతిన్ లన । ఘనసద్బ్రహ్మవిదుండుదద్వరుడుద ద్వర్యుం డనంబుత్రపా । వనత్ద్బ్రహ్మవరిష్ఠుడీ జనులలో వర్తిల్లుసీనల్వురం ! దునదద్వేత్తకు దద్వరాదుల కు జేతో భేదముల్లెల్పెదన్.,,

మ॥ మతితన్మాయుతతిం దగంగ్రియుల సన్మానింప
చుణ్ధైర్యసం । యుతుడై బ్రహ్మవిదుండు వెం
డియు స్వవిధ్యుక్తక్రియల్లోకసం । హితుడై పాయ
క తెల్వినల్పుదనకుఞ్ హేయంబులై నిష్ఠకుం ।
బ్రతిపక్షంబులుగా వెలింగిన సదా బ్రహ్మార్పణాప్ర
జ్ఞచేఞ ॥

చ॥ ఇతరులు ముప్పురుండిఖిరి యీశ్వరనిష్ఠ వెలుంగ
వారిలో । సతులవరుండు నిల్వదను వన్నరసమ్మ
లగోరువర్యుడం । చితగతిఁ దెల్పునన్యులెద జింతన
జేయుదు దన్నపానముల్ । సతతసమాధి నట్టులద
లంపకయుండు వరిష్ఠుడెంతయుఞ్.

చ॥ త్రిభువనదుర్లభామృతను ధీయుతులాగతి నెందరై
నద । చ్చుభమగు ముక్తియొండెయగు ఙ్ఞోణిస
మాధిప్రయామసభేదమే, విభవమొసంగునాగవర వి
శ్రుతవర్యవరిష్ఠులెందువా । రభయులు నిష్ఠదత్త్వ
విదుడందు గొఱంతయెసంగవాక్యముల్ ॥

అనెనుకై వల్య నవనీతము మేరకు, భూజలాగ్నివాయు
భూతములనంటియును నంటకయున్న మింటివలె వెలిగెడు
ఆయుషుల్పండజ్ఞానము బ్రహ్మవిదుడు, బ్రహ్మవిద్వరుడు బ్రహ్మవి
ద్వరీయుడు, బ్రహ్మవిద్వరిష్ఠుడు, అనుసలుప్పురతుండును

సమముగాప్రకాశించుచున్నను బ్రహ్మవిదునకును కడమను వ్వరకును గలిగినట్టి మనోవృత్తిభేదములను వివరించెద వినుము.

బ్రహ్మవిదుడు ప్రపంచజ్ఞానము కలవాడైనప్పుడు బ్రహ్మజ్ఞానమును విడువక సకలపుణ్యకర్మముల జేయుటచేత తనబ్రహ్మనిష్ఠ చెడునసెడు భీతిలేక తననిష్ఠకు కర్మములు విఘ్నకరములని వదలక తనవర్ణాశ్రమములకు తగినలౌకిక వైదిక రూపములైన సకలలోక కృత్యములను విమర్శించి లోకోపకారముకొరకు పుణ్యకర్మములను జేయుచుకర్మ ఫలములయందు అభిలాషలేక బ్రహ్మార్పణము చేయుచుండును.

బ్రహ్మవిద్వరుడును బ్రహ్మవిద్వరీయుండును బ్రహ్మవిద్వరిష్ఠుడును పరబ్రహ్మనిష్ఠనుపూని వెలుగుచుందురు. ఆమువ్వరిలో బ్రహ్మవిద్వరుడును శరీరమునిలుచుటకు తానేనిష్ఠనుండి మేల్కొని అన్నపానములగోరును. బ్రహ్మవిద్వరీయుడు శిష్యులుమేల్కొల్పనిష్ఠనుండి మేల్కొని అయన్నపానాదులను దీసికొనదలచును. బ్రహ్మవిద్వరిష్ఠుడు ఎడతెగని బ్రహ్మనిష్ఠలోనుండి తానుగాని యితరులుచేతగాని మేలుకొనుటలేనందున అన్నపానముల నెప్పుడును దలపకుండును.

భూలోక భువర్లోక సువర్లోకములయందలి జనులచేత బొందదరముగాని బ్రహ్మజ్ఞానముగల జీవన్ముక్తులు బ్రహ్మ

విద్, బ్రహ్మవిద్వర, బ్రహ్మవిద్వరీయ, బ్రహ్మవిద్వరిష్ఠులనె డు భేదములచేత ఎందఱైనను మోక్షమొక్కటేయగును. అని యాచార్యుడు పలుకగా విని ఓస్వామి బ్రహ్మవిదాదులకు దేహేంద్రియనిగ్రహము మొదలగు శ్రమలతోగూడిన నిష్ఠాభేదము లేమిభాగ్యమునిచ్చును, అనగా బ్రహ్మవిద్వర బ్రహ్మవిద్వరీయ బ్రహ్మవిద్వరిష్ఠులకు కర్మములు చేయుట చేత పుణ్యలోక సుఖములు కలుగును, చేయనందున పుణ్యలోక సుఖములు గలుగవనెడి భయము లేకయుందురు. బ్రహ్మవిదుడాభీతి లేకనే లోకులు చెడుదురనెడు భీతిగలిగి లోకోపకారముగ వేదోక్తములైన కులాచార ధర్మములగు స్నాన సంధ్యావందన జపహోమ వేదపారాయణ పితృతర్పణ వైశ్యదేవతార్చన అతిథిపూజలున్ను, శిష్యులకు వేదాంత శాస్త్రముల బోధించుటయును గలవాడగుట చేత నిష్ఠయందు గొంచెము తక్కువయయియుండునని తాత్పర్యము.

గీ॥ భూవరేణ్యయిట్టి పుణ్యాత్ముడగు యోగి, నిష్ఠుడగుచు కొంత భ్రష్టువలెను । మరిపిశాచ బాలమత్తులపోలిక । ధాత్రిదిరుగునొక్కతలపు లేక ॥ సీ ॥ అలయవస్థాత్రయము లదాటి మఱిలోనరజితాది పటికంబురాతిపైని । నిండు పున్నమనాటిపండు వెన్నెలవలె పట్టపగటి బట్టబయలుపో తె । నిండియుండియొరిగి నిబిడీకృతానందమై వెల్లుతుర్య

సమాధియందు। చిన్మయజ్ఞప్తియైనస్వాత్రమంత్రమాశ్రేషిం చి యదిదానే జెలగుచున్న, బ్రహ్మ విద్యాధురంధరుల్ బాహ్యమందు । జాతివర్ణాశ్రమాచారసంస్కృతులను । సన్యసించైన సంసారసంగులైన। యఖిల వ్యవహారులయి యెందురంటరధిప॥రామ స్తవము-

శ్లో॥ కర్మణైవ హిసంసిద్ధి మాస్తితాజనకాదయః ! లోకసంగ్రహమేవాపిసంపశ్యన్కర్తుమర్హసి । యద్యదాచ రతిశ్రేష్ఠ స్తత్తదేవేతరోజనాః । సయేత్ప్రమాణంకురుతే లోక స్తదనువర్తతే॥ అనుగీతాచార్యులవచనప్రకారము, జనకాదులు బ్రహ్మనిష్ఠులైనను నిష్కామసత్కర్మానుష్ఠా నులై ముక్తులైరనియును పెద్దలుబహిర్ముఖులైన సమ యమందు బ్రహ్మనుద్దేశించి విధినిషేధప్రాయచిత్తకా మ్యక్రియలు తాము చేయని యెడలవారే చేయలేదే మన కేలయని పామరులాపెద్దలహృదయములను దెలియక సత్కర్మములను విడిచిభ్రష్టులగుదరనియు, తాముచేయు సత్కృత్యములను జూచిభగవదాజ్ఞలగు వేదశాస్త్రము లకు భయపడి పామరులు పుణ్యకర్మములనుచేసి పిమ్మట చిత్తశుద్ధి గలిగి బ్రహ్మవేత్తలగు ముక్తులగుదురని జగ స్థితము గోరినవారనియును- తెలియవలెను.

## వైరాగ్యలక్షణవివరణము.

మోక్షాపేక్షగలవానికి, మొట్టమొదట దిట్టముగా

శుద్ధవైరాగ్యమొకటి పట్టుపడవలసియున్నది. వైరాగ్యము లేనిదే యథార్థజ్ఞానము కలుగనేరదు. ఆవైరాగ్యమును శుద్ధమని యశుద్ధమని రెండువిధములుగానుండును. వానిస్వరూపలక్షణము గొంత వివరించెదవినుము, 1-పురాణశ్రవణముచేయునపుడు మాత్రము సత్యమును విడువకూడదనియు, పాపమును జేయగూడదనియు, ధర్మమును దప్పగూడదనియు, భగవద్ధ్యానమును మఱవకూడదనియు,తలంచుకొనుటపురాణవైరాగ్యము.2-పీనుగునుమోసికొని కాటికిబోవునప్పుడుమాత్రము, ఎక్కడిజీవితము ? ఎక్కడిసంసారము ? ఎక్కడిసుఖము ? యీప్రపంచమంతయు నింద్రజాలమువంటిది, ఇంతమాత్రమునకు జనులు తలక్రిందులుపడియెదరు మనముగూడ నొకదినము పోవలసినవారమేగామా ? యనియుపన్యసించుచు విచారపడుట స్మశానవైరాగ్యము. 3-ప్రసవవేదన పడునప్పుడు మాత్రము, పురుషసాంగత్యమునిక నెన్నటికి గోరనని నిశ్చయించుకొని పురుడుతీరినతోడనే భోగమునకేకారు పడతులవలె గుటుంబమునందొక సంకటము గలిగినప్పుడు మాత్రము ఈపాడుసంసారములో నున్నంతవరకు దుఃఖమేగాని సుఖము లేదనియు నెంచుకొనుట ప్రసూతివైరాగ్యము. 4-ఇంటబుట్టిన కలహామునుబట్టి మనసువికలతజెందినప్పుడుమాత్రము ఇకనిమిషమైన నిక్కడనిలువగూడ

దు, వీరితోటిపొత్తు మనకు యుక్తముకాదు, ఎవ్వరికిని జె ప్పక దేశాంతరము లేచిపోయి స్వేచ్ఛగా దిరుగుచు పుణ్య స్థలములను పుణ్యతీర్థములను సేవించుకొని యుండుటమే లని తలపోయుటచపలవైరాగ్యము, 5-ఇష్టమున్న పదా ర్థముల సంతుష్టిగా మెక్కుచు, కండకావరమున బ్రుల్లి పడుచు, యత్నపూర్వకముగా శత్రువులను నిర్మూలముము చేయువరకు పగసాధించుట రాక్షసవైరాగ్యము. 6-విరిం చితలద్రుంచివేసినందున శివునకు సంభవించిన బ్రహ్మహత్య దోషమును నారాయణమూర్తియే నివారణచేసినందున నారాయణుడే పరతత్వమనియు, బ్రహ్మయును విష్ణువును హంసవరాహరూపములనుధరించి యూర్ధ్వాధఃప్రదేశము లనంతయు నెంతయుజాగ్రతతో వెదకియు దుదకుశివుని యాద్యంతములు కనుగొనలేక నేపోయినందున పరమశివు డే పరతత్వమనియు, తమమతమును నవలంబించిన వారి కిదప్పనితరులకు మోక్షము లేదనియు, దుర్వివాదములకు గాలుద్రవ్వుచు ద్వైవములదూషించుట మతవైరాగ్యము. 7-కారణాచార్యుల నాశ్రయించి కడతేరుటకుపాయము కనుగొనలేక కార్యగురువులకు బరిచర్యలచేయుచు న హంకారమమకారముల నభివృద్ధిపొందించు విషయ వ్యా సంగములకు జిక్కిచొక్కుచుండుట యజ్ఞానవైరాగ్యము. 8-అనిత్యదేహమునందలి యభిమానముచేత జిరకాలము

జీవింపవలెనని భావించుకొని, నానావిధములైన కాయకల్పములనుసాధించి, ప్రాణవాయువును వెలుపలకు రానీకలోపల నణచుకొని, నాదానందమున జొక్కుచు మిక్కిలి మక్కువతో నంతర్జ్యోతిని దర్శించి, చివరకు శూన్యబావమగుట హఠవైరాగ్యము. 9-వేదాంతశాస్త్రములసాంతముగా విచారణజేసి గురుముఖముగా సంశయ నివృత్తిచేసికొని, ప్రపంచమనిత్యమనియు, తానుసత్యమనియుబ్రహ్మమేతాననియు, సర్వము బ్రహ్మమయమనియు, ధృఢముగా దెలిసికొనియు, నిత్యానందప్రదమగు సుజ్ఞానమును సంపాధించుకొని సుఖింపక శుష్కవేదాంతములు పలుకుచు కేవలజఠరపూరణ పరాయణతచేత వర్తించుచుకాలమును వ్యర్థపుచ్చుట యశక్తివైరాగ్యము. ఇటువంటివైరాగ్యము లింకను పెక్కులుగలవు. ఇది యెల్లనశుద్ధవైరాగ్యములని చెప్పబడును, ఇదియాత్మ తరణోపాయమునకు సహాయమేమియుచేయు లేకపోయినను అహంకారమభివృద్ధి చెందుటకు మాత్రమత్యంత సహాయముచేయును. అహంకారమునకంటె మించిన యంతశ్శత్రువు మఱియొకటిలేదు. అహంకారమువలన గలుగునన్ర్థములకుబరిమితిలేదు. అహంకారమువలన మదమెక్కువగును. మదమువలన యుక్తాయుక్త వివేచనము లేక పోవును ? అందుచేత నాకార్యకరణములకు మహాసాహసము గలు

గున్ను ? ఆసాహసముచేత పాతకములు సంభవించును ? పాతకములవలన ఘోరనరకముల ననుభవింపవలసివచ్చును. యుద్ధసన్నద్ధుడై యుద్ధరంగమున నిలిచిన శత్రువు తనకత్యంతసమీపబందువై యున్నను, దాక్షిణ్యముచేత శిక్షించు శూరవరునివలెను, న్యాయస్థానమున గూర్చున్నప్పుడు శత్రులుమిత్రులు ధనికులు దరిద్రులు, ఆశ్రితులనాశ్రితులన్న, సాక్షికములేక నేర్పుగలిగి న్యాయప్రకారము తీర్పుచేసెడి న్యాయాధిపతివలెను, తత్వవేత్తలందరకును, సమ్మతమగునట్టి తత్వమిట్టిదని దిట్టముగా జెప్పవలసినదేగాని, పంక్తివంచన చేయుపాతకునివలెను, తనబిడ్డలని భావముతోజూచు లుబ్ధునివలెను మానమిదియవమానమిదియని తలంపని నీచునివలెను, తనవలెనితరజంతువుల నెంచని దయారహితునివలెను భూషణములకు సంతోషపడుచు దూషణములకు రోషపడునట్టి యాత్మద్వేషివలెను, మనస్సున నొకటి తలచుచు, వాక్కుననొకటి పలుకుచు; కాయమున నొకటిచేయుచు సంచరించు దురాత్మునివలెను. శైవమేముఖ్యమనిగాని, వైష్ణవమెముఖ్యమనిగాని చెప్పుటన్యాయముకాదు. మనుజులు కడతేరుటకు మార్గములు పెక్కులుగలవు ; జాగ్రత్స్వప్నసుషుప్తితుర్యతుర్యాతీతములను నవస్థలయిదును జీవులకెల్ల దుల్యములుగాని భిన్నములుగావు. గురునను గ్రహము సంపాదించుకొని

యవస్థాపంచకము విచారించినగాని తత్వము బయిలు బడదు. జ్ఞానహీనులకహంకారము నశింపదు. అహంకార నాశమే జ్ఞానమని పెద్దలు పలుకుదురు, లోకమందుగల జపములు తపములు ధ్యానములు మౌనములు భక్తులువిర క్తులు మొదలగునవి. యెల్లను జ్ఞానము లేకున్న నిష్ఫల మగును. పూజ్యమగు మోక్షరాజ్యమునకు శుద్ధవైరాగ్య మే ప్రధానమార్గమని పెద్దలువచింతురు.

శుద్ధవైరాగ్యమును బహువిధభేదములు గలిగియుం డును. 1-పిపీలికాది బ్రహ్మపర్యంతమును పరబ్రహ్మమేవ్యా పించినదనియు, పరిపూర్ణమగు పరబ్రహ్మమునకంటెదా ననుపదార్థము వేఱుగాదనియు, బ్రహ్మమొక్కటే నిత్య మనియు, తదితరములన్నియు, అనిత్యములనియు దృఢము గాదెలిసికొని కప్పనుమ్రింగు సర్పమువలె సహంకారమ మకారములు మొదలగుమనోవికారములనెల్లను మ్రింగివే యుట పూర్ణవైరాగ్యము, 2= ప్రపంచమంతయు నెండ మావులవలె మిథ్యయనియు,గామోపభోగవిషయములెల్ల ను మిసివేసినతమ్మునలె నపరిగ్రాహ్యములనియు. మనస్సున నిశ్చయించుకొని ప్రతినిమిషమునందును బాధకుచున్న సంకల్పములన్నిటినిసణచివేసి కామక్రోధలోభమోహ మదమాత్సర్యములను నరిషడ్వర్గములనుజయించి, నిర్మిర్గు ద్ధముగా గుటుంబవృద్ధినిగోరెడి జీవేచ్ఛను విసర్జించి,

యంతఃకరణములపంతతము మహదానంద రసమున మునిం
చి, తన్ను దా దెలిసికొని తన్మయముగానుండుట, తత్త్వవై
రాగ్యము. 3=గురువులయెడ భక్తివిశ్వాసములుగలిగి,
నిత్యమును సాధుసాంగత్యము జేయుచు, దానేపరబ్రహ్మమ
ని నెమ్మనమునసర్వదా మననింపుచు, దేహాభిమానమును
వదలి, సంకల్పవికల్పములకు నుల్లమున జోటీయ్యక మె
లుకవ గలిగి మెలగుచు, దనలోపల బరబ్రహ్మమును దర్శిం
చుచు, నిర్మలచిత్తతతో బ్రహ్మమునందుగలసి, విషయము
లనంటక సాక్షిమాత్రముగా వెలిగియుండుట సద్భావవైరా
గ్యము. 4=కర్మములు సర్వముగుణయుక్తములయినందు
న గుణాతీతుడైన తనకు గర్మయోగమువలన బ్రయోజన
ము లేదని నిశ్చయించుకొని, యేవిషయమునుగాని మన
సున దలంపకయు, నోటనుచ్చరింపకయు, మానమవలం
బించి, కేవలనిష్ఠానుభూతి యందద్వితీయమయి యలరుచుం
డుట యభావవైరాగ్యము. 5=స్వప్నప్రపంచముపోలె స
మస్తమును మిథ్యయని తలంచి సుఖదుఃఖములకు లోబ
డక దురాశకు జిక్కక నేను నీవనెడిద్వైతభావముమా
ని తానెతానై ప్రపంచసంబంధమగు వ్యవహారములకన్న
టికిదొలగి, పరవస్తువునందు గలసి, సుఖించుటకు బ్రయత్న
ము చేయుచు, నైహిక భోగములయందు లేశమయిన నను
రాగము లేక నిర్మలముగానుండుట, శుద్ధవైరాగ్యము.

6=సుఖదుఃఖముల ననుభవించుటకు పాత్రమైన యీగా
త్రము ప్రారబ్ధకర్మాధీనమనియు, ప్రారబ్ధకర్మఫలమే సుఖ
దుఃఖసంచయమనియు, మనసుననెంచుకొని దేహాభిమాన
మును, విధినిషేధములను బొత్తిగా వదలుకొని, సుఖదుః
ఖములను సమముగా భావించుచు, సంశయనివృత్తిచేసి
కొని సర్వోత్కృష్టమయిన తుర్యదృష్టితో సంతుష్టినొం
దుట—సుస్థిరవైరాగ్యము. 7=లోకమునందలి జీవులకు క
ర్మానుసారముగానన్నియు జరుగునన్న దృఢమగు నెన్నిక
తోనజ్ఞానావరణ విక్షేపములు మొదలగు ప్రతిబంధముల
నెల్లను, జ్ఞానాగ్నిహోత్రమున కింధనములుగాజేసి, మృ
త్యుభయము లేక బాలోన్మత్త పిశాచములవలె జరింపు
చు, ద్వంద్వసహిష్ణుభావము గలిగియుండుట విశ్రాంతి
వైరాగ్యము; 8=నిద్రాలశ్యములు, నిందాస్తుతులు మొద
లగు వికారములేవియు లేక పరవశతనొంది, అఖండశ్రవ
ణమననాదికమునందు గడతేటిపరమాత్మయందు గలసి
యుండుట సమాధానవైరాగ్యము. 9=శంకాతంకముల
నెల్లనివృత్తిచేసికొని, యకలంగమగు బుద్ధితో నాశరహితు
డై, నిర్విశేషుడై నిరామయుడయి, నిశ్చలుండయి, పరి
పూర్ణుడయి, వెలయుచున్న తనకుజననమరణములుపాపపు
ణ్యములు నరకమోక్షములు లేవనియు, మిథ్యారూపమై
న యీప్రపంచమంతయు దనయందే పొడముచు నడగు

చున్నదనియు దెలిసికొనియు, స్థిరచిత్తతతో నుండుటను విచారవైరాగ్యము. 10=అనాదియు ననిర్వాచ్యముసగు పరబ్రహ్మ ముపాధిరహితమయినదని తెలిసికొని, నిత్యానుకూలశీలుడయి, బంధరహితుడై, బ్రహ్మమునందునగలిసి పరబ్రహ్మము నిర్వికారముగనుక తనకు వికారములు లేవనియు, నామరూపములెల్లను గల్పితములు గనుక వానితో ప్రయోజనము లేదనియు, నిశ్చయించుకొని, నివాత దీపమువలె నిస్తరంగ సముద్రమువలె నిశ్చలతతో నుండుట నిర్వాణవైరాగ్యము. ఇటువంటి శుద్ధవైరాగ్యములింకను పెక్కులుగలవు, వీనివలన వివేకులకు నిస్సంశయముగా తత్వసిద్ధి కలుగును. తత్వసిద్ధియే కైవల్యమనబడును. ఇవి తప్పతక్కిన యశుద్ధ వైరాగ్యములన్నియు నజ్ఞానవృద్ధికి ముఖ్యసాధకములుగా నుండును. వాఙ్మానస గోచరములగునవి యెల్లను గల్పితములనియు, అవాఙ్మానసగోచరమై మూకత్వమును గలిగించు పదార్థమొక్కటే కల్పితముగానిదనియు, సదేసత్యజ్ఞానానందనిత్యనిర్మల లక్షణవిచక్షణమయిన పరబ్రహ్మమనియు, నాదిద్వైతమనియు, వేదాంతవేద్యమనియు, నాబ్రహ్మమునందైక్యమయిన వారికేయానందమనియు, నాయానందమే మోక్షమనియు పెద్దలు చెప్పుదురు. ఇట్లు మహాభక్తవిజయము. శ్లో॥ వైరాగ్యంచముముక్షుత్వం తీవ్రంయస్యతు విద్యతే। తస్మిన్నే వార్థవన్తస్యుః

ఫలవంతశ్చమాదయః ॥ ఏతయోర్మందతా యత్ర విరక్త
త్వముముక్షయోః। మరౌసలిలవ త్తత్ర సమాధేర్భాసమా
త్రతా॥=ఎవనికి మోక్షేచ్ఛ వైరాగ్యములతివడిగలవిగ
నుండునో, వానియందు శమాదులు ప్రయోజనకారులు
ఫలకారులున్ను-ఏపురుషునియందు వైరాగ్యమోక్షేచ్ఛ
లకు మాంద్యము కలుగునో వానియందు శమాదులు కను
బడుటెలాగున మరుభూమియన నీరులేని భూములయందు
నీటివలె దోచు యెండమావులరీతి కనుబడును. మఱియును

శ్లో॥ వైరాగ్యాన్నపరం సుఖస్యజనకం పశ్యామి పశ్య
త్మన స్తచ్చేచ్ఛుద్ధతరాత్మ బోధసహితం స్వారాజ్య
సాంమ్రాజ్యదుక్, ఏతద్ద్వారమజస్ర ముక్తియువ
తేర్యస్మాత్త్వమస్మాత్పరం సర్వత్రాస్పృహయా
సదాత్మని సదాప్రజ్ఞాంకురు శ్రేయసే-॥

అనేవివేక చూడామణిమేరకు మనోనిగ్రహశాలికి
వైరాగ్యమునకంటె వేరుసుఖసాధనము లేదు. యావైరా
గ్యమునిర్మలతర పరమాత్మ జ్ఞానసహితమై స్వరూపసాం
మ్రాజ్యమున్ను పిరుకును యిదియెనిరంతరమున్ను ముక్తి
కాంతకు వాకిలిద్వాన నీవు శుభముకొరకు చిన్మాత్రవృత్తిని
చేయుమనియు

క॥ వైరాగ్యంబింతటికిని, గారణమానందకరము,
గావుననది చే, కూటినసమస్తమునము, కూరుం
డనుదానపరమ గుహ్యామిందినుతా."

అనెడుసీతారామాంజనేయ సంవాదము మేరకు, కు
మారా? ఈచెప్పబడిన సమస్తమునకును, విరక్తిహేతు
వైనదియును, బ్రహ్మానందమును గలుగజేయునదియునై
యున్నది. గనుక ఆవైరాగ్యము లభించనేని భోధోపర
తులతోగూడిన సమస్తము తనంతటతానే ప్రయత్నము
లేక సమకూరును-ఇదియేపరమ గుహ్యమనియు ఇట్లు, శ్రు
తిస్మృత్యాదులుచే వైరాగ్యంబును ముఖ్యంబనబడెను.

తన్నెఱిగి తన్మయంబైనవారే జీవన్ముక్తులనుట.

శ్రు॥ తత్రకోమోహః కశ్శోకః ఏకత్వమనుపశ్యతః ।
తరతిశోకమాత్మవిత్ । భిద్యతే హృదయగ్రంథి
శ్ఛిద్యంతేసర్వసంశయః । క్షీయంతేచాస్యకర్మాణి
తస్మిన్దృష్టేపరాపరే ॥ అనుప్రమాణమురీతిగా
సర్వముతానైన పరబ్రహ్మమే, తానని తెలిసి తనకం
టెనన్యమైన పదార్థమున్నదని యెన్నక సదాసర్వ
ముతానైన తన్నుతాను చూచుకొని యుండెడి
జ్ఞానికి శోకమోహములు లేవు. అతడు జననమరణా
దిదుఃఖసాగరమును యేయొక్క విఘ్నములు లేక
దాటినవాడై సార్వ దాతన్మయమునొంది నిత్యా

నందంబుజెందును. అతనికి సకల గ్రంథులను సకలసందేహములున్ను,సకలకర్మములున్ను, నశించి బ్రహ్మస్వరూపుడగుచున్నాడనియును-మఱియును.

శ్రు॥ జీవఃపంచవింశకస్స్వకల్పిత చతుర్వింశతి తత్వంపరిత్యజ్య। షడ్వింశపరమాత్మాహమితి నిశ్చయాత్ జీవన్ముక్తో భవతి॥ అనెడి మండల బ్రాహ్మణోపనిషత్తుప్రకారముఇరువదియైదు తత్వములతోగూడి జీవాత్మగానుండెడి, తాను? దేహేంద్రియాది, 24 తత్వములు తానుకాదనుచు, వాటియందలి భ్రాంతిని విడిచిపెట్టి-26-వ తత్వమైన పరబ్రహ్మమే తానని దృఢనిశ్చయము గలవాడె జీవన్ముక్తుడనియును-మఱియును.

మ॥ అనపేక్షుండసమానుడై ధనికదీనాలాపముల్ వీనులకా। వినకే కర్తృదేహావేష్టలన్ గన్ వీక్షింపకే నిత్యముం। దనుదాజూచుచు భావనాత్మకను తీర్థశ్రేణినత్యంతపా। వనముంగా నొనరించుచుండెలగుజీవన్ముక్తుడానందుడై.॥

అనుసీతా రామాంజనేయ సంవాదప్రకారము-బ్రహ్మవిద్వరిష్ఠుడగు జీవన్ముక్తుడు నిత్యానందము గలవాడును, ఇహపరలోకమందు గలిగెడు సుఖములయందిచ్ఛలేని

వాడును, సాటిలేనివాడును, ధనవంతులయొక్కయుంబేదవాండ్ల యొక్కయు పలుకులనాలకింపకయును, యజ్ఞానాకృత్యం బునొనర్చువారిని వీక్షింపకయును, సర్వకాలములయం దును ప్రత్యగాత్మయైన తన్నుతాను వీక్షించుకొనుచు నిర్మలమగు ఇడాపింగళాసుషుమ్నానాడీ మయమగు గంగాయమునా సరస్వతీపుణ్యతీర్థములను మిగుల పవిత్ర ములైనవిగా జేయుచు ప్రకాశించునని తాత్పర్యము.

గీ॥ దోసముల్లువంటి తురియమందాత్మను। జూచియా
శలనటు గోసివేసి, వాసనదెలిసిన వాడెపోబ్రహ్మం
బు। విశ్వదాభిరామవినరవేమ॥

వేమన్నగారివాక్యప్రకారము,, అవస్థాత్రయవిలక్షణ మగు తురియమందు, అతీతానందమగు ఆత్మను సద్గురు కృపచేనెఱిగి ఆశలగు, దేహేంద్రియాది నామరూప ప్రపం చములున్ను దానివాసనలున్ను అసత్తుపరచితనయొక్కల క్షణమగు సువాసన తెలిసిన మహానుభావుడెవడో వాడె స ర్వవ్యాపకమైన పరబ్రహ్మమగుతన్ను, దానెఱిగినవాడగు టవలన, ప్రతిమానవుడున్ను, తన్నెఱుగు వివేకమును సం పాదించుటకు ప్రయత్నముసేయుట అవశ్యకమని యెఱు గవలయు.

ఉ॥ స్వప్రభవెల్గు సర్వఘనసాక్షికి వేఱొకడుండునన్న
నా। స్వప్రతిపత్తిచెందునన వస్తుగుతర్కము నస్తు

లంబుగా। విప్రవరేణ్యా శూన్యమవివేకముచేనగు
దానిసర్వదృ। శ్యప్రతతిందొలంగికని స్వాత్మను
దత్సుఖమొందుమా త్తలోక॥

అనెడికైవల్య నవనీతము నొడివెడిప్రకారము, స్వ
యంప్రకాశముచేత వెలిగెడు సర్వసాక్షియగు తానైన
ప్రత్యగభిన్న పరబ్రహ్మమునకు సాక్షిమఱియొక్కడు కల
డని వాదించువాడు తనకుతానే శత్రువై నిలుకడలేని
దోషమును బొందును, అందునవాడు కడతేఱడు కనుక
సర్వదృశ్యములను అవినశించిన వెనుక తోచెడు శూన్య
మును మాయాకల్పితములని అవి తానుగానని నిరాకరిం
చి తానుతానైన పరబ్రహ్మమును అపరోక్షజ్ఞానముచేత
దర్శించి ఆనందింపుమని, తాత్పర్యము. కం। తనుదాగా
నని మనుజుని మనము నిరోధింపబడక మసలుచుదిరుగు॥
ధనుదానన్సత్పురుషుని మనమానందాబ్ధియందు మగ్నత
నొందు॥ అనెడిసీతారామాంజనేయము॥ స్వాత్మస్వరూపుడైన
తన్నుతాను దెలిసికొనని మనుష్యునియొక్కమనస్సులో
బడకల్లోలత్వముగలదగును సంచరించును ప్రత్యగాత్మ
మైన తన్నుతానుగను సత్పురుషుని మనస్సు బ్రహ్మానంద
సముద్రమునందు మునిగియుండునని తాత్పర్యము.

బ్రహ్మజ్ఞాని కర్మములు జేసినను జేయకునివాడనుట.

శ్రమః రాగద్వేషభయాదీనా మనుభూయాపంచరత్నపి।

యోంతరోవ్యాపు వదత్యచ్ఛ స్సజీవన్ముక్త ఉచ్యతే అనెడిపరా హెూపనిషత్ రీతిగా ! జీవన్ముక్తుడగు బ్రహ్మజ్ఞాని రాగద్వేషాది వికారములు గలవానివలె నటించినను నిర్మలాకాశమురీతిగానే వికారములు లేక పరిశుద్ధాంతఃకరణసిద్ధి బొందియుండుననియు.

శ్రుతి॥ శైలూషో వేషసద్భావా భావయోశ్చయథాపుమాన్ ! తథైవబ్రహ్మవిత్ శ్రేష్ఠస్సదాబ్రహ్మైవ నాపరః॥ అనెడిఆత్మబోధోపనిషత్తు రీతిగా, బ్రహ్మవిత్తగుజీవన్ముక్తుడు ఒకవేషగాడు స్త్రీవేషము ధరించి స్త్రీమేరకభినయించి నప్పటికిన్ని తాను పురుషుడుగానే యుండినట్లు సకలమైన ప్రవర్తనలు జేసినప్పటికిన్ని చేయనివాడగుచు బ్రహ్మస్వరూపముగానే యుండునని తాత్పర్యము.

శ్లో॥ గుంజాపుంజాదిదహ్యేత నాన్యారోపితవహ్నినా, నాన్యారోపితసంసారధర్మానేవమహంభజే ॥ అనెడి వేదాంతపంచదశివాక్యరీతిగా, ఒకడు పూసగురువిందబంతిచెండునుజూచి, అదియగ్నివలె ఎఱ్ఱగానుండుట చూచినవాడై భ్రమించి అగ్నియనిభావించినప్పటికిన్ని దానికి అగ్నిగుణములులేనట్లు లోకులకంటికి ఆత్మజ్ఞాని సకలవ్యవహారములుగలవాడుగా దోచినప్పటికిన్ని అతడే వికారములులేక

కేవల బ్రహ్మస్వరూపుడుగానే యుండును. అతని కేదియు సంబంధించవు.

చం॥ పరపురుషానురక్తిగల భామిని యెల్లపనుల్ గృ
హంబునం ! బొరిబొరి జేయుచుం బ్రియుని పొందు
సుఖంబుగ జూచురీతిభా । స్వరపరతత్త్వవేదినిజ
వర్ణనిజాశ్రమ యోగ్యధర్మముల్ । నిరతము స
ల్పుచుంబరమ నిర్మలసౌఖ్యముగాంచు నెమ్మదిన్.॥

తాత్ప—పరపురుషుని యందనురాగముగలవనిత తన యింట నన్ని కార్యములను క్రమముగా జేయుచు జారపురుషుని సాంగత్యము సుఖముగా దలచినట్లు ప్రకాశించుపరబ్రహ్మమును దెలిసిన బ్రహ్మవేత్త బ్రాహ్మణాది వర్ణములలో నిదియగు తనవర్ణమున కును, బ్రహ్మచర్యాదాశ్రమములలో తనకైనయా శ్రమమునకును తగిన పుణ్యకృత్యముల నెల్లప్పుడా నప్పుచు స్వసచిత్తతచే నిర్మలమైనదియును త్రిమ లరహితమయినట్టిదియునునగు బ్రహ్మానందమును పొందుననియు,

శా॥ గానంబున్నటనంబు దాళగతులంగావించుచుం
జాలవి, ధ్యాసై పుణ్యము జూపుచున్ శిరమువిూ
దం గల్గు పెందొంతరం, బూనం గైకొనునాట్య

శీలునిగతిక్ బుంఖానుపుంఖోజ్వల, న్నానార్థాను
భవజ్ఞుడయ్యెబుధుడానందాత్మగాంచుక్ మదిక్॥

చ॥ స్వకృతవిచిత్రపట్టణ మసన్మయమంచు నెఱింగి
భ్రాంతినొం। దకయిల నింద్రజాలకుడు దానిసృజిం
చువిధంబునన్నిజ। ప్రకృతికృత ప్రపంచమున భావ
ముగావివరించికాంచిత। ద్వికృతుల జెంద కేఘన
వివేకియొనర్చు సమస్తకార్యముల్.॥

మ॥ శివజీవైక్యసమాధియందు విలసచ్చిన్మాత్ర తత్త్వం
బుదా। నవలీలంగల పూర్ణుడై పిదప మాయా
సంస్మృతింజెందినం। దవుల్ నేర్చునెయోగి పాలు
పెరుగై ద్రచ్చంగ వేఱైనయా। నవనీతంబిక జిల్లి
లో గలయునే నానాప్రకారంబులక్.॥

తోట॥ చారువివేకియ సారమహాసం సారముజెందియ
సంగతనుండుక్। నీరజపత్రము నీరమునే ప్రొద్దా
రయ నంటియునంటనిభంగిక్ ॥

అనడిప్రమాణమురీతిగా సంగీతమును, నృత్యమును, మృదాదితాళము, మొదలగు తాళములయొక్క గతుల నొనర్చుచు, మనోహరమగు విద్యాజారు, నొక్కు, డాలు, మొదలగుదశవిధ గమక భేదముతోగూడిన సంగీధవిద్య యందలి నేర్పును జూపించుచు తలమీదనుండెడు గొప్పదైన కలశపంక్తిని ధరించుటకు జేకొనెడు నాట్యవిద్యా

సామర్థ్యముగలవానివలె తండోపతండములై ప్రకాశించు నట్టి, యింద్రియార్థములయందలి సుఖానుభవముగలవాడ య్యును బ్రహ్మవేత్తసచ్చిదానంద స్వరూప పరమాత్మను మనస్సునందు జూచుననియు, మఱియును, భూమియందు గారడివిద్యవాడు తనవిద్యచేత నిర్మింపబడిన ఆశ్చర్యకర మైన పట్టణమును దబ్బరయని తెలిసికొని భ్రాంతినొందక అమ్మాయానగరమును నిర్మించువిధమున బ్రహ్మజ్ఞాని తన మనస్సుచేత గల్పింపబడిన పంచభూత వికారమగు ప్రపం చమును శూన్యమనితలచి అట్టిమాయావిశిష్టమగు ప్రాపం చిక షడ్విధవికారములను జెందకయే వర్తమానకార్య ములెల్ల నొనర్చుచుండుననియు-మఱియును. బ్రహ్మవేత్త నిత్యమంగళస్వరూపుడైన పరమాత్మయొక్కయు, కించిద్జ్ఞ త్వాదిగుణరహితుడైన ప్రత్యగాత్మయొక్కయు ఐక్యము తోగూడిన నిర్వికల్పసమాధియందు ప్రకాశించుచున్న వి జ్ఞానస్వరూపమైన యథార్థపరబ్రహ్మమును దానైనయోగి అనాయాసముగాదర్శించి పరబ్రహ్మమై ప్రకాశించును అట్లు పరబ్రహ్మమైన తరువాత మాయామయమగు సం సారమున్నను, బొందినను క్షీరము పెరుగై దానిని జిలుకగా, గల్గినవెన్నమరల, యామజ్జిగతో గలయ నేరనిపగిది, అవి కారముతోడను నేరదనియును-మఱియును. విచారింపగా తామరాకు జలమునెట్లెప్పుడు బొందకయుండును? అట్లనివిధ

మునసాధువైన బ్రహ్మజ్ఞాని నిస్సారమైనదియును గొప్పది యునునగు సంసృతిని జెందియు, కూడిక లేనివాడై యుండు నని తాత్పర్యము సీతారామాంజనేయసంవాదము.

ఉ॥ కామముఖారివర్గ మొక కాలమునన్వాల యందొ
లంగుని, పాకమతనప్పుడేనిలువ స్వాంతమునందు
లమియరప్పలం, దామరసచ్ఛదంబుగతి దత్త్వవి
దుల్విహరింతు రెల్లెడం, బామరమూకులట్లదమ
ప్రజ్ఞలజూపకకూడిలోకులకా॥

అనుకై వల్య నవనీతముప్రకారము-కామము క్రోధము మోహములోభము మదము మత్సరమనెడి అంత శ్శత్రువులు బ్రహ్మనిష్ఠుల హృదయములయందొకవేళ ప్రకాశించినను వారువైరాగ్యవృత్తి గలవారగుటవలన నాకామక్రోధాదుల దమహృదయములయందు నిలువ నీయరు. బ్రహ్మవేత్తలు నీటియందు తామరాకున్న విధ మున లోకులతో జేరికొని తమమహిమలను లోకులకు జూపక యేమియు దెలియనివారివలె దిరుగుచుందురు, గనుక ఇట్లు శ్రుతిస్మృత్యాది వేదాంతగ్రంధములునొడివె డుప్రకారము, జ్ఞానికర్మములు జేసియుజేయనివాడగును.

బ్రహ్మజ్ఞానులు ప్రాప్తానుసారమనుభవింతురనుట.

శ్రుతి॥ మనసోనిగ్రహీతస్య లీలాభోగోల్పకోపియః ।

తమేవాలబ్ధ విస్తారంక్లిష్టతాత్ బహుమన్యతే॥ అనాగతా నాంభోగానామవాంచనమకృత్రిమం। ఆగతానాంచసంభోగ ఇతిపండితలక్షణం॥ నత్యజంతినవాంఛంతి వ్యవహారంజ ద్గతం। సర్వమేవానువర్తంతే పారావారవిదోజనాః॥ అను మహోపనిషత్తురీతిగా ఈజగత్తులోపల మనోజయము గలిగి విషయసుఖములందు విరక్తుడైన జ్ఞాని ప్రాప్తాను సారముగా విషయభోగములు గొంచముగాలభించినను దానినికొండంతగొప్పగాతలచును,తనకులభించనిభోగము లను గోరక దైవాధీనముగా దనకులభించినవి ననుభవిం చుచుండువాడే పండితుడనియుజ్ఞానియనియు॥ ప్రారబ్ధా నుసారముగా సంభవించిన దుఃఖములను విడిచిపెట్టక, సుఖంబుల నాశించక సదాసమభావనగలిగి ఆత్మానుసం ధానము చేయువాడె జ్ఞానియనబడుననియు॥ మఱియు- శ్లో॥ ప్రారబ్ధం భోగతోనశ్యే త్తత్వజ్ఞానేన సంచితం। ఆగామిద్వివిధంకర్మతద్ద్వేషిప్రియవాదినోః॥ అనుప్రమా ణముప్రకారము యీఆగామి సంచితప్రారబ్ధములను తు దముట్టవిచారించి యివి అహంకారమునకుగాని, అహం కారసాక్షినైననాకుగాని, లేవనియెఱుగువాడే ముక్తుడని వేదాంత సిద్ధాంతము.

ప॥ అవివేకార్జిత కర్మసంచిత భవప్రారబ్ధ భేదంబు లౕ। భువిమర్త్యుల్విహరింతురందటులసంపూర్ణా

త్మవేత్తల్ గృషి। వ్యవహారాదులనైననల్పుడరు.
రాజ్యంబైనబాలింతురా । ర్జవవృత్తిందవమైనన
ల్పుదురుభిక్షుంబైనఘుచ్ఛాంతికై.

మ॥ గతమాగామి దలంచి చెందరువ్యథం గాతూహ
లంబాత్మనం, గతమాదానిపురాకృతంబని నిర్ణా
కాంక్షుంబరి గ్రాహ్యులై, మృతుడు జీవితుడయ్యె
నూష్ణఘృణి భూమిక్ సత్సుధారాశియై, పతితంబ
య్యెనన్ విచిత్రమనిస్వప్రజ్ఞావిదుల్గాంతురే.

ఉ॥ శేముషి శూన్యకర్మకులు జీవితులాగతి నాత్మ
వేత్తలీ। భూమిజరించుచున్ స్థిరతబూనియహ
మ్మతి బాసివెన్కనే, నేమమునం జరింపరన నింగి
తోలంగినభంగినన్నిటిన్, భూమిజలాదులైక్యము
లభోందినమాడ్కివసింతురెందులన్.

అనెడు కైవల్యనవనీతముమేరకు అజ్ఞానదశయందు జేయబడిన పూర్వజన్మమందలియిచ్ఛానిచ్ఛపరేచ్ఛ అనెడి త్రివిధ ప్రారబ్ధవిశేషములచేత మనుజులు పుడమియందు తిరుగువారు వారియందాప్రారబ్ధకర్మములచేత బ్రహ్మవేత్తలు దున్నుటను, ఉద్యోగముచేయుటను, వర్తకము చేయుటను, సప్తసముద్రములతోగూడిన రాజ్యమేలుటను శాంతస్వభావముతో గూడిన కాయిక వాచిక మా

నసికరూప తపస్సును జేయుటను ఆకలితీరుటకై తిరిపెమును
నెత్తుటను చేయుదురు.

ప్రత్యగాత్మయగుతనవివేకమును నెరిగిన పండితులు, కడచిన కార్యములను కాబోవుకార్యములను దలంచి, ఖేదమోదములనొందరు. అప్పుడు సంప్రాప్తమైన ప్రారబ్ధకర్మానుభవమును అనిచ్ఛచేత ప్రాప్తించిన అటులనేక సుఖదుఃఖములు వచ్చిపోవుట జీవకోటికి సహజమని గ్రహించినవారై «సుఖస్యానంతరం దుఃఖందుఃఖస్యానంతరం సుఖం,చక్రవత్పరివర్తంతేదుఃఖానిచసుఖానిచ» అను ప్రమాణమున్నది గనుక పూర్వమెప్పుడో చచ్చినవాడు బ్రతికివచ్చినాడని పలికినను,సూర్యుడమృతసముద్రమువలె చల్లనై భూమిమీదికివచ్చినాడని వాక్రుచ్చినను, రాకపోకలు మాయాకార్యములగుటవలన నామాటలు వింతగా స్వాంతమున దలచరు.

బ్రహ్మజ్ఞానములేక శ్రౌతస్మార్తనిత్యనైమిత్తిక కర్మములను ఆసక్తితో జేయుచు వర్తకము, జోతిషము, వ్యవసాయము, వైద్యము, ఉద్యోగము మొదలయిన వృత్తులచేత జీవించు మూఢులవలెనే బ్రహ్మజ్ఞానమందు పూర్ణులై చిత్తవిశ్రాంతి కలిగియుండు బ్రహ్మవేత్తలును సంచరించుచుందురు. అట్లు సంచరించు బ్రహ్మవేత్త లోకప్పుడు ఏమహత్వముచేత వెనుకటి నన్నిపనులను విడిచి [illegible]లవలెసంచరింపకయుందురు. అనిశిష్యుడడుగగా

భూమి జలాదులొకటితో నొకటి కలిసియున్న విధమున మూఘలతోగూడి తిరుగుచునాకాశముభూజలాదులొకటి, తోనొకటి కలసియుండియు గలయకున్న విధమునమూఘ లచేరికను విడిచి వర్తింతురు. ఇత్యాదిశ్రుతిస్మృతులచే బ్రహ్మజ్ఞానులు ప్రారబ్ధానుసారమనుభవింతురనబడెను.

## ఏ దేహము ముక్తినిబొందుదురనుట.

శ్రుతి॥ ఘటాకాశ మహాకాశ మివాత్మానం పరాత్మని । విలాప్యాఖండభావేన తూష్ణీంభవసదామునే॥ చిదాత్మనిసదానందే దేహారూఢమహాంధియం। నివేశ్యలింగ ముత్సృజ్యకేవలోభవసర్వదా ॥ అనెడు ఆత్మోపనిషత్తు రీతిగా, ఘటాకాశమహాకాశములు లేకమైనట్లు ఆత్మయే పరబ్రహ్మమనియు, బ్రహ్మమే ఆత్మయనియు, * ఐక్యభావ

---

* ఐక్యభావమనగా, చిరకాలమలినవాసనా బలీయముచే స్వస్వరూప జ్ఞానంబుమాని యన్యుండని భ్రమసియుండి యొకప్పుడు సచ్ఛాస్త్ర విచారణచేతను సజ్జనసాంగత్యము చేతను, స్వస్వరూప జ్ఞానంబుగలిగిబ్రహ్మంబుతానైయుం డుటఐక్యభావంబనియుజెప్పబడును. అపియువ్యావహారిక వార్తయేగాని యొకప్పుడును జీవబ్రహ్మంబులు వేరుగా నుండినదిలేదు. యొకటిగా గలుసుకొన్నది, లేనేలేదు. అనగాతనకు గలిగిన భ్రమనివారణమె ఐక్యభావమనబడును.

మును జెంది ఆత్మస్వరూపుడగు నీవే బ్రహ్మము, బ్రహ్మమే నీవని, నిశ్చయించుకొని, సకలతలంపులుమఱచిశిలరీతిగా జలించక కేవల జ్ఞప్తిమాత్రుండవై ద్వైతరహితుడవై మౌనస్వరూపుడ వై యూరకుండుము. దేహమే నేననెడి అజ్ఞానమునువిడిచి, ప్రత్యగాత్మయగుఆపరబ్రహ్మమే నేనని నిశ్చయించుకొని, నేనుస్త్రీని, నేనుపురుషుడను, నేనుకుల గోత్రములు గలవాడననెడిసకల భ్రాంతులను నాశము చేసి సకలమువమఱచి కేవలచిన్మాత్రుడుగా మౌనానందస్వరూపుడుగా నూరకుండుము. ॥శ్రుతి॥ జీవన్ముక్తపదం త్యక్త్వాస్వదేహే కాలసాత్కృతే। విశతిఅదేహము క్తత్వం పవనోస్పందతామివ। అశబ్దమస్పర్శమరూపమవ్యయం తథారసంనిత్యమగంధవచ్ఛయత్। అనాద్యనంతంమహతః పరంధ్రువం తదేవశిష్యత్యమలం నిరామయం ॥ యథా జలేజలంక్షిప్తంక్షీరంక్షీరేఘృతంఘృతే। అవిశేషోభవేత్తద్వత్ జీవాత్మ పరమాత్మనోః ॥ యథోదకే తోయమనుప్రవిష్టం తథాత్మరూపోనిరుపాధిసంస్థితః ॥ యత్రయత్రమృతోజ్ఞానీ ఏనవాకేనమృత్యునా। యదాసర్వగతం వ్యోమంతత్రతత్రలయంగతః। ఘటాకాశమివాత్మానం విలయం వేత్తితత్వతః। నగచ్ఛతినిరాలంబంజ్ఞానలోకంసమంతతః॥ అనెడుపైంగలోపనిషత్తురీతిగా జ్ఞానిప్రారబ్ధము నశించి నంతనే దేహత్రయ భ్రాంతినశించి దానితో

జేరిన జీవభ్రాంతియునశించి, జీవన్ముక్తిని విడిచి దేహముతో నట్టి విదేహముక్తింబొందును, అప్పుడుశబ్దస్పర్శరూపరస గంధములేని, నామరూపక్రియాశూన్య, ద్వైతరహిత సర్వోత్కృష్టమైన, ఏకోనిరామయ పరబ్రహ్మమే దానగు చున్నాడు. అదియే విదేహముక్తియనంబడును=జలము లోజలము, పాలులోపాలు, ఘృతములోఘృతముగలిసి యేకమగునట్లు ఈశరీరము నశించినంతనే, జీవోపాధిలేని బ్రహ్మమందాత్మకలిసి యేకమైపోవుటే విదేహముక్తి యనియు.=ఆ తత్వజ్ఞానియేయే చోటునయేయే విధముగా దేహవియోగము జెందినను, నెచ్చటనునిండినయా కాశమురీతిగా ఆయాచోటుననే, లయమగువాడు, ఘటాకాశమురీతిగా ఆత్మలయమగునని యెరుగవలయు= వాడునిరాలంబమైన జ్ఞానప్రకాశము నెచ్చటనుబొందు ను_॥శ్రుతి॥ ప్రారబ్ధకర్మపర్యంతమహినిర్మోకవద్వ్యవహర తి। చంద్రవచ్చరతేదేహీస ముక్తశ్చానికేతనః। తీర్థే శ్వపచగృహేవాతనుం విహాయయాతికైవల్యం॥అనుపైంగ లోపనిషత్తురీతిగా-ప్రారబ్ధకర్మము ముగింపయ్యేవరకు, పాము, తనకుసుమనువిడిచి దానియందభిమానము లేక తిరిగేలాగు జ్ఞానితనదేహమందభిమానము లేక తిరు గును. తనకొక చోటులేక చంద్రునివలె సంచారముచే యుచు బుణ్యతీర్థము లందైన, చండాలుని యింటనైన

దేహమును విడువవలయునవే నియమము లేకశరీరమునువి
డిచి విదేహకైవల్యము పొందును. మఱియు-సు॥ కల
శోపాధులు డిందనందుగల యాకాశంబులైక్యంబులై, వెల
యుచద్వాదుపాధులెల్లజెడనద్వైతవివేకుల్మదం, బలరన్
లోవెలినేకమై పరమమై యాద్యంతశూన్యంబునై, కల
యన్వెల్గు విదేహముక్తిగని సత్కల్యాణులై యుండరే'
అనెడి కైవల్యనవనీతము మొదలగు సద్గ్రంథముల రీతి
గా, బ్రహ్మజ్ఞాని ఎట్టిచోటనైనను, తెలిసితోనైనను, తె
లిసితప్పియైనను, యేలాగునైనను శరీరము విడిచినను,
దోషము లేదు. జాతినీతి మొదలగు సర్వదుఃఖములున్ను,
శరీరమునకేగాని తనకు లేదనియు, ఘటశరాదులు పగుల
గానె దానియందలి యాకాశము మహాకాశమున గలిసిన
విధమున; స్థూలసూక్ష్మ కారణ, మహాకారణ శరీరములు
నశింపగానే జ్ఞానులు, నిత్యానంద స్వరూపమును బొందు
దురు, అనగా నన్నిటికంటే నెక్కువనైనదియును పుట్టు
ట పెరుగుట గిట్టుటలు లేనిదియును, అంతటనిండి వెలుగు
చున్నదియును, అయినవిదేహముక్తినిపొంది, నిత్యమంగ
ళమైన పరబ్రహ్మ స్వరూపులై యుందురు-మఱియు॥ శా॥ ఏవే
ళన్భువినెట్టిచోటమఱి యేయేబాధలంబొందుచున్, జీవ
న్ముక్తుడు దేహమున్విడిచినన్ సిద్ధం బనాద్యంతమున్, భా
వాతీతము నిర్వికల్పము పరబ్రహ్మైక్యకంబై నయ్యా కైవ

ల్యంబును బొందు సత్యమనహంకారాత్మతత్త్వాత్మకా॥ అనె డుసీతారామాంజనేయ సంవాదమురీతిగా, అభిమానము లేనివాడవును అహంపదమునకు లక్ష్యార్థమైన పరబ్రహ్మ స్వరూపుడవును, నగుమోయాంజనేయా? బ్రహ్మవిద్వరిష్ఠు డు భూమియందేసమయంబున, స్థూలోపాధియైన శరీర మునకు ప్రారబ్ధముచేత ననుభవింపదగిన సుఖదుఃఖము లు గల్గునోయట్టి సుఖదుఃఖముల, దేహాభిమానములేక ననుభవించుచు దేహమును వదలినను నిత్యమైనదియును, పుట్టుటగిట్టుటలు లేనిదియును, వాఙ్మనసుల, కగోచరమై నదియును, వికల్పములేనిదియును, ప్రకృతిని నతిక్రమించి నదియును, ఆత్మస్వరూపమైనదియునగు, మోక్షము నొందువాడు-ఇందుకు సందేహములేదనియు ఇట్లుశ్రుతిస్మృ తులచే బ్రహ్మజ్ఞానులు విదేహముక్తిపొందుదురనబడెను.

## దృశ్యప్రపంచంబసత్యంబనుట.

శ్రుతి॥ యద్వై వశూన్యో వేతాళో గంధర్వాణాంపురం యథా। యథాకాశేద్విచంద్రత్వం తద్వత్ సత్యేజగస్థితిః॥ యథావంధ్యాసుతోనాస్తి యథానాస్తిమరాజలం। యథా నాస్తినభోవృక్షస్తథానాస్తిజగస్థితిః॥ అనెడు యోగశిఖోప నిషత్తురీతిగా బేతాళమనునదియును, గన్ధర్వనగరమున్ను, ఆకాశమున రెండుచన్ద్రులున్ను, యెట్లులేకుండునో ఆ లాగె సత్యజ్ఞానానందస్వరూపమగు బ్రహ్మమందు, జగత్తుం

డుటయు, వంధ్యాపుత్రుడున్ను యెండమావులందుజలము, ఆకాశవృక్షము, ఇవియెట్లు లేనివో ఆలాగె జగము లేనిదగును మఱియును.

శ్రుతి॥ శశశృంగేణనాగేంద్రో మృతశ్చేత్ జగదస్తి తత్ ; మృగతృష్ణాజలంపీత్వాతృప్తశ్చేత్ అస్త్విదంజగత్। నరశృంగేణ నష్టశ్చేత్కశ్చిదస్త్విదమేవహి । గంధర్వనగరే సత్యేజగద్ భవతిసర్వదా । గగనేనీలిమాసత్యేజగత్సత్యంభవిష్యతి । శుక్తికారజితంసత్యం భూషణంచేజ్జగద్భవేత్ । రంభాస్తంభేనకాష్ఠేన పాకసిద్ధిర్జగద్భవేత్ । కూర్మరోమ్ణాగజేబద్ధే జగదస్తు మదోత్కటే । జ్వాలాగ్నిమండలే పద్మవృద్ధిశ్చేజ్జగత్ అస్త్విదం । మశకేనహతేసింహేజగత్సత్యం తదాస్తుతే। స్వప్నదృష్టంచయద్ వస్తుజాగరేచేజ్జగద్భవః । వంధ్యాగర్భాప్తిత సౌఖ్యం జ్ఞాతాచేద్ అస్త్విదంజగత్ । కాకోవాహంసవద్ గచ్ఛే జ్జగద్భవతునిశ్చలం। మహాఖరో గజగతింగతశ్చేజ్జగదస్తుతత్ । సంపూర్ణచంద్ర సూర్యశ్చేజ్జగద్భాతుస్వయంజడం । భ్రష్టబీజసముత్పన్న వృద్ధిశ్చేజ్జగదస్తుతత్ । శునాంవీర్యేణసింహాస్తు జితోయదిజగత్తదా । శ్వానేనసాగరేపీతే నిశ్శేషేణజగద్భవేత్ । శుద్ధాకాశో మనుష్యేషు పతితశ్చేత్తదా జగత్ । భూమౌవాపతితంవ్యోమ వ్యోమపుష్పసుగంధకే। శుద్ధాకాశవనేజాతే చలితేతు తదాజగత్ ॥ అసాడితేజో

బిందూపనిషత్తురీతిగా కుందేటికొమ్ములచేత నేనుగుచచ్చి నయెడల జగత్తుసత్యమగును. ఎండమావులజలముపానము చేసియెవడైన దృప్తిపొందినయెడల జగత్తుసత్యమగును; నరునికొమ్ములచేత పొడవబడి ఎవడైనచచ్చినయెడలభువి సత్యముగానుండును-గంధర్వనగరము నిజమైనయెడలప్ర పంచమునిజమగును, ఆకాశమునందునీలవర్ణము సత్యమ య్యేనేని జగముసత్యమగును. శుక్తికారజితముచేత చేయ బడిన భూషణములు వాస్తవ్యమయ్యేనేని ప్రపంచమువా స్తవ్యమైనదగును, అరటిస్తంభములను కట్టెలుగాయుప యోగించి అన్నముడికి పాకమయ్యేనేని ప్రపంచము నిజ ముగానుండును, తాబేటిరోమములచేత గజముకట్టబడెనే ని ప్రపంచముసత్యమనబడును. జ్వాలాగ్నిమండలమున తా మరాకు క్షీణింపకుండినయెడల జగతి సత్యమనబడును, దోమచేత సింహము చచ్చినయెడల ప్రపంచముసత్యమ గును, స్వప్నమందుదోచిన పదార్థములు జాగ్రతయందు గనుబడినయెడలప్రపంచము నిజమగును, గొడ్రాలిబిడ్డసౌ ఖ్యముగా జీవించియున్నయెడల ప్రపంచము సత్యముగా నుండును, కాకిహంసరీతిగా సంచరించినయెడల ప్రపంచము సత్యమగును, గాడిదెసింహ్వముతో బోట్లాడి జయించినయె డల జగత్తునిజంబగును. గార్ధవముగజమురీతిగా గర్జించినే ని ప్రపంచముసత్యమగును. చంద్రబింబము సూర్యబింబము

